ప్రథమ ముద్రణము
1967 అక్టోబరు







ప్రతులకు

1. సంపూరు లక్ష్మీనరసింహారాయకవి
సంపూరు (P. O.)
బాపట్లతాలూకా

2. మాతృశ్రీ పబ్లికేషన్స్
బాపట్ల



కాపీలు 500
వెల : 5-00

ముద్రణ
మాతృశ్రీ ప్రింటర్స్
బాపట్ల

# విజ్ఞాపన

వేదములకైనను నశక్యమగు శక్తి స్వరూపమునకు [illegible] త్రియాదులను సమకట్టి వర్ణింప బ్రహ్మకేనియు దుస్సాధ్యము. అట్టి శక్తి [illegible] స్మరణ మాత్రముచేతనే సర్వపాపములడగి మోక్షమబ్బునని వాల్మీకి [illegible] "సీతాయాశ్చరితం మహత్! సీతాసందర్శనం పశ్చాత్ [illegible]" [illegible] శక్తి పక్షములో వాక్రుచ్చెను. సకలలోకాధి కారిణియు. లోకమున నేవస్తువుతోను పోల్చి యిట్టి దట్టిదని వచింపరానిదియు; స్వరూప స్వభావ మహిమాతిశయములు గలదియు. చేతనాచేతనముల యందన్నిటను వ్యాపృతమై యుండునదియు, ఉత్పత్తి స్థితి నాశములకు తానే కారణమైనదియు విద్య అవిద్యలు రెండును తనయందే గలదియు; వాక్పుష్టి జ్ఞానపుష్టి ఇంద్రియ పుష్టి క్షేత్రపుష్టి భాగ్యపుష్టి [illegible] పుష్ట భాగ్యపుష్టి యోగపుష్టి అను దశవిధ పుష్టులు తానే యైనదియు తానే [illegible] డియు జీవకోట్లకు ప్రాణరూపమైనదియు బుద్ధిమంతులకు సేవ్యానుకూలమైనదియు అణిమాద్యష్టైశ్వర్య వంతురాలైనదియు అగు శక్తిమహిమను వర్ణింప బ్రహ్మాదు లకేనియు నశక్యమన నిరంతరము సంసారాగాధ కూపములో బుడకలు వేయు అల్పజీవులకెట్లు సాధ్యమగును? ఇట్టి యల్పజీవులు సంసార చక్రములో బడి కొని తమపుణ్య పాపకర్మలచే బుట్టుచు చచ్చుచు విధివిరామములులేక [illegible] గని దయామయి యైన భగవతి వారి యజ్ఞానమును దొలగించి జ్ఞానవంతులనుగా నొనర్చి తన సాన్నిధ్యమును చేర్చికొనుటకు "విచిత్రదేహ సంపత్తి రీశ్వరాయ [illegible] విత్ పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్తపాదాది సంయుతాః." వారివారి కర్మాం తరువుల ననుసరించి దేవ మనుష్య తిర్యక్స్థావరాదులుగా ననేక రూపములగల్పించి తనసేవా సమర్పణ మొనర్చి కొనుటకు సమిష్టి వ్యష్టి రూపముల ననేక లోకము లను సృష్టించి తగినవారి నందందు పరిపాలకులుగా నియమించి వారియందు తన శక్తి నుత్పాదించి నదిని దాటగోరు వారికి పడవ నిచ్చినట్లు వారికి కళేబరమును కరచరణాద్యుక్తముగా నిచ్చెను. ఈ దుఃఖములే సుఖములుగా భావించి [illegible] గాంచి స్వాజ్ఞారూపమైన వేదశాస్త్రములనిచ్చెను. అట్లిచ్చినను కొందరు జ్ఞానముచే వానినిగూడ నుల్లంఘించుటను గమనించి తనయాజ్ఞలనింకను సుళువుగా [illegible] పుటకు యుగయుగంబునను తన యనుయాయులగు బోధకుల నంపుచుండెను.

ఈ వేదములకు భాష్యములు మొదలగు వానినివ్రాసి ఆ సూరహస్యములను వెల్ల డించినను తెలిసికొనజాలని మందబుద్ధులకొఱకు పురాణములుగూడ వ్రాసిరి. అవి (18) మత్స్య, మార్కండేయ, భవిష్య భాగవత. బ్రహ్మ. బ్రహ్మాండ, బ్రహ్మకైవర్త, కూర్మ స్కాంద; నారద. పద్మ. అగ్ని, వామన, వాయు, విష్ణు, వరాహ, లింగ, గారుడములు, శాక్తేయుడును, నారాయణ స్వరూపుడునునైన కృష్ణద్వైపాయనుడు ద్వాపరయుగాంతమున ఈ పురాణముల రచించెను. కడచినద్వాపరము సృష్ట్యాదిగా నిరువదియెన్మిదవదిగా తెలియుచున్నది. ఇట్లే ప్రతిద్వాపరమునకు వ్యాసులుండిరి. వారు—స్వయంభువు, ప్రజాపతి, ఉశీరుడు, బృహస్పతి. సవితృడు. యముడు, ఇంద్రుడు, వసిష్ఠు, సారస్వతుడు, త్రిధాముడు, త్రివృషుడు, భరద్వాజుడు, అంతరిక్షుడు, ధర్ముడు. త్రయ్యారుణి, ధనంజయుడు, మేధాతిథి, వ్రతి, అత్రి. గౌతముడు, ఉత్తముడు, హర్యవనుడు, సోముడు, తృణబిందు. భార్గవుడు, శక్తి, జాతుకర్ణుడు, కృష్ణద్వైపాయనుడు. కాని అల్పబుద్ధులు అల్పాయుష్కులగు నీకలియుగ వాసులు వీనిని తెలిసికొనజాలరని భక్తికే ప్రాధాన్యమిచ్చి ధర్మములపొందుపరచి భగవద్గీతాయుక్తముగా శ్రీమహాభారతమును (పంచమవేదము) రచించి దానిని ప్రకాశింపజేయ తనశిష్యులైన సుమంతాదులకు అప్పగించెను. భగవతి ధర్మము ననుష్ఠించుట కిన్నియేర్పాట్లు చేసినను ఇంకను మూఢులై అహంకారముతో సాధుజన బాధలొనర్చు దుష్టుల హతమార్చుటకు తగువారల కధికారమిచ్చి (తనశక్తి వారియందునిచి) పంప వారట్టి కృత్యములొనర్చి సాధుజనులను రక్షింపుచుందురు. వారికిగూడ అందనివారిని తానవతరించి సంహరించును. అట్టి గాథలలో కొన్నిటిని పొందుపఱచి వ్రాసినదే ఈ శక్తి పురాణము.

అట్టి పురాణేతిహాసములనుండి కొందరు కవులు కొన్నికొన్ని ఘట్టముల నన్వేషించి కావ్యనాటకాదులుగావ్రాసిరి. అందు రంగనాథుడు సోముడు, శ్రీనాథుడు ద్విపద కావ్యములనువ్రాసి పాఠకలోకమును ఆనందాబ్ధిలోల లాడించిన దెల్లరకు తెల్లమేకదా: ఇక స్వకీయము—

శా॥ శ్రీనాథుండు రచించె మున్ను జగతిన్ జిత్రావలీలలన్<br>
ఆనీతంబుగ రాను రానవియు పంకాది ప్రకాశంబునై<br>
పూనెన్ సుద్దులరూపు వీక భర పద్యావర్ణంబు లుట్టించగా<br>
నేనా సత్కవివాణిబట్టి ద్విపదన్ నిర్మించగా కోర్కెమై<br>
గానం జేసితి శక్తి గాథలను తత్కావ్యంబు వంతంబుగన్

నా బాల్యమునందు మాగ్రామములో కొలుపులు (శక్తి జాతరలు) జరిగెడివి. ఆ కాలమున గ్రామవాసులందరకును గ్రామశక్తులపై పూర్తి విశ్వాసముండెడిది. జాతరలు చేయకపోతే ఆశక్తులవల్ల గ్రామములోని ప్రజలకో పశువులకో జబ్బులు రావడంకాని కొంపలు దహనమై పోవుటగాని జరుగునని అప్పటివారినమ్మిక. వాటికి పంబల వైనేడు యాజ్ఞకులు. వారా జాతరలలోని ప్రతి విరామకాలములందును శక్తులకథలను ద్విపదలోచెప్పి ప్రజలకు వినిపించుచుందురు. అందు రెండుప్రక్కల నిద్దరు జంటగా పాడుచుండ మధ్యనొకడు శక్తిగాథలను చెప్పును, వారు ముప్పురును శృతిలయ బద్ధముగా రాగాలాపనచేయుచు మధ్యమధ్య ఎగురుచూ ఆడుచూ చెప్పుదురు మధ్యముడు తాను పాడుద్విపదకు అర్థమును జెప్పుచుండగా ప్రతివారు ఆనందములో లీనించెదరనుటకు సందేహములేదు. అప్పుడు నేనుగూడ మాతండ్రి గారితోపోయి కూర్చొని వినెడివాడను. కథవిని ఆనందించుటయేగాని అందలి తప్పొప్పులతో ఎవరికిని పనిలేదు. కొంత గ్రాహ్యతనెఱిగి వాట్లనుగూర్చి విచారించగా తొల్లి శ్రీనాథుడిట్లు వ్రాసెననియు అముద్రితమైనందున అయన వ్రాతలో కొంతలోపించి యాలుప్త భాగమితర్లచే పూర్తిగావింప బడెననియు తెలిసినది. కాని నేనాద్విపదను విన్నప్పుడు అనంతమైనశక్తి లీలలలో ఏకథాభాగమునేనట్లు ఎప్పుడు వ్రాయుదునాయని తలచుచూ అందుకై యువ్విళూరుచూ ఆనాగాథల నన్వేషించుటకై మొదలిడితిని. తుదకెట్లో మొండిధైర్యముతో కొన్నికథలను చిత్తుగావ్రాసితిని. అపుడపుడా చిత్తుపాఠమును నాలోనేను చదువుకొనుచూ నా మిత్రులకు పెద్దలకు చదివి వినిపించుచూ ఆనందించువాడను. దానిని విన్నవారిలో శ్రీ ఆనందాశ్రమ కర్తలు పూజ్యులునైన శ్రీ శ్రీలక్ష్మీకాంతానందయోగిగారు కూడ నొకరు. ఈ ప్లవనామసంవత్సర కార్తీక శుద్ధములో ఆయాశ్రమములో జరిగిన నవరాత్రుల పూజలకు ఒక్కనాడు నేనును అచటికేగితిని. (15—11—19 1) అప్పుడు శ్రీయోగిగారు నన్నుజూచి "నమకమంత్రపాఠమును తెనుగు పద్యములుగా ననువదించి శ్రీ మేధా దక్షిణామూర్తి స్వామివారికి కృతినిచ్చినట్లే శ్రీ గాయత్రీ అమ్మవారికిగూడ నొక గ్రంథమును కృతినిచ్చిన భార్యాభర్తల కిరువురకు సమాన ప్రేమాస్పదుడవౌదువుకదాయని నవ్వుచూ సూచించిరి. వెంటనే యుత్సాహమొదవినది. అమ్మవారి మూర్తినుండియు అట్టి శుభకాంక్షా పూరితమైన చిరునవ్వొలసినట్లు నాకు గోచరించినది, ఇంతలో నాకు ముఖ్యబంధువున్ను అత్యంత ప్రేమాస్పదుడునైన చి॥ కొమ్మరాజు జ్వాలా లక్ష్మీ నరసింహారావుకూడ అట్లే ప్రోత్సహించెను:—

# శక్తిపురాణము



శ్రీగణాధిపుని నా చిత్తమందుంచి
వాగీశ్వరిని భక్తి వర్ధిల్లఁదలచి. 1

భార్గవీశక్తి హృత్పద్మమందెంచి
దుర్గనంతట భక్తితోడ నుతియించి. 2

ధాతనెంతయువేడి దైత్యారి కెఱఁగి
భూతనాథుని వేడ్కఁ బూజగావించి. 3

అమరసంతతి నెంచి యంత మునీంద్ర
సమితికి నే ధాత్రి సాగిలిమ్రొక్కి. 4

భద్రకాళిని గొల్చి భ్రమరాంబ కెరగి
రౌద్రివైష్ణవులను రాధసేవించి. 5

కోలాపురపు లక్ష్మిఁగొల్చి హింగుళను
జ్వాలాముఖిని మహా జయభద్రనెంచి. 6

అన్నపూర్ణను బుష్కరాక్షి శివగౌరి
నెన్ని యేకాంబరి కెంతయుమ్రొక్కి. 7

జంబుకేశ్వరి నెన్ని చండికామాక్షి
నంబమీనాక్షి గాయత్రి త్రిలింగ. 8

లోనుగాగలశక్తి లోకంబు దలచి
మానుగాఁబరమాత్మ మహిమఁగీర్తించి. 9

పంచభూతావలి న్భావించి సృష్టి
నెంచి పురాణంబు లెన్ని నామదిని. 10

వ్యాసు జైమిని గర్గ వాల్మీకిఁగాళి
దాసు భారవి మాఘు దండి భవభూతి. 11

దలచి నన్నయభట్టు దగ సోమయాజి
కలుగునెఱ్ఱనమంత్రి ఘనపోతనాది. 12
కవిశతంబులనెంచి ఖడ్గహస్తులును
అవిరళతేజులై నట్టిమావంశ. 13
కర్తకౌగోవింద ఘనకొండనాది
కీర్తిశేషులనెల్లఁ గీర్తించి పిదప. 14
మనవిఁజేసెదనాదు మహితాన్వయంబు
తనరెడితుంగభద్రాతీరమందు. 15
మునిగోష్ఠి ధాత్రిపై మోదమేపారఁ
దనరునండూరనె దంటనగరంబు. 16
దాని నిల్పిన మహా ధర్మతత్పరుఁడు
గూనిగోవిందనె కోవిదోత్తముఁడు. 17
మావంశకర్తయా మహనీయునెంతు
భావనారాయణ భక్తిచే వెలయు. 18
అతనికి గుండనా హ్వయుఁడుద్భవింప
నతనికాతఁడు వాని కాతఁడై యొప్ప. 19
నారీతిగావచ్చు నన్వయంబందు
వీరగుండనమంత్రి విఖ్యాతుఁడయ్యె. 20
వానికాకొమ్మన్న వరుఁడుద్భవించి
మానుగాచందోలు మండలంబునకు. 21
మంతిరయ్యెనునట్టి మహితాన్వయంబు
అంతకంతకుసాగె నఖిలదిక్కులకు. 22
అరయగా నండూరు నందున్నవారు
కరణంబులైరి యా గ్రామానికంత. 23
అందులోభావన్న కాదిరాజైన
పొందుగా నాపూజ్యపుత్రుఁడైప్పుడై. 24
శ్రీమించుగుణశాలి శివరామశీలి
యామహాత్మునకంత యానరసింహ. 25

మనుధీరుడతని యందయ్యెశివరామ
యనఘుండాసుందరాంబామహాసాధ్వి. 26

యందునను బుత్రుగా నర్మిలింగాంచ
నందమా నాబాల్య మందుండిభక్తి. 27

పరమేశ్వరీకృపా బలముచే నేను
ధరమూడుశతకముల్ దలచివ్రాసితిని. 28

ధర్మజునశ్వమేధము నంతవ్రాసి
నిర్మించినమకంబు నిటలాక్షుకృపను. 29

తెనిగించితిని వేడ్క తేటపద్యముల
ననువుగా నికశక్తి యనురాగమంద. 30

శక్తిపురాణమాసక్తితోఁగూర్చి
యుక్తియుక్తంబుగా నొనరించివ్రాయ. 31

నెంచినాడను నార్యు లికనన్నుప్రేమ
గాంచియాశీస్సులం గరుణతోనిండు. 32

అనిపెద్దలకుమ్రొక్కి యంతదుష్కవుల
తనగొప్పజూపింపఁ దప్పులనకుండ. 33

వాయిమూయుండని వందనంబులను
వేయిఁజేయుచు దీని విధమింకవినుతు. 34

## గాయత్రీదేవికి శక్తిపురాణముకృతి నిచ్చుట

ప్లవవర్షమొప్పనాశ్వయుజ శుద్ధమున
నవతరిల్లిన భూరి యష్టమీతిధిని. 35

నానందమఠములో నద్భుతరీతి
సానందుకాభక్త సమితిగాయత్రి. 36

శక్తిసన్నిధియందు చాలనవరాత్రి
సక్తులై పూజలన్ సల్పుచుండంగ. 37

నానందయోగి నన్నరసి యిట్లనియె
మానసింపుముశక్తి మహిమ శీఘ్రముగ. 38

నమకమెల్లను దివ్య నవకమొప్పార
గమనించి పద్యముల్ గాఁగూర్చిదాని. 39

నీ దక్షిణామూర్తి కిచ్చియున్నావు
మోదవార్ధినిమమ్ము ముంచియున్నావు. 40

ఇపుడు శక్తిపురాణ మెసగగా మరల
యుపచయంబుగ గూర్చి యొనర గాయత్రి. 41

కిమ్ము నీ జన్మంబుహెచ్చఁగా దీన
కమ్మగా కథలెల్లఁగ్రాలగానందు. 42

అనునంతలోనె మనమందుగాయత్రి
యనుసంధితంబైన యావేశమొదవి. 43

వల్లెయటంచు నావలవ నప్పటికె
తెల్లమై సిద్ధమౌ ద్విపదకావ్యమును. 44

భావించి గాయత్రి పరముగా కృతిని
గావించితిని జన్మ గడలుకొనంగ. 45

## శౌనకాదులు సూతుని దర్శించుట

పంచమహాబాణు పట్ల వనలక్ష్మి
అంచితంబగుపూజ లర్పించువేళ. 46

ఘనవసంతుడు కోర్కెగాంచి వనలక్ష్మి
తనదుకౌగిటఁజేర్చి తనరారువేళ. 47

నెందుఁజల్లనివాయు వెంతయు హెచ్చ
నందంద జీవులానందించువేళ. 48

చక్కనిజాబిల్లి జగమెల్లనిండి
చొక్కంపు వైఖరిన్ జొక్కించువేళ. 49

పరభృతంబులు హెచ్చి పంచమస్థాయి
చిఱుత గానరసంబు జిల్కించువేళ. 50

ధ్యాననిష్ఠానంద తత్పరులైన
శౌనకాదులు మహా సత్రయాగమున. 51

శుద్ధాత్ముఁడైయొప్పు సూతముని గాంచి
యిద్ధదివ్యానంద మెసగ నిట్లనిరి. 52

వివిధపురాణముల్ వినిపించినావు.
భవభయంబులఁజల్లఁ బడఁజేసినావు. 53

అనువైన నీదు వాక్యామృతంబింక
గననింక మాకొాదవె కాంక్ష పూర్ణముగ. 54

ఎట్లుపుట్టెను జగం బెందులోనిల్చె
నెట్లువర్ధిల్లె దా నెందులోఁజేరె. 55

వెలయనీమూర్తు లెవ్విధిజీవులైరి
సలలితంబగు జగత్సంబంధమేది 56

ఆదిలో భూతముల కాధారమేది
యీదిక్కులకుగర్త లెవ్వరైయుంద్రు. 57

ఇవియెల్ల రూపంబు లెట్టెట్టుబొందె
నవిరతంబుగదెల్పు మాసర్వమనగ 58

శౌనకాదులగాంచి సంతసంబంది
మానుగాజిచ్ఛక్తి మహిమనుం దలచి. 59

తగసూతుఁడనెనిట్లు ధన్యాత్ములార!
భగవతిమహిమచే బల్కుచున్నాఁడ. 60

అధికంబుగానెల్ల నాత్మయందెంచి
కథలుగా నవి విన్న గాంక్షించమీరు. 61

ననుచువారలగాంచి యతిభక్తితోడ
ననియె బారాశర్యు నాత్మలో దలచి. 62

## నారాయణమూర్తి హయగ్రీవావతారము

నళినాక్షుఁడైన శ్రీ నారాయణుండు
కలనదైత్యాళిలో గదిసి దీర్ఘముగ. 63

రణమొప్పసల్పినీరసమును బొంది
మనములో జిచ్ఛక్తి మహిమ నెంచుచును. 64

సమధాత్రివింటి సజ్యముదాల్చి మెడను
గమలాసనస్థుఁడై గాఢమౌ నిద్ర. 65

నందంగ దివ్యులా హరిఁగాంచలేక
అందుకై చింతించి యజునితోఁదెలుప. 66

నాశ్చర్యమైతోప నతఁడును వెదకి
నిశ్చయింపగలేక నివ్వటిల్లుచును. 67

గోలబెట్టగనొక్క గూఢదేశమున
చాలగానిద్రించు చక్రినిఁగాంచి. 68

భయసంభ్రమాశ్చర్య భరితులైనారు
రయమున బిల్చిరారాక్షసాంతకుని. 69

ఓవిష్టరశ్రవా యోహోముకుంద
ఈవిధంబగునిద్ర యెసగె నీకెట్లు. 70

నినుదిక్కుగాఁగొల్చు నిర్జరులమేము
కనువిచ్చిచూడవా కరుణించిమమ్ము. 71

అని యెంతయోవేడి రంతియేగాని
తనమత్తువిడనట్టి దైత్యారిఁగాంచి. 72

పరమేష్ఠి యిట్లనియె భవ్యాత్ములార
హరిని గాంచంగ నా కాశ్చర్యమాయె. 73

నేనొక్కయుక్తిచే నిదురలేపెదను
గాన మీరెడకేగి గాంచుఁడీ యనుచు. 74

నొకవమ్రివేడ్క నాహూయఁగాఁజేసి
ప్రకటితంబుగ దానిఁ బంపగానదియు. 75

హరికంఠభాగమం దమరియున్నట్టి
అరుదైనవింటిసజ్యంబట్టుగొఱుక. 76

ఘోరశబ్దంబౌచు కుదిలి యానారి
నారాయణుని కంఠ నరమట్టెద్రుంచ. 77

నప్పుడెజగమెల్ల నంధత్వమైన.
తప్పుఁజేసితిమంచు దరిగానలేక. 78

కైలాసమునకేగి గౌరీశుకెఱఁగి
చాలగావిలపించి సంగతుల్ దెలుప. 79

పురహరుండూహించి పుయిలోడి మఱియు
సురలతోనిట్లనియె సురలార! వినుఁడు. 80

కాదుమానుషమిద్ది కాదురాక్షసము
కాదుదైవతమన్య కారణంబైన 81

కాలస్వరూపమై గ్రాలు చిచ్ఛక్తి
లీలామహత్త్వమే గోలగాదోచె. 82

గానశక్తినివేడ కరుణించి మనల
దానవాంతకునిచ్చు దయతోడనన్న. 83

## దేవతలు శక్తిని ప్రార్థించుట

పరమేష్ఠిలోనైన బ్రహ్మలనుగూడె
సురలెల్లనొకపట్టు శుభదీక్షతోడ. 84

దివ్యాసనంబులం దేజరిల్లుచును
అవ్యాహతంబుగా నాదిచిచ్ఛక్తి. 85

మరిమరిపూజించి మాధవుకొఱకు
విరివిగాప్రార్థించు విధమెట్టులన్న. 86

నీవే ప్రపంచకపు నిర్మాతవమ్మ
నీవు సత్త్వరజంబులీవె దామసము. 87

నీవు ప్రశస్తవు నీవప్రశస్త
నీవుసంచారివి నీవసంచారి. 88

వీవుచిన్మయమూర్తి వీవెజీవాత్మ
వీవెశాంతియు దాంతి వీవెగాంతియును. 89

నీవెధర్మార్థంబు లీవెమోక్షమవు
నీవెరాగాదులు న్నీవెప్రణవంబు. 90

కారుణ్యరూపవై కలిగించిమమ్ము
భారమంతయుబూని బ్రతికించినావు. 91

నీమహత్త్వంబెన్న నేర్తుమా మేము
మా మొఱన్ వినవమ్మ మమ్మేలుమమ్మ! 92

హరియిట్టులౌటచే నమరాళిదిక్కు
విరిగినవారౌచు విలపింపుచుండి. 93

రమ్మ! శ్రీహరిఁ బ్రోవుమా లోకమాత
మమ్ము ధన్యులఁ జేయు మహనీయచరిత. 94

అని వేడునంతలో నాకసంబందు
కనుపించి లీలఁగా గరుణనిట్లనియె. 95

వినరయ్య సురలార! వింతసంగతిని
వనిగొంచు వైకుంఠ పట్టణంబందు. 96

హరి యొకం డేయాట లాడుకొనుచుండ
కరము మంగళదేవి గాంచినవ్వంగ. 97

ఆరమాదేవినా యపరత్వమన్న
కారణం బేమటచి గర్వంబుతోడ 98

హోహో యనుచుదూల హోరాటమైన
గోపించగా లక్ష్మి క్రోధమార్గంబు. 99

శాపంబుగావొప్పి నమయించె హరిని
ఈపగిది దుఃఖించ నేమియౌ మీకు. 108

ఒకయుక్తి నల్పుడీ యొప్పుగా నింక
ప్రకటితంబుగ శార్ఙ్గి బ్రదుకును గాక. 101

మును హయగ్రీవనాముడు నన్నుగూర్చి
ఘనముగా దపియించగా నేనువాని 102

కగుపించి నీకోర్కె యడుగరా యనిన
వగజీతంబుగ నాత డమరత్వమడుగ 103

నందుకై నేనసహ్యము బొందియంటి
క్రిందుమీదెఱుగక కెరలుచున్నావు. 104

పుట్టుజంతువులెల్ల భూమిపై నెందు
గిట్టుటే సత్యమివే యెఱుగుమింక. 105

గానవావరమింక కాకవేరొకటి
పూనిగోరంగనేపున నిత్తుననిన. 106

ఉల్లాసమంది వారొక్కింతఁగాంచి
వల్లెయనుచు నొక్కవరమిట్లుగోరె. 107

క్షితి నాకు బ్రతిహయగ్రీవుఁడౌదవంగ
నతనిచేతనెమృత్యు వౌనట్లుచేయు. 108

మంతకన్నను మృత్యు వనుమాటనేని
వింతయైనవరంబు వేడ్కనిమ్మనగ. 109

వల్లెయనుచు నట్లె వానికిచ్చితిని
ఇల్లుజేరినవాది హెచ్చియాతండు. 110

నిర్జరాదులనెల్ల నిర్జించియింక
గర్జించి సాధుసంఘమును బోకార్చి. 111

యజ్ఞయాగాదుల నవనిపాల్జేసి
ప్రజ్ఞలంగొట్టుచు బలిసియున్నాఁడు. 112

హయశిరంబొండుమీరరసి యీహరికి
నయమునఁగూర్చగా నారాయణుండు. 113

జీవించివాని నిర్జీవిగాఁజేయు
దేవాదులకుపీడ ద్రెళ్ళుచేగాక. 114

అసలు తేజంబబ్బు హరికింకననిన
మసలికదేవతల్ మరిబోయిపోయి. 115

కనియొక్కసాంబ్రాణి కంఠంబుదెచ్చి
వనజనాభునికంఠ వరమునగూర్చ. 116

చిచ్ఛక్తిదయచేత జీవించిచక్రి
యిచ్ఛతోహయకంతు నెంతయుదాకి. 117

ఘోరంబుగానూరు గొట్టు వర్షములు
ధీరత్వమునబోరి దివిజారిఁజంపె. 118

ఆనాటనుండియే హరి హయగ్రీవ
మూని కీర్తిగడించె ముల్లోకములను. 119

లోకమెల్లనుశక్తి లోలనంబనుట
కీకథనెఱిగించి తికనేమివలయు. 120

ననినసూతునిగాంచి యాశౌనకాదు
లనిరి సద్భక్తితో నంజలిఘటించి. 121

అసలు త్రిమూర్తులెవ్వరెరి ప్రథమమున
సిసలుగా నీసృష్టిఁ జేసిరెద్దాన. 122

దాని ముఖ్యంబుగా దయదెల్పుమనిన
మౌనులతో సూత మహనీయు డనియె. 123

## సృష్టిక్రమము

సృష్టికెల్లను ముందు చిచ్ఛక్తి యొకటి
స్పష్టంబుగా నుండె శాంబరివలన. 124

ఘనమైనభూతముల్ గలిగి యద్దాన
మనవాని తావులై మాత్ర లొప్పారె. 125

నంత పాథోధి దివ్యాభ్యంతరమున
సంతసంబుననొక్క సన్నరూపంబు. 126

యోగ నిద్రను గాంచుచున్నట్టి మూర్తి
కాగంతుకంబుగా నాయె దన్నాభి. 127

నుండి తామరపద్మ మొకటి యందుండి
ఖండితంబుగ బుట్టె గ్రాలునొక పాప 128

ఆపాప దరిగాన కంతయు దిరిగి
ఆపట్టుననె సల్పె నందుండి తపము 129

ఆతపశ్శక్తిచే నాకసంబందు
ద్యోతమానంబయ్యె నొక్క తేజంబు. 130

అంతలో నొకమార్గమప్పుడు దోప
సంతసింపుచు ముందుసాగగా నచట. 131

మధుకైటభులు నాగమనుజాశనులను
పృథుతరంబుగ గాంచి భీతిల్లుచుండ. 132

మఱియొక్క చిత్రమా మహనీయుఁడందె
మిఱుమిట్లు గొనుచున్న మేననొప్పుచును. 133

పరగవెల్గెడినొక్క పట్టుపుట్టమును
గరిమె దాలిచి మోము కళకళలాడ. 134

హస్తాళి శంఖ చక్రాదులందాల్చి
నిస్తులంబగుమాల నివ్వటిల్లంగ. 135

నిద్రబోవుచునున్న నిపుణునిగాంచి
భద్రంబుగాబోయి భయము దన్నలమ. 136

ఆశ్చర్యపడుచుండ నటనొక్కశక్తి
నిశ్చయంబుగలేచి నింగికిఁజేరె. 137

ఇంతలో నతఁడావులింపుచును లేచి
అంతమందించె నాయసురద్వయమును. 138

ఆరౌద్రయుతముగా నాకసంబందు
ధీరుఁడైకనుపట్టె దివ్యరుద్రుండు. 139

ఆమువ్వురను గూడి యంతరిక్షమున
నామోదమునగాంచి రద్భుతశక్తి. 140

అంతలో నాశక్తి యాకారమందు
అంతర్గతములయ్యెనట మూఁడు మరియు. 141

నదియెల్లగాంచి నారాశ్చర్యమంది
పొదలు చుండగనింక బొడకట్టెవింత. 142

దివ్యరథం బొండు దివియందుఁదోచి
యవ్యాహతంబుగా నటవచ్చివ్రాలె. 143

ఏమిదోచక దాని నెక్కఁగా వారు
ఆమెయిని బరబర ఆవిమానంబు. 144

పదల మార్గముబట్టి చనఁదోచె కోట్ల
నదులును వృక్షముల్ నవ్యభూములును. 145

కలితకల్పనగాలు గలకలార్భటుల
ఫలముల భక్షించు పక్షి సంతతులు. 146

బాలచంద్రుఁడు జటా భాగమందుండ
చాలగా శర్వాణి సన్నిధిఁ గ్రాల. 161

నందివాహనమున నాగభూషలను
పొందికోట్లకు మీఱు భూతముల్గొలువ. 162

నొప్పుశూలినిగాంచి యోహోయటంచు
నప్పుడేగిరివారలపరమార్గమున. 163

చనిచని వేఱొక్క చక్కనిజేర
ఘనవజ్రములకాంతి గలకుడ్యములును. 164

కస్తూరి తావులంగలసి శోభిల్ల
వస్తుసంతతినొప్పు వాడలొప్పార. 165

జవ్వాజి చేమంతి జాజిమల్లియల
నవ్వారిగానొప్పు నట్టిపరిమళ. 166

మండితంబౌ నొక్క మండపంబందు.
దండియౌ శ్రీలక్ష్మి ధాత్రిని గూడి 167

చరణంబులొత్తగా సరసోక్తులాడి
చిరము మంగళమైన చేల మొప్పార. 168

గరుడధ్వజంబొప్పగా శేషశయ్య
గరిమ నీలాభ్రంపు కాంతిచెన్నార. 169

చక్రగదాశంఖ శార్ఙ్గాదులొప్ప
విక్రమస్థితినుండు విష్ణువుంగాంచి. 170

చకితులౌచుండగా సరగున రథము
చకచకబోయె నాచదల మార్గమున. 171

## త్రిమూర్తులకు దేవిదర్శనము

కనుపించెనంత జక్కనిపాలరాసి
కనుచుండగా దివ్యగతి దానిమధ్య. 172

అనువైన నవరత్న హర్మ్యభాగమున
ఘనమైన తావొండు గనుపించనందు. 173

మందార చేమంతి మరి నారికేళ
కుంద దివ్యరసాల కోవిదారకములు. 174

పారిజాతములు సంపెంగజాజులును
భూరిపున్నాగసుర పొన్నవృక్షములు. 175

భృగుతమాలలు బిల్వపిప్పలాదులును
అగరు కాంచననాగ లశ్వత్థతరులు. 176

కల్పభూజావళి గంధ భూజములు
పొల్పైన కలకండ భూజరంభలును. 177

అందమొౘుండగా నాశాఖలందు
చిందువందుగగూయు చిలుక సంతతులు. 178

వనమధ్యముల వెల్గు వజ్రసోపాన
మనుగతంబౌచుండ నవ్యాహతముగ. 179

పాలవెల్లితరంగ పాళియందొప్ప
చాలజగములకెల్ల సంపదేయనగ. 180

యోజనంబులదీర్ఘ మొప్పుచేగాక
ఈజగంబులకూర్ధ్వ మెసగి శోభిలుచు. 181

పరిణామవంతమై పరిఢవిల్లుచును
అరివర్గ భీకరంబౌచు శోభిలుచు. 182

గోపురంబులు ముద్దు గొల్పుచుండంగ
కాపుగానొప్పు సంగర ధీరలైన. 183

వివిధాస్త్ర శస్త్రసద్వీరవేషముల
అవగణాంచిత శత్రులైన యోషిణులు. 184

కలుగగా నవనిధుల్ గలుగనచ్చోట
అలరారగా దివ్యమైన రూపముల. 185

కమ్మగా విలసిల్లు కల్పభూజముల
కొమ్మల గోయిలల్ గూర్చుండికూయ. 186

పూలగుత్తులతావి భుక్తమౌచుండు
చాలునద్దివినెన్న జాలరెవ్వరును. 187

చారుసౌభాగ్య సంచారిణులైన
సూరివధూరత్న శోభితంబైన. 188

మండితంబై దోచు మండపంబందు
నిండుగద్దియజేరి నెయ్యమేపార. 189

కెంపువస్త్రముగట్టి కేళీవిలాస
సొంపుధామములొప్ప శుభములొప్పార 190

గలగల తనదివ్య కంకణాల్ మ్రోయ
పొలుపు గూర్చెడి కోటి బోటులమధ్య. 191

కోటి సూర్యులకాంతి గోటితోమీటు
బోటిని గాంచిరా భువన నాయకులు. 192

చూచి విత్రాకుచే చొక్కిదరిజేరి
యాచిన్మయత్వమ్మ కంజలిజేసి. 193

తమమది నెంచిరా ధన్యను గూర్చి
అమలమైనట్టియా యమ్మనుగాంచ. 194

నిది జగన్మాతయై యెసగు నాఁడోచె
సదయురా లీపె చిచ్ఛక్తి కళ్యాణి. 195

సకలలోకాధార సౌభాగ్యశాలి
ప్రకటితంబుగ నాదిభగవతి దేవి. 19

మన భాగ్యమున నేడు మనకు గన్పట్టె
అనుచు నానందించు నంతలో వారి. 197

కవలి చారిత్ర మిట్లయ్యె వినరయ్య
యువతీ త్రయంబుగా నొప్పారిరంత. 198

ఏమిలావణ్యం బదేమి సుందరము
ఏమొ వారెవ్వరో యెంచికొనలేక. 199

చూచుచుండ మరొక్క చోద్యమొప్పారె
ఈచరాచరమట్టి యీశ్వరియందు. 200

అద్దంబులో రూపమై యొప్పినట్లు
ఒద్దికగాదోచె హొయలు మీరంగ. 201

అంతనామాత దమ్మరసి ప్రేముడిని
చెంతకురమ్మంచు జేసన్నసల్ప. 203

చేతులౌదలజేర్చి చెలగ మ్రొక్కుచును
ఈతీరుగానామె నెలమి బ్రార్థించి. 203

యీవెభూమియునీర మీవెవాయువును
నీవెతేజంబవు న్నీవాకసమవు. 204

నీవెకర్తవుభోక్త మీవెశూన్యమవు
నీవెసర్వస్వంబు నీవె ప్రణవంబు. 205

జంతుకోటులనెల్ల సంసారమందు
పంతగానాడించు విశ్వస్వరూప. 206

ఆనందమూర్తివై యఖిలభూతముల
మానకబ్రదికించు మహనీయమూర్తి. 207

భూదేవతలునీవె భూతంబులీవె
ఆదితేయులునీవె యఖిలంబునీవె. 208

యజ్ఞంబులునునీవె యాగమునీవె
యజ్ఞభోక్తవునీవె ఆధారమీవె. 209

నిన్నెన్నమేమెట్లు నేర్తుమోతల్లి
మన్నించవమ్మ మా మాతరోయన్న. 210

## త్రిమూర్తులకు దేవినిజరూపంబుపదేశించుట

బహువిధంబులనాపె వలికెఁదానిట్లు
బ్రహ్మాండముల నాకుఁదోచినవెల్ల. 211

కల్పించినాశము న్నావింతులీల
కల్పాంతమందు నేకత్వ మేనంది. 212

మానందమూర్తినై యట గొన్నినాళ్ళు
మార్మిసపిలుచుండి నామదిఁదోచినప్డు. 213

సృష్టించిలోకముల్ సృష్టికర్తలుగ
స్పష్టంబుగాదగు వారిఁజేసెదను. 214

అట్టినాశక్తిచే నఖిలమున్గూడ
పుట్టిపొందికగాంచు బోవుచునుండు. 215

కుసుమంబులందావి గూడియున్నట్లు
భసితంబునన్గాంతి భాసిల్లునట్లు 216

ఆకసంబునశబ్ద మమరినరీతి
వీకబాలనునేయి వెలసినచక్కి. 217

తరణియందాతపము దగిలియున్నట్లు
చెఱకునందునదీపి చేరియున్నట్లు. 218

కట్టెయందునవగ్ని గలిసియున్నట్లు
మట్టియందునధూళి మాటుకొన్నట్లు. 219

జలమునందునవహ్ని సమకూరినట్లు
ఇలవజ్రమునతేజ మెసగియున్నట్లు. 220

ఈలోకములనేను నెసగుచుండెదను
చాలరెవ్వరునాకు సర్వవిధముల 221

దారిద్ర్యభాగ్యాది దశలెల్లనేనె
ఆరీతిసత్య ధర్మాదులున్నేనె. 222

నేనెవాణినిలక్ష్మి నేనెరుద్రాణి
నేనెగాయత్రిని నేనెసావిత్రి 223

నేనెయీశానిని నేనె ప్రణవంబు
నేనవిద్యనువిద్య నేనెదిక్కులును. 224

నేన సృష్టిస్థితుల్ నేనెనాశమను
నేనెపరమాత్మను నేనెసర్వంబు. 225

వేయేలనీసర్వవిధ భూతతతులు
నాయాజ్ఞచేతనే నడుచుచున్నారు. 226

అనుచుండగానె నయ్యతివయందుండి
అనుగతంబయ్యె మూడట్టి రూపములు. 227

అందు లక్ష్మినిగోరె నబ్జనాభుండు
పొందుగా గౌరినా భూతనాథుండు. 228

వాణినిగోరెనా పరమేష్ఠియంత
దానికెల్లను మెచ్చి దయతోడదేవి. 229

మరియాదగానిచ్చి మరివారిగాంచ
పురుషరూపంబులఁబొంద నిట్లనియె. 230

నగుగాకమీరలీయర్థాంశమందు
తగురీతి సృష్టికర్తలుగండు పొందు. 231

మఱికామబీజసంబంధ మంత్రమున
పరిశుద్ధసత్త్వులై భద్రముల గనుడు. 232

వేదమార్గాచార విధులనందుంచు
ఆదితేయులగూడి యజ్ఞభాగముల. 233

గైకొంచునాయాజ్ఞ గడితప్పకుండ
ప్రాకటంబుగ నన్ను భావింత్రుగాక. 234

అటుగాక మీరు నాయాజ్ఞలనుమీఱి
కుటిలభావంబులన్ గూడిచెడిరేని. 235

వరుస నాచే నియ్య బడిననీశక్తు
లరుగు మీయందుండి యాక్షణంబునను. 236

అని యానతిచ్చి యా యాదిదివ్యశక్తి
పనుపగావారట్టి భవ్యతేజముల. 237

మరలి వచ్చిరి యావిమాన మార్గమున
తిరముగాంచిరివారి దిక్కులయందు. 238

ఈరీతిగావార లెసగిమూర్తులుగ
తీరుగాసృష్టికై తీర్పుపలైరి. 239

ఈకథన్నుతియించి రేని వినిరేని
సాకల్యముగదేవి సన్నిధిగాంత్రు. 240

ఆదేవి దయచేత నవనియందెల్ల
నాదర్శమానులై యఖిలసంపదల. 241

అనిశౌనకాదులా యఖిలపౌరాణి
గనియిట్టులని పంక గరుణించిమాకు. 242

ఆవిశ్వనిర్మాతవై నసత్కథల
నావిష్కరింపు మేదైన యొకపట్ట. 243

ననగ సూతుఁడువొంగి యనఘాత్మలార
వినుఁడు నేనెఱిఁగింతు విపులమౌగాధ. 244

## మహిషాసుర చరిత్ర

మును రంభుఁడను నొక్క మూర్ఖ దైత్యుండు
కనులకెక్కినకండ కావరముచేత. 245

మహిషినొక్కటిగాంచి మౌఢ్యమార్గమున
సహచరిత్వంబుగా సంగమించంగ. 246

దానికిగర్భమై తనర మహిషుండు
పూనిధాత్రినిబుట్టి ఘోరిదౌనిష్ఠ. 247

కమలాసనునిగూర్చి కఠిన తపంబు
విమలత్వముననల్పె వేయు వర్షములు. 248

సత్యాధిపతిమెచ్చి చాలప్రేముడిని
ప్రత్యక్షమై కోరు వరమింకననగ. 249

నతఁడిట్టులనియె నాయబ్జజు గాంచి
క్షితిమూడు లోకముల్ జేరివెదకినను 250

అనియందు ననుగెల్పు నట్టిపురుషుండు
గనుపట్టకయెయుండు గాకనెట్టెటి. 251

ఆయుధంబులు శక్తులన్నియు నాదు
చాయకైనను జేరజాలకపోవు. 252

గాకయట్టి వరంబు కరుణతోనీయ
వే కమలాసనా వీఁక నాకనగ. 253

వనజాసనుండట్టి వరములనియ్య
మనుజాశనున కొడల్ మత్తెక్కియంత. 254

నాదితేయులబట్టి యతివల జెఱచి
వేదకర్మలనెల్ల పృథివిపాల్జేసి. 255

సంతంబుతో సాధుబాధకుండౌచు
నంతతో పరితృప్తి నంద కాతండు. 256

అమరావతిని బట్టనప్పుడూహించి
సమయోక్తముగ నొక్క చారునింబనుప. 257

అతడప్పుడేపోయి యమరాధిపతికి
హితమెల్ల నెఱిగించె విశ్రుతఫక్కి 258

దనుజులు నిర్జరుల్ దలప సోదరులు
గనుక మీవంతెల్ల గడచె స్వర్గమున. 259

మావంతునకు మీరు మర్యాదగాను
ఆవశ్యకంబుగా నొసు వెడలంగ. 260

ఇద్దపద్ధతితోడ నిటుసల్పకున్న
సిద్ధమై యున్నాము చేయఁగా రణము. 261

నన దివ్యపతి వాని నధికరోషమున
గనిపల్కె రాక్షసులు కావరించిరిగ. 262

మాతదనుజా నీవు తోడనేపోయి
యాతనికి వేతెల్పుమా రమ్మటనుచు. 263

అనఁగనాఁడుపోయి యమరేంద్రువార్త
దనుజునకెఱిగింప దర్పితుండౌచు. 264

దంభఘనులురాగ తాళకేత్వాది
సంభకుంభులతోడ శోణితాక్షుతుడు. 265

భాష్కల ప్రముఖులు బాణాసురుండు
పుష్కలాదులు మహా పూతిగంధుండు. 266

గూడ సేనలతోడ గోయంచునేగి
యాడంబరంబుగా నమర నగరమును. 267

కమ్మి సాలంబులన్ కంగారొనర్చి
యమ్మేట్కి హర్మ్యాదులవని పాల్చేసి. 268

కోటలం బడవైచి కుదిలించి వనుల
బోటులం జెఱపట్టి బొబ్బరిల్లుచును. 269

ఘోరకృత్యములెన్నొ క్రూరముగ సల్ప
నారీతిగమనించి యమరనాథుండు. 270

నరయ రుద్రులతోడ నమరులతోడ
వరమరుత్తులతోడ వసువులతోడ. 271

గంధర్వసురసిద్ధగణములతోడ
బంధురంబైనదిక్పతులను గలసి. 272

కదలియట్టుల దివ్య గణయుతుండౌచు
నదలించి యరి సేన నప్పుడు డాకె. 273

దనుజులు దేవతల్ డార్కొన్నవేళ
కనకన బ్రహ్మాండ కర్పరంబదిరె. 274

కులపర్వతాదులు గూడచలించె
బలియైన శేషుండు బడలికజెందె. 275

అప్పుడు తునుకలౌనస్త్ర సంతతులు
కత్తళంబులు గదల్ ఖడ్గాదులైన. 276

ఖండితంబైన దుష్కారసంతతులు
ఖుండాల మొండెముల్ శూరశవములను. 277

నైననప్పటిరక్త మంభోధియయ్యె
దానిద్రావుచు ఘోర దైత్యభూతాలి. 278

రక్తమాసంబులు రహి మెక్కి మెక్కి
యుక్తంబుగా జిందు లొనరించుచుండె. 279

ఇట్టియుద్ధంబులో నెసగితామ్రుండు
గట్టిగా కోపించి కదలించి రథము. 280

దివిజసేనలదాకి తీవ్రమేపార
భువిపైచికొందఱన్నోర్చికార్చియింక. 281

కుప్పెళోలలగొట్టి కొందరగూల్చి
కుప్పించిగదనేసి కొందరపైచి. 282

నిరవగ్రహంబుగా నిల్పిదేవతల
ధరణిపాలొనరించు తరుణంబునందు. 283

ఘనకాలుఁడా దేవకంటకునిదాకి
సునిశితదివ్యాస్త్ర సోనలుగురియ. 284

దనుజుండు కోపించి ధైర్యంబుతోడ
ఇనసూను గదవేయ నెంతయుదునిమి. 285

గ్రక్కునయమరాజు కాలదండమున
రక్కసుంగొట్టగా రణధాత్రిఁగూలె. 286

నంతరక్తాక్షుఁడా యంతకునిదాకి
సంతతోద్ధారఁగా శరములంగురియ. 287

గదనేసి యాఁకనిం గాశ్యపిఁగూల్చి
పదివేలధర గూల్చె పలలాశనులను. 288

అదిమన్నరాక్షసుం డదరుచుగాంచి
గదతోడ దేవతల కలగుంపువఱచి. 289

మహిషవాహునంత మార్కొననెంచ
మహిషాసురునిదాకె మఘవుండు గినుక. 290

ఆకీతినగ్నిద్వయంబుగావారు
ధీరతతోఁబోర దివిజారికపుడు. 291

పరమేష్ఠివరదత్త బలముహెచ్చంగ
హరిహయుండునుగూల నదిగాంచిహరుఁడు. 292

మహిషాసురునిదాసె మార్కొనగనెంచ
నహామించి దుర్ముఖుం డాభర్గు దాకె. 293

శూలపాణియు వాని శూలాకృతమున
నాలసింపకనేయ నవనిపైగూలె. 294

అంధకాసురుఁడప్పు డాహరిందాకి
సంధించి బాణవర్షంబట్టెగురియ. 295

వానిఁజెండాడి యావాసుదేవుండు
కోనఁగూల్చెను గాంచ దున్నరాక్షసుడు. 296

అంత దుంతాసురున కావరబలంబు
అంతకంతకు హెచ్చ నద్భుతరీతి. 297

తనమాయచేగుప్ప దగలోకములను
అనువుగా దనరూపమైన మహిషములు. 298

కోటానకోటులై కూడి దివిజులను
వేటాడగావారు విభ్రాంతులౌచు. 299

ఒకఁడువోయినత్రోవ నొకఁడెఱుంగకయె
సకలదిక్కులబర్వ సాగిరావేళ. 300

హరిహరుల్ గమనించి హరిహయుఁగాంచి
తటిగాదుమనకిప్డు దైత్యునింగెల్వ. 301

పరమేష్ఠివరదత్త బలముచే నితఁడు
గరువించియున్నాఁడు గానవీతనికి. 302

అప్పనంబొనరించు డమరలోకమును
ఇప్పుడే మీరెల్ల రేగుఁడెందైన. 303

నాదిశక్తి నివేడి యామాతకరుణ
సాదరంబుగనంది సాధింతుమితని. 304

అనిపల్కి యామూర్తు లరుగగానంత
చనిరి నిర్జరులు విషాదంబుతోడ. 305

అనినసూతునిగాంచి యాశౌనకాది
మునులెల్ల దెల్పుమామూలాగ్రముగను. 306

ఆపైనియేరీతి నాదితేయులను
గాపాడెనాదేవి కారుణ్యమెసగ. 307

అనినమౌనులగాంచి యనియెసూతుండు
వినుఁడింక నీగాధ వివరింతుమీకు. 308

## దేవతలు వైకుంఠమున కరుగుట

తుహినాద్రి చఱియలందున నిర్జరాళి
తహతహ న్వసియించి తమపరాభవము. 309

తలచుచు కష్టాల దరిగానలేక
విలపించి విలపించి వేసటిల్లుచును. 310

పరమేష్ఠితోఁగూడి వైకుంఠమునకు
గరుడధ్వజునిగాంచగా నేగిరొకట. 311

తరణి కోయిలనోర్చు ధగధగల్ మీర
గురివిందమణులవౌ కోటలొప్పార. 312

పలువిధంబుల నొప్పు పాదపంబులును
కలువతామరలొప్పు గలుగుకోనేళ్ళు. 313

అందుంచి పీయూష మందంబఁజిల్కు
సుందరంబైయొప్పు సోపానములను. 314

కలతియ్యమామిళ్ల కలకండచెట్లు
పలువిధంబులుద్రాక్ష పందిళ్లఁగ్రాల. 315

చలువ బాటలప్రక్క సంపంగిలతల
చిలుకలు శాస్త్రముల్ చెప్పుచుండంగ. 316

విరజాజి జొంపాల వేడ్కతోబొల్చి
భరతపిట్టలువేద పనసలంజెప్ప. 317

మద్దెలలు తాళముల్ మఱిగొట్టి వరదు
సుద్దులను గీర్తించు శుభవర్గములును. 318

పురుష సూత్రాదులేపున సుస్వరముగ
మరిమఱిన్నుతియించు మహనీయులొప్ప. 319

ముద్రభావములతో మోదమేపార
సదూర్ధ్వపమునుగాంచు సాధువుల్ గలుగ. 320

పద్మరాగాంచిత ప్రాసాదపమర
సద్మవేదికయందు సౌభాగ్యమొప్ప. 321

అహిశయ్య శ్రీలక్ష్మి యవని దా నుండ
బహునారదాది సద్భక్తులు గొలువ. 322

నక్షత్రకాంతులమీఱు నట్టిదేహమున
శుభ్రమౌ బంగారుశోభ ధోవతిని. 323

గట్టివక్షస్థలిని గ్రాలవనమాల
దిట్టయౌ వైకుంఠదేవునటగాంచి. 324

దేవాదు లెల్లరు దీనులై వేడ
దేవదేవుఁడుగాంచి దివ్యమతులార. 325

మనమెల్లరము శక్తిమహితయాగమును
ఘనముగా నిఁకనల్ప కరుణించినారమె. 326

మనకష్టములదోలి మనియించుమనల
ననిలేచి వారితో నమరాద్రికరిగి. 327

యటవిశ్వకర్మతో ననగ నాతండు
డిటపైన మందిరాల్ దీర్చె నిముసమున. 328

## దేవతలు శక్తి నారాధించుట

మాణిక్యదీపముల్ మఱివెల్గజేసి
పూనిశుద్ధాత్ములై బుధులుమౌనులును. 329

పరమేష్ఠిలోనైన బ్రహ్మలగూడి
పరిశుద్ధులౌచునా పరమచిచ్ఛక్తి. 330

వర్ణబీజములెల్ల వరుసగావేయు
కర్ణికల్గల దివ్య కంజాతమందు. 331

పదియాఱు రేకుల పావనాంతమున
గదియించి వాగ్బీజ కామబీజముల. 332

పరివశ్యబీజాది మంత్రములతోడి
గరిమ పూరించ లోకములెల్లమ్రోసె. 333

దివ్యవాద్యములెల్ల ధిమిధిమిమొరసె
నవ్యాహతంబుగా నచ్చరలాడ. 334

పరమేష్ఠులును వేద పనసలంజెప్ప
సురలును బహురీతి సూక్తముల్పాడ. 335

ఘటసేవ సలిలాదికము పత్రి పూజ
దిటవుగా సల్పియు దీర్చిదీపముల. 336

ఘనతముత్తైదువల్ కన్యకల్పూజ
లొనరించగొప్పవీరోత్సవంబులను. 337

కోర్కెపురాణముల్ కోవిదుల్ జెప్ప
తర్కమీమాంస శాస్త్రములొప్పుచుండ. 338

నవరాత్రములుసల్పి నైవేద్యములను
అవిరతంబుగనిచ్చి హారతుల్ బట్టి. 339

మంత్రపుష్పములిచ్చి మహిసాగిమ్రొక్కి
మంత్రించినట్లుగా మైమఱచిరంత. 340

అంతబుట్టినవింత నౌనెవర్ణింప
సంతసంబుననొప్పె చదలమార్గమున. 341

కోటిసూర్యులకాంతి గోటితోమీటు
మేటితేజంబొందు మిఱుమిట్లుగొల్ప. 342

దానినిం గాంచనా ధన్యులనుండి
పూనిశక్తులకోట్లు పొంగవెల్లనిన. 343

ఒక్కొక్కఘనుని యందొక్కొక్కశక్తి
నిక్కంబుగాలేచి నింగిపైజేరి. 344

ఆదిశక్తిని జేరె నద్భుతరీతి
నాదినంబయ్యె మహాదివ్యనవమి. 345

అంతనాశక్తి యందాయెసర్వంబు
ఎంతనేనద్దాని నెసగవర్ణింతు. 346

వేమేల నాశక్తి విధమెఱింగింప
నాయనంతునకైన నలవిగావనిన. 347

పాలజేఁడప్పడిచ్చె పట్టుపుట్టమును
చాల సూర్యుండిచ్చె చక్కనౌహాల. 348

విశ్వకర్మయొసంగె వివిధభూషలను
విశ్వంభరాదేవి వెస దిల్కమిచ్చె. 349

వరుణదేవుండిచ్చె వజ్రాలమాల
హరివాహనంబిచ్చె నబ్జవైరుండు. 350

హరియు చక్రంబియ్యె హరుడుశూలంబు
పరమేష్ఠిదండంబు వజ్రివజ్రంబు. 351

అనిలుడిచ్చెనుశక్తి ననలుఁడుగదను
ధనదుఁడొకఖడ్గంబు ధర్ముంఁడువిల్లు. 352

తమశక్తికొలదిగా దక్కినవారు
విపులమౌ తమబహు విధశక్తులియ్య. 353

సమరాదులనుగాంచి యాజగన్మాత
విమలవాక్యములతో వినిచె నీరీతి. 354

అభయమిచ్చితిమీకు అమరాదులార
శుభములందుండు పే ఘోటికలోనె. 355

మున్నరాక్షసుగూల్తు దోర్బలంబెసగ
నన్నదేవతలెల్ల రాశ్చర్యమంద. 356

హరివాహనంబెక్కి యంతరిక్షమున
నెఁగి నాకద్వారమందుదానిల్చె. 357

## మహిషాసురుని పైకి శక్తి యుద్ధమునకు వెడలుట

ఆర్బటిల్లంగ నీ యజ్జాండమూగె
కర్బురస్తోమంబు గడగడలాడె. 358

అది దున్నరాక్షసుం డాలించియంత
గదుడను సేవకుంగాంచి యిట్లనియె. 359

ఎవ్వరిదీశబ్ద మెందుండివచ్చె
రవ్వంతనడికట్టి రమ్ము లేపొమ్ము. 360

కరముగంభీరమై కనుపట్టెగాని
స్వరము బోటిదటంచు చక్కగాదోచె. 361

వనసాతఁడప్పుడే యాజగన్మాత
గనివచ్చి యామహిషుగాంచి యిట్లనియె. 362

ఆశ్చర్యమాయె నా యతివనుగాంచ
నిశ్చయంబుగబల్క నేరరెవ్వరును. 363

మోముసోమునిగెల్చు ముక్కుసంపంగి
కాముగద్దియలౌను కాంతపిఱదులును. 364

కలువపూవులదోయి కలికినేత్రములు
నిలువుటద్దంబుల నిలుపుజెక్కిళ్లు. 365

కౌనువేదననొప్పు గజగామియౌను
మేనుతొల్కరితళ్కు మించునికవేణి. 366

నల్లత్రాచులదోలు; నాతిపాదములు
పల్లవంబులనొంచు, పంచాననమున. 367

మెఱుచున్నదికనుల్ మిఱుమిట్లుగొలుప
నారీతియొప్పారు నబలనుగాంచి. 369

మహిషాసురునకిట్టి మగువయేయైన
బహుసౌఖ్యములధాత్రి ప్రజ్వరిల్లెడిని. 369

అనియెంచి యెఱిగించ నాపెనునీకు
చనుదెంచినానన్న చయ్యననతఁడు. 370

## గజముఖుడనువానిని శక్తి వద్దకనుపుట

గజముఖుండనువానిఁగాంచి యిట్లనియె
నిజముగా నీవింక నిముసంబులోన. 371

నాపెనితకడకేగి యననగుంగాక
భావంబురేకొత్త బహువిధంబులుగ. 372

అనిపల్కగానాతఁడప్పుడేపోయి
కని పరాశక్తితో కామితస్థితిగ. 373

ఎవరిపిల్లవునీవు యెటనుంచిరాక
యెవరుబంధువులునీ కేదిదేశంబు. 374

పవరానదేవతా బలగమున్గెలచి
దివినేలుచున్నట్టి ధీశాలియైన. 375

కాసరరాక్షసు గాంచియున్నావె
ఆసిద్ధబలునకే నధికమిత్రుడను. 376

నీక్షేమమునుగోరి నీకొక్కమాట
నిక్షేపముగ నెఱింగింతు వినుమింక. 377

మా నేతనినువించుమన్మథావిష్ట
మానసుడై నాడు మఱుమాటలేల. 378

నీవొప్పనేనేగి నిమిషమాత్రమున
రాపించి శుభముహూర్తమునందజేతు. 379

మూడులోకములు నీ ముచ్చటదీఱ
నాడు నీయరచేత నట్లైననన్న. 380

పకపకాలుననవ్వి పాపిష్ఠ! వినర
సకియనొంటరిఁగాంచి సడపుమాటలను. 381

గర్వించి పల్కితే ఖల! దురాచార!
సర్వంబువినర నా చారిత్రమింక. 382

ఊరుపేరునులేని యొంటరినేను
నారూపమెన్నగా నలువకుగాదు. 383

బంధులెవ్వరులేని పాంథనైనాను
బంధురాలనునేనె భక్తసంతతికి. 384

సాధుజనులకునేనె సౌభాగ్యమౌదు
బాధజనులకునేనె బ్రహ్మరాక్షసిని. 385

దున్నపోతుకునన్ను దోపనెఱిగించి
మన్నుజేసెదనన్న మాటవినుపించు. 386

చాలకుండిననేడు జంభారికెఱిగి
కాలముగ్గమనించి కదలిపొమ్మనర. 387

ఇదిగాకనీకొక్క సెఱిగింతువినర
అదిరవరమేష్ఠినీ కానాటివరము. 388

ఇల బూరుషులగెల్వనేగాదెయిచ్చె
అలరుబోడిని నేను అనిగూల్తునిన్ను. 389

అనుమాట దలపోయరా దురాచార!
క్షణములోపలనిన్ను జంపుదునింక. 390

అనిదెల్పరా! పోయి యసురాధమునకు
అన వాడు తోడనే యరిగి వే దెలుప. 391

ఆమాటలన్నియును నతనిగారింప
నేమేమొయోచించి యిట్లనె నపుడు. 392

భువనముల్ క్షోభించ ఘాతంబులదర
అపకర్షణముచేసి యమరులందరను. 393

ధిమిధిమిలాడించి దిక్కటంబులను
అమరారినైన నన్నతివగెల్చునటె. 394

ఈ పల్కునాపట్ల హీనమౌగాదె
ఆపె యీరీతిన న్నాడగానౌనె. 395

అన విరూపాక్షుండతనితోననియె
వనితనుగూర్చి నీ వంటి ధీమనకు. 396

ఈరీతి యోచింప నెంతయుగాదు
ఆరసింపగబోకు మట్టిమాటలకు, 397

అనుచుండదుర్ధుండనియె నాతనికి
ఘనగజాస్యుండిదాని మాటలగూర్చి. 39

అర్థంబుగాకయె అదరి నీమెవకు
వ్యర్థంబుగావచ్చి వాగుచున్నాఁడు. :99

కామాతురత్వంబు కంట్లకెగదట్టి
నీమీద మోహంబు నివ్వటిల్లంగ. 400

అర్థావోక్తితో ననె నంతెగాని
వ్యర్థమార్గమటంచు పల్కగారాదు. 401

జాగేలననుబంప చయ్యననెను
వేగంబయేగియా విమతనుదెత్తు. 402

అను దున్నరాక్షసుం డానందమంది
ఘనుండవీవే దైత్యగణములలోన. 403

సంతసంబాయెనీ సత్కార్యమునకు
మంతవ్యుండవు నీవె మనసంఘమందు. 404

అనుచుండ దామ్రాక్ష దనుదైత్యుండనియె
జననాథుడనగ నీ చక్కయౌగాక. 405

తంత్రార్థములువల్కి ధరనెల్లగూల్చు
మంత్రిమే యనగ నీ మాడ్కియౌగాక. 406

కనులపుందగుదాని గనలేనిగొప్ప
తనముగల్గిననిన్ను దైవమేమెఱుగు. 407

వేయుహస్తములొప్ప వేయుఖడ్గములు
పాయకదాల్చెనే భామరౌద్రమున. 408

హరివాహనంబుపై యార్భటిల్లుచును
మురమున మనపైకి దుముకునే భామ. 409

బుద్ధులకొకసూక్తి జూపుటకన్న
బుద్ధితక్కువలేదు భూలోకమందు. 410

కల్లరాదిదినాకు గడచినరేయి
పల్లచీరెనుగట్టి పడివీధియందు. 411

గొల్లునసేడ్చుచు గూర్చున్నకాంత
తెల్లవారుచునుండ దేవిస్వప్నమున. 412

గూటబెల్లనుజేరి కొంపలంగూసె
దేపెమోగంబులేదిక్కనందోచె. 413

అనుమానమేలనయ్యది భామగాదు
మనుజాశనులపాలి మారెమ్మయౌను. 414

దీనివారికిదప్పు తెఱగింకలేదు
గాన ధైర్యంబేది గావించిరణము. 415

దీనిచేతనెచచ్చి దివ్యలోకంబు
గానబోవుటె మహాకారణంబౌను. 416

మరణ జన్మలు శక్తిమయముగానెంచి
దురమొనర్చుటెనాకు దోచెమార్గమున 417

వనదున్నరాక్షసుం డాతనింజూచి
చనుము నీవేముందు జన్యంబొనర్ప. 418

తేలునేదోయొక్క తెఱగునీవలన
మేలుకీడులుగూడ మించునీవలన. 419

## తామ్రాక్షుతో యుద్ధము సేయుట

అన రథారూఢయై యమ్మ యలుగొల్ప
చనదుష్టశకునముల్ చయ్యనగాంచి. 420

మృగరాజవాహయై మేటితేజమున
ధగధగవెల్గు మాతనుగాంచి పల్కె. 421

తరళాక్షి! వినుమమ్మ తామ్రాక్షుసంజ్ఞ
మరియున్నరాక్షసు మంత్రిని నేను. 422

మా తేజువినుమించు మస్మత్ప్రేమ
గూరివానిని నిన్ను గూర్చ నన్నంపె. 423

కొమ్ములుండును రెండు కూర్చియొకటుండు
సమ్మగిట్టలుగల్గు జూటము గల్గు. 424

ఇభచర్మమున మేను పెనగ నేత్రములు
రభసంబుగానుండు రగులును మోము. 425

యజ్ఞాదులరికట్టి యాశాలతేర్చి
ప్రజ్ఞానులను గూల్చి స్వర్గవాసులను. 426

అవిరతంబగు బాధ లందించినాఁడు
దివిచరాంతకుఁడైన ధీరుడాతండు. 427

అన దేవికోపించి యాతనిఁజూచి
వినమెల్లనీచులో దిరిగెడిదున్న. 428

కెంతపొగరెక్కెరా హీనరాక్షసుఁడ!
మంత్రివిగానట్టి మహిషాధమునకు. 429

అనుచునార్భటిలంగ నవనిగంపించె
కనిదిక్కులనునించె గఱుకుబాణములు. 430

అసురులెందరొ గూలి రాక్షణంబందు.
కసిని దామ్రాక్షుండు గదనెత్తివైప. 431

వారాహియది గొట్టి పైవఖడ్గమున
దారుణంబుగవాని తలధాత్రిఁబడియె. 432

సంతదిక్కులకెల్ల నప్రసంతతులు
సంతతోద్ధారగా శాంకరి యేయ. 433

చతురంగబలముట్టి వచ్చిఘోరముగ
క్షితి గూలునట్టియా చేతకునోడి. 434

హతశేషులేగియాహవవార్త దెలుప
క్షితియూర్ధ్వపతిలేచి చిందువందాచు. 435

సర్వదిక్కులఁగెల్చి చాలనిర్జరుల
గర్వముడచిన మేటి ఘనుఁడైనమహిషు. 436

మహినిగూల్చెదనంచు మదమెక్కియుక్క
మహిశపచ్చుటరాల మహిమగాదొక్కె. 437

దైవచేష్టలనేరు దలపోయలేరు
దైవోపహతమాను ధాత్రియంతయును. 438

## బిడాలకుని మంత్రాలోచనము

అనబిడాలకమంత్రి యాతనిగాంచి
వనితగాదది దానివార్త నేగంటి. 439

మనుజుంకసురలచే మరణించమనుచు
మసలగూల్పంగ నెమ్మదిగయోచించి. 440

హరిహరాదులశక్తి నాహూతజేసి
పరనిజతేజముల్ వరుసగానిచ్చి. 441

పంకజాక్షిగఁజేసి పంపగాశక్తి
శంకయేటికినిన్ను జంపనేతెంచె. 442

భావియెట్టులోతోచ బడదింకమనకు
ఏవిధంబుననైన హీనించకుండ. 443

జయమృత్యువులుదైవ చర్యగానెంచి
రయమునమనమింక రణముగావించు. 444

టుచితంబుగాదోచె నోదేవ! యన్న
సచివభాష్కలుఁడిట్లు చయ్యనబలికె. 445

హరిహరాదుల నోర్చి హరిహయుదోఁ
తరణిపుత్రునిఁ గొట్టి ధనదునిఁ గట్టి. 446

వరుణునిఁ దూలించి పవనుఁ ద్రుళ్ళించి
తరణిచంద్రుల నాఁపి ధరణి భావించి. 447

అట్టివారల కొక్క యాఁడుదానెంత
పట్టి తెచ్చెదనింక బంపుము నన్ను. 448

అనఁగ దుర్ధరుఁ డిటు లనియె కోపమున
మనుజాశనులఁ బుట్టి మహిని పేరించి. 449

జననాథునకు సంతసంబుగా నింక
కనకష్టమైన గాక సుఖమైన 450

సహియించి కార్యముల్ జరుపఁగావలయు
నిహపరంబుల గీర్తి నెనయఁగావలయు. 451

నవశక్తి యగుదాని కమ్మ యగుగాక
కదనమందున దానిఁ గట్టినే దెత్తు. 452

## భాష్కల దుర్ముఖులు యుద్ధమునకు వెడలుట

అన మెచ్చి భాష్కలుం డనువారి మఱియు
ఘనదుర్ముఖునిఁ బంప గంటలొప్పార. 453

రథపాళిలో లక్షరణవీరులొప్ప
పృథుతరంబుగ నేగి పల్కియిట్లనిరి. 454

చిన్నదానవు నీవు చేపెఱుఁగవమ్మ
దున్నరాక్షసుఁ డన్న ధూర్తుఁడో తల్లి. 455

దివిచరాదుల గెల్చి దీపించినాఁడు
సవనభాగములెల్ల సాధించినాఁడు. 456

వానితో సరిగారు వసుధ నెవ్వరును
గాన వానినిఁ గూడ ఘనముబ్బునికను. 457

తన రాణిగాఁ జేయుఁ దప్పక నిన్ను
అనుమానమించుకొన కమ్మ రావమ్మ. 458

అన దేవికోపించి యనియెవారలకు
మునదాశసులబంప మహినొప్పినట్టి. 459

ఘనుఁరాలమదనార్తుఁ గాను రా నేను
తనకొర్కెమహిషియే దగుభార్యగాగ. 460

నన్నిటులాడు మీ నాల్కలగోతు
నన్నగోపించి వారమ్మాత్రదాసి. 461

బలుగు గాలములేయ ఖండించిమించ
బలముదేవినిపైచి భాష్కలుండప్పుడు. 462

కలుగుగాలములచే ఖండించిదేవి
విరబాలమునవాని కంఠమొసటికె. 463

అదియుఁ లప్పుర్స్యంబు లదరిపారంగ
సరిపించిదుష్కుఖుం డాదేవిదాక. 464

ముష్టంబు ఘోరమై యొప్పనిప్పువలు
దృష్టిముసదేవి పెచ్చు సైన్యములు, 465

చుప్పదేవునిపైన ఖడ్గాదులెల్ల
ముష్కరుముష్కరగగొట్టి తూటాడె దేవి. 466

అలతచే దుర్ముఖుండా దేవి దాక
నిలుపునిలుపుమటంచు నించిబాణముల 467

బంపిబాణములుదిట్టి వారాహినప్పు
ఖండింతుననిపోవగా దేవిపైన. 468

అపదంబుచూర్ణమై యవనిపాలైన
సరఖడ్గమునవచ్చు వానిపైదుమికి. 469

శిరముగట్టిగబట్టి చిందుతేయంగ
కలుగుఖడ్గముచేత కంఠమేత్రుంచె 470

అడిగాంచిహతశేషు లసురునిజేరి.
అవపదలాడుచు నని(గూర్చితెలుప. 471

## మహిషాసురుని విలాపము

మహిషుండు మూర్ఛిల్లి మాయగా నెంచి
మహినిదొర్లుచులేచి, మంత్రులగాంచి. 472
వింటిరేకద ఘాతవృత్తాంతమెల్ల
బంటుతనమున నొక్కభామ మేటెంచి. 473
బాష్కలదుర్ముఖ ప్రముఖులఁజంపి
శుష్కింపఁజేసె నా శూరత్వమెల్ల 474
కాలంబుసుఖదుఃఖ కారణంబౌను
కాలమేగదకంట గాలమైమెప్పు 475
అతిమనోహరుఁడైన యజ్ఞారి కాల
గతిచేతదనసర్వ కళలదొలఁగు. 476
ఇలపురాకృతకర్మలే మేలుకీడు
కలుగజేయుసుకాల గతిదప్పగలరె. 477
అనుచుఁజింతించు మహిషాసురునిగాంచి
యనె మహాచిక్షురుండను నొక్కమంత్రి. 478
పసవీడియనినొక్క భామచేనోడ
నసుర జన్మలకెల్ల హానియౌగాదె. 479
విడువుమీ భయమెట్టి విధము హీనంబు
గడియలోపలదానిగట్టి తెచ్చెదను. 480

## చిక్షురతామ్రుల యుద్ధము

అని రథారూఢుఁడై యసురులగొల్వ
తనకుసహాయుడై తామ్రుఁడేతేర 481
సైన్యఘోషంబుచే జలనిధుల్ గలఁగ
విన్యస్తభీతియై విలుదాల్చిరాగ; 482
శత్రుభీషణమైన శంఖమూదెవి
చిత్రముగనొత్తగా చిందుపంచాచు. 483

పరుగులెత్తెడివారి భయమేలననుచు
తరుణినిగాంచియా తత్తరల్ వలదు. 484

మరలుము మరలుడీ మదవతిందాని
మరమునందునదీని త్రుళ్ళడగఁజేతు. 485

సనిరథంబును దేవి నంటదోలించి
వినుమునిపల్కెనో విమలాంగినీవు. 486

గర్వించిదనుజాళి గారింపనౌనె
నిర్జరాళినిగూడ నిర్జించునేను. 487

అతిపతేవీనితో యౌనునేమనుచు
మెతరగానున్న త్రుతిమించెరాగంబు. 488

నన్నుచూపులగాంతు సైగలేకాని
కన్నెల్తుజేతురే కాంతలెందైన. 489

పటచేరికౌగిలి స్పదయుతేగాని
క్షితిహింసజేతురే చేడెలెందైన. 490

మగవనికివెలెందు మార్గముల్ వినుతు
నగణితంబుగనింక నసురునిగొనుము 491

కాదన్ననాచేత ఖండింపబడుము
మీరనిన్నికనేను వీడబోననిన 492

క్రుద్ధమై యాదేవి కూళ మదాంధ
యుద్ధంబులో గొప్పయోద్ధవా నీవు 493

క్షణములో గూల్తు నీచా? యింకరమ్ము
అన దేవిపైనవాఁ డమ్ము లేయంగ. 494

చూడా స్త్రముసన దేవి బొమ్మునవేయ
చిషురుండట మూర్ఛ జెందుట గాంచి. 495

యంతలో దామ్రుఁడా యంబపై బాణ
సంతతుల్ గురియగా శక్తిదూటాడి. 496

మఱియు రౌద్రంబుగా మార్గణంబులను
గురియచుండంగ బిషురుడంత లేచి. 497

రా గాంచి దేవి యారాక్షసుండాన
నాగంతుకంబుగా నటతా్రముఁ జేచి. 498

వాహనంబునుపైన వారాహి హెచ్చి
బాహాటముగ వాని బరిసె నేయంగ. 499

విషటుండుసురాగ జీల్చె ఖడ్గమున
లక్షణంబునవాయ ధరణిపాలైరి. 500

దేవిపై సుమవృష్టి దేవతల్గురియ
నావార్త హతశేషు లప్పు దెలిగింప. 501

## బిడాలక అసిలోములు యుద్ధమునకు వచ్చుట.

ధాత్రి మూర్ఛిలిలేచి దద్దరిల్లుచును
ఆత్రంబుగా బిల్చి యా బిడాలకుని 502

ఘన ఖడ్గలోముని గలసి నవేగి
వనిత నాహవధాత్రిఁ బట్టి తెమ్మనగ. 503

వరరథారూఢులై వారిద్దరపుడు
చరచరనేగిరా సైన్యముల్ గొనుచు. 504

ఘనవాద్యములు మోయఁగా సైన్యధూళి
దిననాథు గప్పభీతిలగ దేవతలు. 505

చని ఖడ్గలోముడా శాంకరింగాంచి
వినతుఁడై శాంతుఁడై వినిచె దానిట్లు. 506

వినవమ్మ నీకొక్క వినతి జేసెదను.
ఘనమైన శాంతి మార్గమును బోనాడి. 507

అమ్మ యిమ్మాడ్కిగా హంకరింప్రమును
నమ్ముజంపగనేల మఱియుంక వినుము 508

దేహికిసౌఖ్యముల్ దెల్లంబుగాను
ఐహికాష్మికంబులు రెండు విధులు. 509

అందునైహికసౌఖ్య మానవనిశ్చయము
పొందించు నిత్యమై భూరిపరంబు. 510

ధర్మార్థసత్యముల్ దాపులుగాన
కర్మశుద్ధినిజేసి గావించవలయు. 511

కర్మలకొనిగట్టి కామముల్ పెరుగ
మోక్షమార్గముపీడ మోసమౌతుదకు. 512

దయకన్నహెచ్చైన ధర్మంబులేదు,
దయవీడినీవిట్లు దనుజులజంపు 513

చేయుకారణమమ్మ యోచించవమ్మ
నీమార్గమరయంగానేర కున్నాము. 514

అనిపల్కగ దేవి యతనినిగాంచి
వినరొ విదానవా? వినిచెదనీకు. 515

వేదశాస్త్రంబుల విధులెల్లజీవి
కావర్తితంబులౌ సట్టిమార్గములు. 516

నా సూక్తులగునవ్వి నాస్వరూపమునె
నామేలనాపత్కా వేదసారంబు. 517

అట్టినేనిలసాక్షినై శిష్టజనుల
గట్టిగారక్షింతు ఖలులదున్మాడి. 518

దుష్టశిక్షణగూడ దోపించు తుదకు
శిష్టరక్షణమును సిద్ధత్వమందు. 519

అందుకై యుగ యుగంబందుజన్మించి
ద్రుంచింతు ఖలులనీమహియందునెపుడె. 520

నేటికీ మహిషుండు నీచుండై హెచ్చి
పోటులభంగించి పూజ్యులజంపి. 521

నా యనుయాయుల నాశమున్గోరి
న్యాయహీనంబుగానటనసేయంగ. 522

వానిపాపఫలంబు పరిపక్వమౌట
వానినిజంపగా వచ్చియున్నాను. 523

గాన వానిని జంపకమె నేనుపోను
వానికారణమైన వారు మీరౌట. 524

మానకుంతగ మిమ్ము ద్రుంచింతుమంటె.
తోన వానినిగూడ ద్రుంతు నిక్కముగ. 525

అనగ వారలుదేవి కభిముఖులగుచు
సునిశిత దివ్యాస్త్ర సోనలంగురియ. 526

దునిమి నవ్వుచు దేవి ధూర్తబాణమున
గని బిడాలకుపైవ కంఠంబు దెగిన. 527

అసిలోముడదేవి నయుత బాణములు
వెసపై వగాదేవి వీరయైయున్మి. 528

తూపులంగొట్టగా దూలకాతండు
కోపించి సింగమున్ గొట్టు ఖడ్గమున. 529

దేవిపల్లటిగొట్టి దివిజారిబట్టి
గాపించె శకటముల్ కప్పురుల్ జెదర. 530

ఆవిధంబునదేవి యద్భుతరీతి
నావాహినులజంప నచటి రక్తంబు. 531

నదులు వాఱంగనా నందమేపార
పొడుగునెపలలముల్ భూత తండములు. 532

సురలు వర్షింపగా సుమవర్ష మొప్పె.
మొరసెనంబరమందు మురజకాహళలు 533

## మహిషాసురుడు యుద్ధమునకు వెడలుట

మహిషాసురుడు వారి మరణముల్ వినుచు
తహతహలాడుచు దారకుంజేరి. 534

ఘనసత్త్వవంతమౌ ఖరములువేయు
గనజేసి యరదమున్ గట్టి చెమ్మనగ. 535

నతడట్లొనర్పగా నరుణ తేజమున
అతిమాత్రమైయొప్పునట్టి కుళ్ళాయి. 536

అహిరాజతుల్యమౌ నట్టి మేల్ధట్టి
బహుజరీవంతమై పరగినధోతి. 537

ధరియించి తన తపో దర్పమే పార
తరకసాదుల దాల్చి తగరథంబెక్కి. 538
దానవ సైన్యముల్ దర్లగా వెంట
మానుషత్వము దాల్చి మహిషుండు దరలె. 539
ఎదుట నక్కలు గూసె నెగిరె గృధ్రములు
చదలు రక్తంబయ్యె సైన్యముల్ బెదరె. 540
నా దుర్నిమిత్తంబు లావంత గొనక
ఆ దేవిని గాంచి యా యసురుడనియె. 541
జగము లొప్పారు సంసారంబు వలన
అగణితంబుగ దాని కౌను భోగంబు 542
దానికి ప్రేమయే తగిన మార్గంబు
గాన సృష్టియనంగ గాంతుడున్నత్రి. 543
కలియుటే యగుగాన కంజదళాక్షి
సలిల భావముతోడ సంభోగమిమ్ము. 544
అమరలోకంబేలి యష్ట దిక్పతుల
సమరంబులో గెల్చి సవన భాగముల. 545
గైకొన్న ధీరుండ ఘనవంశజుండ
నాకన్న మొనగాడు నలువయుగాడు. 546
నీపైని కోర్కెయే నిశ్చయించితిని
కాపాడుమా నీదుకాళ్ళపై బడుదు. 547
అని మ్రొక్కగా దేవి యనె నవ్వియిట్లు
వినరోరి నీచః నా విధమెఱింగింతు. 548
పరమకాంతను నేను పరుగోరనెప్డు
పొరిగొందు నీవంటి భువనకంటకుల. 549
అవనిరాగాదుల హంకారములును
యువతీమయంబులై యొప్పురా ధాత్రి. 550
మలమూత్రములతోడ మాంసయుక్తముగ
గలుగు దుర్వాసన కాయంబుతోడ. 551

మహిపూరుషులజంపు మారెమ్మ యువతి
ఇహపరంబుల నేర్చ నిదియె గార్చిచ్చు. 552

క్షణ భంగురమునీటి కణముర: భామ
ఘనులట్టిమార్గమున్గన్నెత్తి కనరు. 553

కషాత్మ! నిన్నిట్లు కామాంధకార
దుష్టపిశాచంబు దొరకన్న కతన. 554

బలుకుచుంటివి చేటుపాటెఱుగకుండ
తులవ! నీ పొగరెల్లఁ దూలింతు నిపుడె. 555

అనగనామహిషుడా యంబనటజూచి
విను త్రిమూర్తులుకూడ విరిబోండ్లతోడ. 556

సంతసించుటలేదె చాలసౌఖ్యముల
అంతుతెలియనిమాట లాడకుమింక. 557

దురముమాటలనింక దూరంబొనర్చి
మదునికేళికిరావె మత్తేభయాన. 558

అనదేవికోపించి యసురునిఁజూచి
మునులుదివ్యులు మహామూర్తులొప్పార. 559

కనిరి సత్కర్మల గావించివారి
ఘనమైన పుణ్యసత్ఫలల కాంతలను. 560

అదిగాక కామాంధులొచునీవలెనె
వదరగాశిక్షింప బడరె? నాచేత. 561

నీచాత్మ! నీపల్కు నేనెఱుంగుదుర
చూచుచుండంగ నీ చొప్పులావయ్యె. 562

క్షణమైననినుగాంచగా పాపమబ్బు
అన రాక్షసుడు కోర్కెలడుగంటెననుచు. 563

మన్మథాశనురోసి మఱియుద్ధమందు
తన్మయుండైయల్లెత్రాటి నటుగిటి. 564

బాణముల్ గురియగా భగవతిదున్మి
వానిపైనేయఁగా వాడునునేయ. 565

దురముఘోరంబైన దుర్ధరుండేచి
పరిఘనేయగ దేవి పల్లటిన్గొట్టి. 566
కఱకుఖడ్గంబుచే కంఠమున్దునిమి
అరసిత్రినేత్రుడా హరినేయ గదను. 567
దురమునందునదేవి ధూర్తబాణమున
నఱికెనుకంఠంబు నాకులుబ్బంగ. 568
అంతలోదేవిపై యంధకుండెదిరి
చెంతకెట్లోపోయి సింగంబునేయ. 569
నాసింగముఱకాళ్ళ నంధకుంద్రొక్కి
చేసెముక్కలుగాగ చీల్చినఖములను. 570
అదిగాంచివేడియై యంతమహిషుండు
గదిసియాదేవిపై గదవైవదేవి. 571
తుత్తుమురుగాదాని దూలనేయంగ
నెత్తురుల్ధారగా నిల్చిమహిషుండు. 572
అదిరి సింగమునేయ నదిగూడహెచ్చి
యెదుర సింగంబౌచు నెంతయుఘోర. 573
దేవివానినిగొట్టి దీవ్రాస్త్రములను
వోవక మాతంగ పోతుగాహస్త. 574
మునబర్వతములెత్తి మూర్ఛతనేయ
నణుమాత్రముగగొట్టె నప్పుడాదేవి. 575
అంతదుంతాసురుం డార్చిబెబ్బులిగ
గంతులేయుచురాగ గదనేసెదేవి. 576
చిఱుతగండైవాడు చెలరేగి తాక
కఱకువాణములచే ఖండించెదేవి. 577
ఘనమౌచునభమందు గర్జింపనతఁడు
ఘనమైనదనశక్తి కాళ్యపిగూల్చె. 578
ఈరీతిగావార లెసగురోసముల
పోరిరుగ్రంబుగా భువనంబులూగ. 579

దేవియంతటవాని దీవ్రాస్త్రములను
గావించగాబద్ధు, గాసిల్లివాడు. 580
మాయాలుమహిషమై మఱియునుదాక
నామాతయునుదాని వంటనేయంగ. 581
మరివాఁడువారాహి మార్కొనిపల్కె
దురమునందుననిన్ను ద్రుంతునిక నన్న. 582
మాతువింతటనాదు చోద్యంబునీదు
పోతరింపణగింతు పోకురా దున్న. 583
అనుచుద్రాక్షాసవం బప్పుడుద్రావి
ఘనసుదర్శనమున కంఠంబునేయ. 584
దిక్కులెల్లనుద్రవయ్య దిక్కరుల్ గూల
పెక్కుమంటలు నభో వీధిఁదోపంగ. 585
చదలుగంపింపగా చయ్యనంబోయి
యది దానవునికంఠ మప్పుడే త్రెంచె. 586
దేవిపైసుమవృష్టి దేవతల్ గురియ
ఖావించెలోకముల్ భళిభళియనుచు. 587
విజయమౌ దశమిని వినగ నీకథను
విజయంబులేగల్గు విశ్రుతంబుగను. 588
నసియించుపాపముల్ నరకంబుదీరు
వసుధ దద్వంశంబు వర్ధిల్లుచుండు. 589

## దేవతలు దేవినిస్తుతించుట

ఆవేళ దివ్యులానందమేపార
ఖావముల్పొంగగా భగవతిన్గాంచి. 590
నీవెజగములకెల్ల నేత్రివోతల్లి!
నీవెభూతంబులున్నీవె మాత్రలును. 591
యజ్ఞాదులునునీవె యాగమున్నీవె
విజ్ఞానమునునీవె వివిధంబునీవె. 592

నిన్నెఱుంగనివారు నిష్కారణముగ
అన్నిటన్జెడిపోదు రమ్మదొరసాని. 593

మహిషాసురునిచేత మరిగోడులంది
మహిని నీదయచేత మనినాము తల్లి. 594

అనిపేడగాదేవి యనియెవారలకు
వినరయ్య యెవరైన పృథ్విపైనన్ను. 595

దలచగాకష్టముల్ దరికైనరావు
ఫలిరః నేనేవారి బాధ్యతలగొందు. 596

దేహాంతముననాదు దివ్యలోకమును
బాహాటముగ గాంత్రు భవభీతిలేదు. 597

అనితెల్పి యాదేవి యపరమార్గమున
చనెనంచుచెప్పెనా శౌనకాదులకు. 598

## సూతుని శౌనకాదులు మరలప్రశ్నించుట

అనిన సూతునిగాంచి యాశౌనకాదు
లనిరిట్లుభక్తితో నంచితోక్తముగ. 599

తెలిపినాఁడవు మున్ను దేవి తనసుండి
సలలితంబుగమూడు శక్తులదీసి. 600

మువురుమూర్తులకిచ్చె ముచ్చటల్దీర
నవివాదముగనంటి వానాడుమరల. 601

నాలోకమాత దుర్గాబినెట్లయ్యె
కాళి దక్షునకెట్లు గలిగెనీకథల. 602

వేరువేరుగ మాకు వివరించుమన్న
తీరుగా తనదివ్య దృష్టి బరికించి 603

వినరయ్య వినుపింతు విశదమౌనట్లు
మును మహాకజవమ్యె మూడు లోకముల. 604

అమరలోకంబునందదియు హెచ్చైన
తమశక్తులునుబోవ తనువులుఁదూల. 605

తమవాసముల వీడి దర్పములడగ
గుములుగట్టుచు విరాగులుగాగ సురల. 606
కగుపించి నారదుండనియె వారలకు
అగచాట్లతోనుంటిరయ్య మీరెల్ల. 607
ఇదిగాక వినుఁడు మీరింకొక్క గాధ
సదయయైమునుదేవి శక్తులనియ్య. 608
హరిహరుల్ వానిచే నవని కార్యముల
ఒరికించుచుండగా వైకుంఠ హరుల. 609
నాయత్తమైనట్టి యఖిల శక్తులును
మాయమైపోవఁగా మాలిన్యులైరి. 610
అనగ దేవతలెల్ల రాశ్చర్యపడుచు
వినగ జిత్రంబయ్యె విష్ణుశంభువులు 611
ఆరీతిగానెట్టులైరి యాశక్తు
లేరీతిగాబోయె నిది దెల్పుమనిన. 612
వినుడు దీనికి ముఖ్య విధము దెల్లముగ
ఘనమైన చిచ్ఛక్తి కరుణదప్పుటయె. 613
అంతయుజిచ్ఛక్తి యాధీన మనుచు
అంతరువుదామెఱిగి యామాత భక్తి. 614
గర్వహీనంబుగాఁ గడపినన్వారు
సర్వకార్యములును సాధ్యమైతీరు. 615
అటుగాక నెవరే నహంకారమూని
కుటిలులై పూర్వమున్ గొలుపడిరేని. 616
గడ్డిపోచకుగూడ గాకుంద్రుగాక
అడ్డగించక గాధ నంతయు వినుఁడు 617
ఎవరికేనియుభాగ్య మేపారి నపుడు
తప్పులునేమదియందు తత్పూర్వగాధ. 618
చెఱకునందునవెన్న చేకూరగానె
చెఱచదే దీపెల్ల సేగిమారమున. 619

కలపవృక్షంబులు గామధేనువులు
సలలితంబగు దివ్యజాతిరత్నములు. 620
కలకంఠులై యొప్ప కాంచనాంగులును
వలకట్టు నిత్యయౌవ్వనము సత్త్వంబు. 621
వెలలేనిహర్మ్యముల్ వింజామరలును
చలువచప్పరములు చాలగద్దియలు. 622
క్రీడాస్థలములును కీరధ్వనులును
వాడకట్టులును యుప్పరిగలువొ్ప్పంగ. 623
హరిహరాదులుగూడ నామోదవశత
మఱచిరి చిచ్ఛక్తి మహిమనొకపల్లె. 624
అప్పుడు హాలాహలు లనెడిరాక్షసులు
అపహారులై లోకమల్లాడఁజేసి. 625
పరమేష్ఠివరదత్త బలముచేవారు
గరువించి పశుపతినమలాక్షుదాక. 626
వెయ్యేండ్లు వారితో వెసబోరిపోరి
అయ్యుపూలక్ష్మీశు లని వారి వీడి. 627
నగరంబులనుజేర నారీమణులును
అగుపించకున్కివారతిభీతులౌచు. 628
పిచ్చిచేఁగమెల్ల వెదకివేసారి
యెచ్చోటగూడదా మెంతయుగనక. 629
గిరిసానువులనేడు కీలుబొమ్మలుగ
చరియించుచున్నారు చయ్యనబొండు. 630
వారితోగూడి యవ్వారిగామీరు
ఆరాధనముసేయు డామాతనింక. 631
అటుపైన మీరెల్ల హాయిగాంచెదరు
కటకటా! మిమ్మెల్లగాంచ కష్టమగు. 632
అనిచెప్పి నారదుం డడుగగా నంత
అనిమిషాదులునుఁ బద్మాక్షశంకరుల. 633

గలసియోచించి యాగముఖశక్తితోడ
సలిపిప్రార్థింప జిచ్ఛక్తితేజంబు. 634

కనుపట్టగా వారిగమ్మె నొక మంపు
వినుపించెనంత నీవిధమైనవాక్కు. 635

అమరాదులార! మీరభయులుగండు
అమల మనస్కులై యనుద్రిష్టినన్ను 636

బాయకుండగ దుగ్ధపాథోధిజేరి
చేయగా మథనంబు శీఘ్రమందుండి 637

జనియించులక్ష్మి నాసంబంధమౌచు
వనమాలికొఱకునా వరుసలోనింక. 638

వెలలేని సంపదల్ విరచనౌవాని
ఫలితంబు దేవతల్ పాల్గొంద్రుగాక. 639

ఇందుకై హరిహరుల్ హెచ్చుఁగాదోడు
జెందగావలెనింకఁ జేయుఁడట్లనుచు. 640

పోవనదృశ్యమై బుధులుల్లసిల్లి
పావనంబగు దుగ్ధ పాథోధి ద్రచ్చ 641

గమనించి సత్యలోకముజేరి ధాత
సమకొల్పనాతడుం జక్క యోచించి. 642

దేవతావళిబిల్చి తెలివితోరాక్ష
సావళిం బిలిపించి యందరనుగూర్చి 643

సభయందు తాను హెచ్చరికతో బలిని
యుభయనాథునిజేసి యుబ్బించి వార్థి 644

మథన సంబంధమౌ మాటల వీఁక
నధికంబుగాఁజెప్పి యందర గూర్చి 645

మానక మనమెల్ల మాధవేశ్వరులఁ
గానబోయెదమంచు కదలివారెల్ల. 646

గూడి కైలాస మున్గోర్కెతో చేరి
వేడి శంభునితోడ విష్ణువుజేర. 647

నతఁడుఁహర్షింపగా నందరుగూడ
నతిభక్తి జిచ్ఛక్తి నపుడు ప్రార్థించ. 648
అశరీరవాణితో ననియె నామాత
యసులార మీరు దుగ్ధాబ్ధియందొప్ప. 649
ఓషధావళితగ వొప్పుగావైచి
ప్రేషులై మంధరాద్రిని నల్పితరిగ. 650
వాసుకిని తటిత్రాడు వాసిఁగాఁజేసి
యాసుధాబ్ధినిద్రచ్చనగు సర్వమందు 651
ననదేవి వాక్యంబు లసురనిర్జరులు
వినియట్లొనర్పగా వేగంబతరలి. 652

## దేవదానవులు మంధరాద్రిని దెచ్చుట

మందరాద్రినిజేరి మరిశక్తి వేడి
బంధురంబగుదాని పాదుఁగదల్చ. 653
గుద్దళ్ళగానపాలఁగొని కొంతద్రవ్వి
పెద్దయంత్రములచే బెఱికివేసారి. 654
పీకియెట్టెట్టులో పీడ్యమానముగ
నాకంపనలతోడ నాగిరినెల్ల. 655
నానిమెల్లనదప్ప టడుగులతోడ
పూనిదుగ్ధాబ్ధి వైపున కేగుచుండ. 656
భారమౌటయు దాని భరియించలేక
దారిమధ్యంబులో దైత్యనిర్జరుల. 657
నుగ్గునూచంబుగా నొవ్వెడివారు
పగ్గెల్లనుమాని పడిపోవువారు. 658
స్వేదమగ్గలమైన సేయగాలేక
ఈదరిద్రపుకృత్య మేటికనువారు. 659
అంతుదెలియకవస్తి మనియేడ్చువారు
అంతరువు దెలియకిట్లైతిమనువారు. 660

నౌచుదీనోక్తుల హరినిప్రార్థింప
నాచక్రపాణియు నంతరిక్షమున, 661

వడివడితార్క్ష్యుపై వచ్చిహోయనుచు
నొడిసి పిడికిటబట్టి యొప్పుమీఱంగ. 662

బంధురంబగు తార్క్ష్యుపై జేసితెచ్చి
మంథరాద్రినివార్ధి మధ్యమందుంచె. 663

అంతవాసుకిబిల్చి యతనిమేనెల్ల
సంతసంబునదువ్వి సమ్మతుంజేసి. 664

యప్పుడుకొండకుజుట్టి యసురనిర్జరుల
ఉపముగానాదైత్య లొప్పుఫణములను. 665

బట్టపుచ్ఛముబట్ట బర్హిర్ముఖులును
గట్టిగాదుగ్ధాబ్ధి కళకళ పఱచ. 666

## దేవదానవులు సముద్రమును త్రచ్చుట

ధరమహాబిలముల త్తఱి దద్దరిల్లె
గిరులుశబ్దించగా గీపెట్టె కపులు. 667

పాతాళముతుకెత్తె బ్రహ్మాండమదిరె
భూతసంఘమువెల్ల బొబ్బలంబెట్టె. 668

నంతగవ్వపుకొండ కమఠకపాటు
అంతర్ధిజెంచె దుగ్ధాబ్ధిలోనపుడు 669

దానికైతపియింప దైత్యనిర్జరులు
పూని నిస్సారులై పొగులుచుండంగ. 670

వనజాక్షుఁడప్పుడవ్వార్ధిమధ్యమున
గన లక్షయోజనాల్ గలిగినకూర్మ 671

మరుదుగానౌచు దానరసి పైకెత్తె
సురలుదైత్యులుగూడ చోద్యమందంగ. 672

లోకమెల్ల నుతించె లోకేశుఁడదిరె
ఆకసంబునుధాత్రి యటమాఱుమ్రోసె. 673

గొల్లలై సురదైత్యకోట్లు మోదమున
కొల్లగానిప్పాలకుప్పమథించ. 674

మినతగోచులబెట్టి మఱిపిడిచుట్లు
వడిజుట్టి మఱిత్రాడు వాటముగబట్టి. 675

ఛాతిబొక్కుచు బాహు దండముల్గలిపి
సూత్రంబుగాపూని చూడచోద్యముగ. 676

భుజములరాయుచు బోయెపట్టనుచు
గుజగుజలాడుచు గోరాడుకొనుచు. 677

బొబ్బలంబెట్టుచు హానీకుఁడనుచు
గుబ్బుగుబ్బునద్రిప్ప గొండకవ్వంబు. 678

పదనెక్కిదుగ్ధముల్ పరకలుగట్టి
చవలుబట్టగపట్టి చవిజూచువారు. 679

చెమటలంతయుగమ్మ చెదరెడివారు
తమపేర్లువాకొంచు దద్చెడివారు. 680

అలయువారిని హాస్యమాడెడివారు
జలధిఁగాంచుచు మెచ్చుఁజాలెడివారు 681

నైతర్జభర్జనలందుచుండంగ
గా తిమింగిలకూర్మ కాళవసర్ప 682

చక్రశఫరీవ్యాళ సారసాదులును
చక్రఘరట్టనంబదియుపిష్టంబు. 683

మాదిరిచూర్ణమై మరలబీయూష
మాదరువుగాలేచి యార్భటిల్లంగ. 684

ఘనసురాసురతర్జ గర్జనల్ పెలగ
వనరాశిఘూర్ణిల్లు వరనాదముబ్బ. 685

ముప్పిరిశబ్దమై మొరసెబ్రహ్మాండ
మప్పుడాదిశలెల్ల హడలి బేఱెత్తె. 686

## హాలాహలోత్పత్తి

అంతవింతయ్యె నయ్యదివిన్నవింతు
నంతకాంతకునినేత్రాగ్నిశతంబు. 687

ప్రళయకాలానల ప్రభలొక్కవేయు
జలరాశిబడబాగ్నిసమితియులక్ష. 688

కడపటిదినభాను కాంతులర్బుదము
సడలింపజాలు విషజ్వాలలొదవి. 689

కడసారిమేఘముల్ గదిసిఢీకొన్న
పడుపునబెడిదమై వాలాయమౌచు. 690

ఘుగఘుగాయితమైన పొగలరేపుచును
ధగధగద్ధగితమై దర్పించ జగము. 691

పటపట ధ్వనితోడ బ్రద్దలైకూల
చిటచిట చిటచిట జెలగెనాజ్వాల. 692

అసమకాలపు హలాహలమౌచురేగి
డెసలు గప్పంగ భీతి దేవదానవులు. 693

ఒకడు పోయినత్రోవ నొకఁడెఱుంగకయె
సకలదిక్కుల బర్వసాగె నాజ్వాల. 694

కడలిమెల్లెడగప్పి కట్టలకెక్కి
వడిబయళ్ళను గట్టి వాడలనుబట్టి. 695

గిరుల వృక్షంబుల గీర్కొనుచురేగి
మరియరణ్యంబుల మాడ్చుచునరిగి. 696

జనపదంబులనేర్చి నరితు లింకించి
కనకనమండుచు ఘనమార్గమెగసి. 697

సిద్ధాశ్రమంబులం జీకాకుపఱచి
యిద్ధమైసురలోక మెంతయునంటి 698

గ్రహమండలములెల్ల కప్పి రేగుచును
అహమించి యతలాదు లంతటనంటి 699

ఎక్కియూర్వంబందు నేమఱకహెచ్చి
నిక్కిచిందాడుచు నిలువకుండంగ. 700

కాలసర్పమురీతి కంఠీరవంబు
లీలబెబ్బులియట్ల లేచినిధాన 701

వేగరాజమురీతి ఢీకొన్నవాని
కాగజాలకజచ్చు అసురనిర్జరులు. 702

కమలిచీకాకందు గంధర్వచయము
తమకమందెడిసిద్ధ తతులు నాగులును. 703

తాపంబులందు విద్యాధరాదులును
అపన్నులైకుందు నట్టిమానవులు. 704

ఆశ్చర్యపడువార లల్లాడువారు
నిశ్చయింపగలేక నిహతులౌవారు. 705

పరుగిడిపోలేక పడిపోవువారు
మరలిచూడగలేక బ్రమగ్రెడివారు. 706

నైయుండనీరీతి నైనమంటలను
ఆయాసకాలమై యగుపించినంత. 707

అసురనిర్జర బృందమూపురుమనుచు
అసమనేత్రునివేడి రభయమిమ్మనుచు 708

హరః హరా! మమ్మేలవయ్య గౌరీశ!
అరమరేటికిగాపుమయ్య లోకేశ! 709

పడిపోతిమయ్య యాపత్తులో మేము
నడినము బ్రమ్మలో నలుగుచున్నాము. 710

దిక్కెవరునీకన్న దీనులము మేము
అక్కటా! బ్రోవుమయ్యా మహాదేవ! 711

అనియిట్లుప్రార్థింప నభవుండాలించి
అనువైన నిజశక్తి నంతఖాపించి. 712

చిచ్ఛక్తిదనమదింజేర్చి వినుతించి
అచ్ఛప్రభావ సమాసక్తుడగుచు. 713

రక్షింతు మిమ్మెల్ల రహినినేనంచు
వీక్షింపుడని మహావీరత్వమండి. 714

కుప్పించిదానిపై కోపించిదుమికి
నిప్పునేత్రపుమూర్తి నిముసంబులోన. 715

హేలాగతిని వెన్నయేయనగబట్టి
హాలాహలంబునాహరించెనపుడు. 716

ఘర్మంబు బుట్టదాకాయంబునందు
నిర్మలత్వముపోదు నెఱిముఖంబందు. 717

సదయుండై యావిసము శాసించియట్లు
అదిర: కళకంఠుడై యా ఖ్యగొప్పె. 718

ఈసత్కథనువిన్న నెలమివ్రాసినను
దోసంబులడుగంటు దొరకు మోక్షంబు. 719

## క్షీరాబ్ధిలో ప్రాప్తించిన వస్తువులు

అంతగర్భురదేవులా దుగ్ధరాశి
నంతకంతకుద్రచ్చె నయ్యెనీరీతి. 720

తీరైనమేనితో దీపించుపొడుగు
గూరకోరికలిచ్చు గోవుజన్మించె. 721

స్వచ్ఛమౌమేనితో శాస్త్రీయమౌచు
నుచ్చైశ్శ్రవమునాగ నొకయశ్వమొదవె 722

అంత నైరావతంబను నొక్కహస్తి
వింతగా జన్మించె విబుధులలరంగ. 723

ఫలపుష్పయుక్తసంపదలనొప్పుచును
కలపభూజంబొండు గలిగిరాణించె. 724

కలకలనగుచు బంగరుబొమ్మలనగ
కులుకుచువిరిబోండ్ల కోటులొప్పారె. 725

కళకళలాడుచు గ్రాలిపదియారు
కళలనొప్పెడిశీత కరుఁడుద్భవించె. 726

సంతలోనాప్పారె నద్భుతంబైన
చింతామణియనంగ జెలగురత్నంబు. 727

ఆకీతిగానప్పు డావార్థియందు
కూరినవస్తువుల్ కోటానకోట్లు. 728

వానినెల్లనునాకు వర్ణింపనౌనె
గానిముఖ్యంబొండు గలవద్దివినుఁడు. 729

మగరాలరుచి నొంచి మఱితళుక్కుతోడ
ధగధగలాడు సుందరిపుట్టెనప్పుడు. 730

## లక్ష్మీదేవివర్ణన

ఏమిలావణ్యంబదేమి సుందరము
ఆమాతవర్ణింప నబ్జజుందోడు. 731

అనగ నాబోంట్లకయ్యది సాధ్యమౌనె
వినుఁడు యథాశక్తి వినుపింతుమీకు. 732

చంద్రబింబముదీర్చి సంపంగినేచి
సంద్రదిప్పలగిరి చక్రంబులేరి. 733

మధుపజాలముగూర్చి మఱివింపులేర్చి
సుధనుకెంపులబెట్టి సూనముల్ జుట్టి. 734

అభ్రమున్ దీప్తించి హస్తహస్తముల
శుభ్రంబుగాదీర్చి సొబగురంభలను. 735

హరిమధ్యములనద్ది యరసికూర్మముల
మరియువెన్నెలదోర్చి మలచి పద్మముల 736

కెరలించిరెక్కలన్ గీరకంఠముల
సరిజేసినేర్పుతో చాలయోచించి 737

వదనమ్ముఘ్రాణమ్ము వరనేత్రశ్రోత్ర
మదిరవేనలిబొమల్ యధరాధరమ్ము, 738

చనులునాభికయు హస్తములుబెన్నొడలు
గనకౌను పాదముల్ ఘనపిఱుందులును. 739

ాదములునఖములు పలుకులొప్పార
పదపడిద్రుహిణులు పదివేలమంది. 740

గూడిసూర్యులకోటి గూర్చిక్షాళించి
తోడుగాసుధగల్పిత్రొయ్యలిజేసి. 741

రనగజిల్కులకొల్కి యబ్ధినివెడలి
గునగున నడచుచు గోకిలస్వరము. 742

అవిమోదమౌచుండ నమృతమందుండి.
అవికృతంబుగబుట్టె నబ్జాక్షియొకతె. 743

ఘనపథంబున చాలకాహళుల్ఢక్క
పణవగోముఖశంఖ వాద్యముల్మొరసె. 744

పాడగంధర్వు లప్సరసలాడంగ
వేదమౌనులు వేడ్క వేధలెల్లరును. 745

స్వస్తిపుణ్యాహవాచనములన్జెప్ప
నిస్తులంబుగగవుల్ నెఱిగవ్యమియ్య. 746

నలువబీఠంబును నాగభూషణుఁడు
అలరుకాంచనమాల నభ్రవాహనుడు. 747

పారిజాతపుదండ పాథోధివేడ్క
చారుపట్టంబును శ్వసనుడొప్పారు, 748

చామరంబియ్య నిర్జరశిల్పకారి
ఆమెకమరెడి భూషలన్నియునియ్య. 749

తిలకమియ్యగ ధాత్రి దివ్యమార్గమున
కళకళలాడు నా కన్యకంగాంచి. 750

శ్రౌతమందుండి విశ్రుతమయ్యెనీమె
మాతమహాలక్ష్మి మాయురేయనుచు. 751

మాటిమాటికిదన్ను మఱిలోకమెన్న
నాటలాడెనుయిట్టులాసుందరాంగి. 752

ఇమ్మహాలోకమొక యిల్లేనటంచు
బొమ్మలోనగువారు బొమ్మలేననుచు 753

కుంభినీచక్రమే కుఱుచపీటనుచు
స్తంభంబులేమూల శైలంబులనుచు. 754

భానుసోములను దీపపుమిణ్కులనుచు
పూని యహోరాత్రములె క్షణాలనుచు. 755

జన్మమృత్యువులన్న చక్రడోలనుచు
తన్మయత్వప్రతిష్ఠ తనమార్గమనుచు. 756

బొమ్మరమ్మలోనర్చు పూజ్యతనుగాంచి
అమ్మహామహులెల్ల రద్భుతపడిరి. 757

ఎవనివరించునో యీపెనాతనికి
నవకుంఠితంబుగా నౌమంగళములు. 758

అనుచుకన్నులుచన్నులాపెఱుంయులను
కనుచునిశ్చేష్టుడై గానిపడుచుండ. 759

ఆపెమందకటాక్ష మభవునిసోక
నాపూరమయ్యె సర్వైశ్వర్యములును. 760

అంతరెండవదృష్టి యబ్జజుసోక
నంతలోనిసృష్టి కధికారియయ్యె. 761

ఇకను మూడవ దృష్టి యొసగ జిష్ణునకు
ప్రకటితంబుగ లోకపాలకుండయ్యె. 762

ఔరా! యికేమందునయ్య మునులార!
ఆరహస్యమును జెప్పనలవియానాకు? 763

తలచగానేహెచ్చె తన్మయత్వంబు
పులకించె మేనెల్ల పూర్ణమోహమున. 764

అనుచు గద్గదకంఠుడై యిట్టులనియె
ఘనమైన తనదృష్టిగాంచి వైకుంఠు. 765

పదునాల్గులోకముల్ భళిభళియనగ
అదిర! వనమాల నాహరికొప్పవైచె. 766

నాతరుణమున నారదాదులభ్రమున
గీతముల్ బాడగా కృష్ణా! యటంచు. 767

ఘనదివ్యవాద్యముల్ గణగణమ్రోసె
వనమాలి మైమఱచి వక్షస్థలమున 768
జేర్చె మోదాయత్తచిత్తుడై యపుడె
తీర్చిరచ్చటగొల్వు దివ్యసుందరులు. 769
కనువారిగని తాను కనులెత్తనట్లు
తననాథునోరగా దవిలి కాంచుచును. 770
హరిగాంచసిగ్గుచే నటు జూచినట్లు
సిరినటించెను దివ్యచేటికల్ నవ్వ. 771
హరియును సిరియు మోహాయత్తులైన
మరుడింక హెచ్చించె మార్గణంబులను. 772
మెరసబ్ధిరాజు శ్రీవిష్ణువున కెఱగి
పసగల్గు శ్రీకౌస్తుభము కట్నమిచ్చె. 773
వరదివ్యసుమవృష్టి వారిపై గురిసె
పరమేష్ఠులట వేదపనసలజెప్ప 774
నికదీనినాపి పైనెంతయు వినుత
ప్రకటితంబుగ మహాభవ్యాత్ములార. 775
వారిధి మఱిద్రచ్చ వారుణీయోష
కూరెచిత్రంబుగా గోపువారుచును. 776

## సుధాజననము

అంతద్రచ్చగద్రచ్చనర్ణవమందు
వింతగానొప్పారె విమలతేజమున. 777
కమలనేత్రుడు కంబుకంఠుడున్బలుడు
అమల భూషణుడు పీతాంబరధారి. 778
నీలవర్ణపుమేను నిండు యౌవనము
చాలనచ్యుతునంశశాలిధన్వంత్రి. 779
యనగనొక్కడు సుధాహస్తుడైరాగ
తనువులుప్పొంగ నాతని చుట్టుమూగి. 780

బలిమిచే నాకట్టి భళిర! దైత్యాళి
అలసుధాపాత్రంబు నాపగా సురలు 781
వెలవెలబోయి శ్రీవిష్ణువువేడ
కలిని బంపగ దైత్యగణమును గలచ. 782
నందు గొందఱుదాని నాపవద్దనగ
ముందుమాకిడిసాగి పొమ్మనువారు. 783
ఔను కాదని వాదులాడెడివారు
కానిమ్ము లేయంచు కనుగీటువారు. 784

## మోహినీ స్వరూపము

నైతర్కభర్కనురాచుండ నెదుట
శాతిస్ఫూర్తిపడి యొమ్మ! శారదాకళయొ. 785
కలుము లీనెడిదివ్యకల్కియో? యనగ
కలకలనవ్వుచు కన్నులార్పుచును. 786
మెత్తనిపాదముల్ మేటియూరువులు
బొత్తిగించిన కౌను ఘూరిపాలిండ్లు. 787
పల్లవంబులనొంచు పాదముల్ మఱియు
చల్లనిచూపుల చకచకస్మితుల. 788
కంబుకంఠంబు సుగంధదేహమును
బింబాధరంబింపు బింబమౌ మోము. 789
కలకలధ్వనినించు కంకణాదులును
కలిగి మోహినియౌచు కమలాక్షుడపుడు. 790
చారుపయ్యెదకొంగు సవరించుకొనుచు
తారు చెక్కిళుల హస్తముల నొత్తుచును. 791
తడబడపాదముల్ తలగీటికొనుచు
కడలెల్లగాంచుచు కన్నులార్చుచును. 792
అరయ కీల్జడ చేత నాడించుకొనుచు
మురియుచు దనరైక ముడివైచుకొనుచు. 793

ఉలుకుచు కులుకుచు నొప్పారగాంచి
అలసురాసురులట్టియబలనుజూచి. 794
ఘనకశ్యపుని వంశజాతులమమ్మ!
ఎనిమించి యేకార్ధపౌరుషంబునను. 795
కలహింపుచుంటిమి కాంతరో! మేము
సలలితంబుగ సభాస్థలిగ గూడెదము. 796
ఈ పాత్రజేకొంచు నింపైన సుధను
ఆపన్నులగుమాకు అంచితోక్తముగ. 797
పంచిపెట్టుము నీకు ప్రణుతిచేతుమన
సంచితోక్తులు పల్కె నామోహనాంగి. 798
పలుకులందున సుధల్ భాసిల్లుచుండ
తలపులందున నగ్ని తగిలియున్నట్టి 799
యువతులనెఱుగరా యోయి! మీరెల్ల
నవకాశమునకట్టులంటినేగాని. 800
పూనినేనటుగాక పూజనీయముగ
దీనిపంచెదమీకు తెలియుడీ నన్ను. 801
అనెపిభాషలు మాఱ్కులాచేష్టలందు
దనుజనిర్జరులుండ తగ సుధాపాత్ర. 802
గొనుచు సుస్నాతులై గూరుచున్నట్టి
దనుజాళి విడి పీక దానవారులకు. 803
జానుగాసుధవోయ పడతినిగాంచి
మానివల్కకయుండు మనుజభక్షకుల. 804
గాంచిచిఱునవ్వులో కనులుగీటుచును
అంచితంబుగబైట నటనొత్తికొనుచు. 805
వారివరుసలతోడ బావహామనుచు
నే నత్తునిచెవేగమేల నీకనుచు. 806
మేషలన్ మరపించి మించి శ్రీధరుడు
జాణతనమున దైత్యసమితి గన్మొరగ. 807

అసురాళియొకని మోమరయుచొక్కుండు
గుసగుసలు మీఱగా కొర్కెలెగయంగ. 808

ఇది పత్తునని యీపె యేలనోరాదు
అడిగాక రమ్మనగ నదియెట్టులౌనొ. 809

మిరి మరి జేరగా మరియాదకాదొ
సురలకెల్లమరించు సుధనెల్లనీపె. 810

అనుచు మాటాడ ధైర్యంబేమిలేక
కనుఁబొందికల దాని గాంచుచుండంగ. 811

సంతలోపల రాహువమరులజేరి
పంతంబుతో సుధాపానంబొనర్ప. 812

శశిభాస్కరులు సైగసల్ప శ్రీధరుడు
నిశితచక్రమునేసి నిల్పెగళమందు. 813

అమరత్వమూర్ధ్వమై యమరగా గ్రిందు
సమరె బడంబౌచు నారాహుకేతు. 814

గ్రహములై వూని యాగ్రహముచేవారు
బహుఘోరముగ నిందు భాస్కరుల నాచు. 815

గ్రహపర్వములయందు కమలజునాజ్ఞ
అహమించి వారలట్లాట గనరొక్కొ. 816

ఆరీతి శ్రీధరుండమృత మంతయును
కోరి విబుధులకిచ్చికుందు రాక్షసుల. 817

గని నవ్వుచును రిత్తఘటమట్టెకొట్టి
వనితరూపముమార్చి వనమాలియౌచు. 818

సురలెల్లబొగడగా సురమార్గమందు
వరపక్షితురగుడై వైకుంఠమరిగె. 819

ఈసత్కథను విన్నవెలమి వ్రాసినను
దోసంబులడుగంటు దోచు పుణ్యములు. 820

సర్వార్థములుగల్గు శాత్రవుల గెల్చు
నుర్వినాయువుగల్గునొప్పు సర్వంబు. 821

అనిసూతమౌని సంయములకిట్లనియె

## దేవాసురులయుద్ధము

ఘనసుధాపానముగ్గని సురల్ పొంగ. 822

క్రుద్ధులై సిద్ధులైకూడి దానవులు
యుద్ధంబునకు దోచి వ్యూహముల్ పన్ని. 823

అరదముల్ ద్విరదముల్ హర్యక్షఖడ్గ
తురగమహిషవరాహ దోరణవ్యాఘ్ర. 824

గండభేరుండ మర్కట ఋక్షవృషభ
దంతి భల్లూక పృషదంశ గోమాయు. 825

కాక కుక్కుటహంస కంకాళ శునక
కాకోదర దివాంధ ఖంజరీ శరభ. 826

తిమి తిమింగిల నక్ర ధీర శాతార
సమితి నారోహించి చక్రముల్ గదల. 827

పరిఘపట్టిసఖడ్గ బాణాసనముల
వరభిండివాల దివ్యాస్త్ర సంతతుల. 828

బలిముందుగానిల్చి బటువున దోగ
అల నిర్జరులుగూడ నంచితరీతి. 829

వాహనంబులనెక్కి వటసగా దరలి
వ్యూహంబులొప్పుగా హుంకరింపుచును. 830

ఆయుధంబులతోడ నాయోధనమున
కాయత్తమై యింద్రు నాధిపత్యమున. 831

దలపడ లోకముల్ తత్తరపోయె
జలనిధుల్ ఘూర్ణిల్లె చలియించె నభము. 832

అత్తరి చూర్ణమౌ నస్త్రసతంతులు
కత్తళంబులు గదల్ ఖడ్గముల్ గాగ. 833

తుండె తుండెంబులో తురగసంతతులు
ఖండింపబడు మహాగజ కదంబములు. 834

అచిర చూర్ణంబైన వరదపంక్తులును
అదిర! దెబ్బల గూలునట్టి తెక్కెములు. 835
రాలు భూషలు దివ్యరత్నసంతతులు
గ్రాలగా రక్తసాగర మయ్యెనచట. 836
అందు మాంసముమెక్కి యాటలాడుచును
చిందులేయ దొడంగె చెలగి భూతములు. 837
ఈసుచే బలితోడ నెదిరెనింద్రుండు
ఆ సురాచార్యుపై నడరె కావ్యుండు. 838
విశ్వకర్మను దాకె వీక నామయుడు
అశ్వినేయుల దాకె నట విప్రచిత్తి. 839
వరుణదేవునిదాకె వదలకహేతి
నరవాహనుని దాకె నాగముఖుండు. 840
వాయుదేవుని దాకె బశిర: శుంభుండు
పాయక మార్తాండు బలిపుత్త్రిదెదిరె. 841
శ్రాద్ధదేవుని దాకె శంబరాసురుడు
క్రుద్ధుడై యగ్నిపై కుప్పించె మాలి. 842
రహి నిశాపతితోడ రాహుకేతువులు
అహిలోముడనెడివాడాదిత్యసుతులు. 843
ఈరీతిగా వారలెదిరి దివ్యాస్త్ర
తీపులం బోరాడి తెగటార్చి రిపుల. 844
నినుగొల్తు నిప్పుడె నిలునిలుమనుచు
రణధాత్రి ననుదాక రమ్మి రమ్మనుచు. 845
మీసంబులను ద్రిప్పి మీదిపై కుటికె
రోసంబులను దాకి రొప్పుచు బోరి. 846
అట్టహాసములతో నన్యోన్యపాద
ఘట్టనంబుల నింగి కాశ్యపుల్గదల. 847
భుజముల ఛట్టించి బొబ్బలంబెట్టి
ధ్వజములం బడగొట్టి తాకిపీడుచును. 848

శరజాలములనాటి చక్రముల్ రువ్వి
పరశువుల్ బరగించి పరపి శూలములు. 849

శక్తులడరించి పాశములచేగట్టి
శక్తి చేగొట్టి ప్రాసములచే నడచి. 850

పరిఘల వైచి ప్రాసములచే మోది
సరికి ఖడ్గములచే నఖముల జీరి. 851

ఒకనితో నొత్తంబు నొకడు నొత్తంబు
ప్రకటితంబుగ దాకి ప్రాణాశలెల్ల. 852

అరచేతులను గొంచు నసురనిర్జరులు
మరిమరి పోరాడ మఘవుపైనడరి. 853

బలుడు మూడిటహస్తి పదిట సారథిని
చలమున నేయగా చలియింపకతడు. 854

నరికె నాబలివింటినారినింద్రుండు
మరి ప్రాసమేయగా మదమున దూల్చె. 855

ఈరీతిగా వారలిద్దరు వోర
కోరి రాక్షసుమాయ గూర్చగా బలుడు. 856

వ్యాఘ్రసింహములొప్పి యార్భటిల్లుచును
శీఘ్రంబుగా జించి చెండాడె సురల. 857

వనగజంబులు రేగి వారిజెండాడె
ఘనమాయ రాక్షసుల్ గలిగిమందలుగ. 858

ప్రళయంబుగా రేగ భయద మేఘములు
పలుతెఱంగుల వారిపై నగ్నులురిచె. 859

సంతలో గారుచిచ్చులముకొనంగ
చింతిల్లిదేవతల్ సేయగా నోడి. 860

చేయకౌదలఁజేర్చి శ్రీహరిగూర్చి
పీతాంబరాచ్యుతా విష్ణుదైత్యారి 861

నారాయణానంద నాగేంద్రశయన
నారసింహప్రభూ నలినాక్ష శౌరి. 862

గోవింద మాధవా కూర్మావతార
శ్రీవత్సలాంఛనా శ్రీమనోనాధ 863
విష్టరశ్రవ వేదవేద్య వైకుంఠ
శిష్టసంరక్షణా చిన్మయానంద 864
అసురాళి మాయలో హతమైతిమయ్యా
మెస నుద్ధరింప సర్వేశ రావయ్యా 865
అని వేడుచుండగా నవరమార్గమున
దనుజారి విచ్చేయ దనుజుల మాయ 866
వదలిపోవగ దైత్య పటిమ బోవంగ
అదవదలై దైత్యు లపుడు బోరంగ 867
గదభుజాకలితుడై కంఠీరవమున
కదరి తార్క్ష్యుని పైచి ఘన కాలనేమి 868
హరి తన గద ద్రిప్పి యాతని వైచె
మరి మాలి కోపించి మార్గణంబులను 869
గురుసు నేయగ మించి కంజాక్షు డార్చి
సరికె వాని శిరంబు నాకసం బుబ్బంగ 870
ఊతీరు కేశవుం డెంతయు హెచ్చ
పాత వాసవ ధర్మ పవనాదులెల్ల 871
ఉప్పొంగి దమవంతు యోధులం గెల్వ
గొప్ప ఖండనమైన గూలు రాక్షసుల 872
గని యసురేంద్రు డాఖండలు నేయ
గినిసి యిస్సీ యెంత కీర్తనీయుడవు 873
మాయచేష్టల మమ్ము మార్కొనగ నెంచు
దాయా యిదే చూడు దంభోళి దీన 874
హతమార్తు నిన్నింక ననబలేంద్రుండు
హతమారకుందువె హరి రాకయున్న 875
ఇంతమాత్రంబునకె పొంగెదయనుచు
పంతతోద్ధారగా శరములు గురియ 876

జంభరాక్షసుడును జంభారి నేయ
నంభోజనేత్రుడా యసురునిగూల్చె 877
అంతలో పాకుడా హరిహయు దాక
పంతగింపుచు ధాత్రి బడవైచె వజ్రి 878
నముచి రౌద్రముతోడ నాకేశు దాక
గమనించి దంభోళి కాశ్యపి గూల్చె 879
పంత వాయు కుబేర యామ్యాది దిక్పా
సంతతుల్ దమవంతు శాత్రవుల గెల్వ 880
దనుజులు వాలి రక్తరి దైత్యగురుడు
తన జీవవిద్యచే దైత్యులం దేర్చె 881
అమరాళి కమృతమైనట్టి యావేళ
అమరెను సంతోష మఖిల లోకముల 882
ఈ సత్కథను ధాత్రి నెవరైనవిన్న
దోసముల్ శూన్యమై దోచు పుణ్యములు 883
శత్రువుల్ నశియింత్రు సౌఖ్యంబు లొదవు
పుత్ర మిత్ర కళత్ర భూములొప్పారు 884
గజవాహములు గల్గు గవులును గల్గు
దేహాంతమున వారు దేవిసన్నిధిని 885
బాహాటముగజేరి ప్రజ్వరిల్లెదరు 886

## దాక్షాయణీ చరిత్ర

అనగ మౌనులు మోదమంది యిట్లనిరి
అనఘ శర్వాణి యెట్లయ్యె నీశునకు 888
అదిగూడ దెల్పు మోయయ్య మాకనిన
సదయుడై యెఱిగించె శౌనకాదులకు 889
వారక దూర్వాస వరమునీంద్రుండు
ఘోరంబుగా శక్తి గోర్కె తపించి 890

దొరకొన్న మాలలందున నొక్కమాల
సరళిగా దక్షప్రజాపతి కొసగె 891

దాని బూజింపుచు దక్షుండు వేడ్క
మాననీయంబుగా మాఘమాసమున 892

యమునానదిని తీర్థ మాడగబోయి
అమలత్వమున పూని యర్ఘ్య మియ్యంగ 893

తనదోయిటను వారి దాల్చగా నొక్క
అనుపమంబౌ చిన్ని యరవింద మందు 894

విస్మయాకృతి దాల్చి వెలగె నొకకన్య
విస్మయత్వం బంది దక్షుండు దాని 895

కాంత కియ్యగ నామె కన్గొవగానె
వింతగా బాలిండ్ల విరిసె దుగ్ధంబు 896

సంతసింపుచు వారి సదనంబు జేర్చి
యెంతేని ప్రేముడిని యెత్తి పెంచగ 897

ఘన శుక్లపక్షసంగత కళానిధిగ
అనువర్ధమానయై హాయిగాంచంగ 898

దాని రూపమునెన్న దరమె శేషునకు
మానినీతిలకంబు మాన్య చంద్రాస్య 899

నాసమౌ సంపంగి నవమౌక్తికముల
దాసులు రదపంక్తి రహి బంభరముల 900

నోర్చు ధమ్మిల్లంబు యుర్వి చక్రముల
గూర్చును పాలిండ్లు కూర్మి పాదములు 901

చిగురుటాకుల నొంచు చెలగు బెన్దొడలు
అగు రంభలే రిక్కలగు నఖపాళి 902

అపరంజి భూషణా లామెకు బెట్ట
చపలాక్షి పరిపూర్ణ శశిబింబమయ్యె 903

తనదు బిడ్డను గాంచి దక్ష డొప్పారు
అనురాగమున పెండ్లి నటు సేయగోర 904

ఎఱిగి యామాత దానేగి తన తండ్రి
కెఱిగి యిట్లనె నాత డెంతయు మెచ్చ 905
జగముల నీ జంతుజాలము ట్లేన
నగణితంబుగ పుట్టి యంత్యంబుగాంచు 906
వాని కెల్లను మూలతత్వంబు నేనె
మానక నేనుందు మహిని నా యిచ్చ 907

కాల స్వరూపమై గ్రాలు సర్వంబు
కాలము మీరగా గాదు జీవులకు 908
గాన కాలుని గెల్చి ఘనుడైనవాని
పూని మృత్యువు గెల్చి పొలుపొందువాని 909
అట్టివానిని గాక నన్యు జేపట్ట
నట్టి నను ప్రేమ మీయాజ్ఞ పూర్వముగ 910
గని తపోవృత్తికై కదలింపు దన్న
తనయ కోర్కెకు మెచ్చి దక్షుడు మహిషి 911
కెంతయు బోధించి హెచ్చు మోదమున
సంతసంబున నిచ్చి సఖియ లిర్వురను 912

## దాక్షాయణి తపం బొనర్చుట

పనుపగా నియతయై ప్రాజ్ఞ మార్గమున
ననుపమంబౌ నొక్క యంతరువు జేరి 913
వాయు చూడ్కుల నొక్క వరుసలో గూర్చి
పాయక మనమందు బశుపతి నిల్పి 914
భర్తగా గొనుటకై బహు తపించుటను
నార్తరక్షకు డైన నభవు డెఱింగి 915
కరుణతో విప్రుడై కదలి యాశ్రమము
కరుదెంచ బీఠ మియ్యగ గూరుచుండి 916
పూజల నొందె యా పొలతి. నీక్షించి
యోజించి సతినొంద నుల్లసిల్లుచును 917

కలకల నవ్వుచా కపట విప్రుండు
నిలువగా శర్వుడై; నెలత వీక్షించి 918
వెలవెల బోవుచు వేగంబ భక్తి
బలియ దోసిలి యొగ్గి భర్గాయటంచు 919
నా తప్పులను సైచి నను గావుమన్న
నీ తపానికె మెచ్చి నిన్నే వరించి 920
వచ్చితి ననగ నా వామాక్షి హెచ్చి
నిచ్చతో దనతండ్రి కెఱిగింప వచ్చి 921
ఆ క్షణంబున వివాహం బొనరింప
నీక్షించి పరికరా లెల్ల సమకూర్చి 922
నవరత్నచిత్రముల్ నగరాంగణముల
దివురగా నల్పి తన దివ్య దేహమున 923
అదిర శాస్త్రోక్తంబులైన తోరణము
గదుర సౌధాగ్రముల గ్రాలు పతాక 924
లెగుర గాంధర్వమై హెచ్చు మేళముల
నగణితంబుగ నించి యమరుల నొప్పు 925
మందార వనములో మహనీయమైన
మందిరంబున నొప్పు మహాదేవునప్పు 926
గౌరవోక్తంబుగా గని తోడితెచ్చి
కోరికాతును పెండ్లి కూతురుగ జేసి 927
పట్టుదుకూల విభ్రాజిత జేసి
గట్టుపిల్లుని చెట్ట గ్రాలగా జేసి 928
విరుల వర్షంబొప్పె వినువీధినుండి
హరి లోకజాదులు శుభంబొ గాక యనిరి 929
ఇందిరాదులు పాట లెసగ బాడగను
అందమౌ గీతాదు లలరించి రచట 930
వడిగ దక్షుం డంత భర్గు పాదముల
కడిగి యర్చించి సక్రముగా వహ్ని 931

ప్రాణమిల్లగా జేసె భద్రముల్ గొనగ
గణుతింపగాలేక కాలబాధితము 932

## వివాహ మధ్యమున శివు డంతర్హితుం డగుట

అంతలో దుర్వాసయతి దత్తమాల
గంతుకొట్టెను వాని జ్ఞప్తియందుండి 933
అంతవఱకును గొప్పయని యెంచుచున్న
అంతకాంతకుపట్లి నయ్యో నీపదము 934
అంత చింతయ్యె నయ్యది యెట్టిదన్న
నంతర్హితుండయ్యె నభవు డచ్చోట 935
కాంతుగానని దుఃఖకడలిలో మున్గి
అంతకంతకు మూర్ఛ నందె నా సతియు 936
ఆశ్చర్యమగ్నులై రందఱు గూడ
నిశ్చయింపగలేక నివ్వెఱపడిరి 937
అంత సతిదేవి యంతరంగమున
చింతించి తానింక శివు జేర నెంచి 938
తల్లిదండ్రులవేడి తపమొనర్పంగ
నెల్ల యాజ్ఞల నంది యేగె వనమునకు 939
తెలిపె లోకముల కాశ్చర్యమౌ తపము
ఇల పతివ్రతమార్గ మిట్టిదా ననగ 940
అంత దక్షుని మనం బంతయు గలగ
వంతచే నిది భర్గు వంచనగ నెంచి 941
సభజేసి బ్రహ్మాది సభ్యులను గాంచి
శుభకాలమున బోయె జూడుడీ హరుడు 942
కాతు నీతని కిచ్చి కుందుచే గాక
నాతప్పు లెప్పుడీ నలువాదులార! 943
దుష్టుడాతడు చాల ధూర్తవర్తనుడు
కష్టుండు ఖలుడును కపట సంచారి 944

అనుచు నేనెఱుగక నంధుడ నైతి
కనలేక పోయి తాకపటి మార్గమును 945
అనుచు శంభుని పట్లహంకారుడయ్యె
నని మానులను గాంచి యనియె సూతుండు. 946

## సతీదేవిని శివుడు కైలాసమునకు గొనిపోవుట

సతియు శంభునిగూర్చి నల్పగా దివ్య
మతి దపంబంత నా మన్మథాంతకుడు 947
నందివాహనమందు నలువాదులెల్ల
పొందుగా దనచుట్టు పొంధి సేవింప 948
కేలశూలముదాల్చి క్రీడగా సతికి
చాల గన్పించగా సతియునుగాంచి 949
పడి లేచి తననాథు భక్తి పూజించి
కడలేని మోదమున కౌగిలించంగ 950
వామదేవుడును దత్పరుడౌచు కరుణ
వామాక్షి హస్తముల్ బట్టి ముద్దిడుచు 951
ఉక్షంబుపై జేర్చి యొప్పు ప్రేముడిని
అక్షయంబుగ సురల్ హరహరాయనగ 952
తనపయి సుమవృష్టి ధారలుగురియ
ఘనమార్గమున వేడ్క కైలాస మేగె 953
ధరను నీ కథవ్రాయ దగ పఠియింప
పరమ సంపదలతో బరగుటెగాక 954
పరమందు జిచ్ఛక్తి ప్రాపు గాంచెదరు
మరి కథ న్వినుడట్లు మదిరాక్షితోడ 955

## దక్షుడు కైలాస మేగుట

గూడి శంభుడు పోవ కూడి నెచ్చెలులు
వాడమార్గము బట్టి వచ్చి దక్షునకు 956

నెఱిగింప గుపితుడై యెంతయు లేచి
మామకు మర్యాద యగునటె తలప 957
మును పెండ్లినాడొక్క మోసంబొనర్చె
నని పొక్కుచుండ నియ్యది కూడ సల్పె 958
భిక్షుకునకు గద్దె బిడియుం బటంచు
దక్షుండు దూషించు తఱిని భీతిల్లి 959
హరియజాదులు చేరి యనిరిట్లు రుష్టి
ధరణిలోపల నిద్ది తగని కార్యంబు 960
ఇది మహాదోసమా యిందుశేఖరుడు
సదయుండు పరతత్త్వశాలి ప్రథముండు 961
నీకల్లుడగువాని నిందించ నౌనె?
యే కాలమున నైన నెట్టివారైన 962
బిడ్డనిచ్చిన చోట బింకము న్గనరు
పెద్దవాడవు నీకు బొనగులు తగవు 963
బిడ్డ ప్రేముడి నైన భీమునిజేరి
అడ్డమాడక వాని కనుసారి వగుము 964
అన విని యాదక్షు డప్పుడే తరలి
యినకోటి భాసమై యెసగు కైలాస 965
మార్గమందున నేగి మన్మథాంతకుని
దుర్గమంబగు మహా దుర్గమును జేర 966
ద్వారపాలకు లడ్డి దక్ష నీవెందు
జేర బోయెద వన్న శివునికై యనగ 967
విశ్వంబునకు నేనె విభుడ నటంచు
నైశ్వర్యవంతుడ ననుచు గర్వించి 968
శాశ్వతుండును జగచ్చ్రయనేత యైన
నీశ్వరు గాంచగా నేగెదె? తులువ 969
దక్షా! మహాశంభు ధామంబు జేర
దక్షుండవా నీవు? తగవు పోపొమ్ము 970

అనగ దక్షుడు హెచ్చి యనియె వారలకు
గణములారా! జగత్కర్తనౌ నన్ను 971
నిరసించెదరె మీకు నీతియే లేదు
హరుడెంతవాడు వా డధముడం చెఱిగి 972
హరి యజాదులు చేరి యల్లుడై కాన
హరుని తప్పుల సైచి యాత్మజ కొరకు 973
సహుగు మీపని పల్క సంతవచ్చితిని
మరియాద దప్పె నే మరలెద వహ్వ 974
మేలు మేలింక నీమీద లోకముల
ఖలి గాంచగ నెట్లు సురలు వచ్చెదరొ 975
భవు డెట్లు ధర హవిర్భాగము ల్గొనునొ
భువిపైని భవుడెట్లు పూజార్హుడగునొ 976
చూతు నేనని మహా శూరత్వమొప్ప
నాతయొద్దకు జేరి తగ బల్కె నిట్లు 977
ఈరు చెప్పగ శర్వు నెంతయు గాంచ
ద్వారంబు కడకేగ ద్వారపాలకులు 978
నసు నాపుటయె గాక నగరి పంచించి
యనుమానమేల నా యభవున కింక 979
పూజ సల్పగరాదు భువనంబులందు
ఈ జగంబున నెవ్వరేని యటుసల్ప 980
నాకు శత్రువులంచు నమ్ముడీ యనుచు
ప్రాకటంబుగ వాని పదము సె కపుడు 981
చనగ తద్విధిగాంచి చతురాననుండు
ఘనముగా వొక్క యజ్ఞము సేయనెంచి 982

## బ్రహ్మయజ్ఞము

అమరాదులను బిల్వ నందఱుగూడి
యమరపెద్దపురంబు నప్పుడు జేర 983

కాల మాండూక, మార్కండేయ కణ్వ
వాల వసిష్ఠ విశ్వావసుబ్రహ్మ 1010
అల దధీచి మునీంద్రు డామరుత్సంతు
తలప వైయాఘ్రప విస్తారులౌ వారు 1011
రాలేదనుచునుండ రహి నా దధీచి
వాల శిష్యుండౌచు చనుదేర నంత 1012
అగణిత స్థానంబు లందించు చుంత
తగనిట్లు బల్కెను దక్షుని గాంచి 1013

## దక్ష దధీచుల సంవాదము

దక్ష: నన్నెందు కిత్తరి బిల్చుటనగ
దక్షుడిట్లనియె నత్తరి మౌనితోడ 1014
వింటిరి కద పూర్వవిధమెల్ల బేసి
కంటివానికి నాదు కడపట్టి నిచ్చి 1015
పరిణయం బొనరించు పట్ల దుర్బుద్ధి
మఱి మాయమయ్యె నమ్మూడ్కి వేడ్క 1016
తడవ జెప్పకయె నా తనయ నాతండు
అదనెంచి కొనిపోయె నంతర్ధి యౌచు 1017
మానసింపుచు నేను మా పట్టి వాంఛ
పూని వాని పురంబు బోవ గావలుబు 1018
గద్దించి నన్ను జీకాకుగా జేసి
రద్దియుం గాక నా యాత్మజ కతడు 1019
మాఱు మాటలజెప్పె మాచొప్పు వీడ
మీఱి యాపరమేష్ఠి మేటి జన్నమున 1020
నంది యాతని వైపు నను నొవ్వ బెట్టె
సంచియంబేల నా శర్వ హీనముగ 1021
జన్నం బొనర్పగా సమకట్టినాడ
నన నవ్వుచు దధీచి యాతని కనియె 1022

యజ్ఞేశ్వరుండైన నభవుని వీడి
యజ్ఞం బొసర్పగా నౌనె యీ జగతి? 1023
హరి యజాదులు వాని యంశములే గారె?
సిరియు నీ జగములా మహాదేవు కళలు 1024
గావె? వేదంబులా ఘనుని వాక్యములె
జీవాంతరాత్ముఁడై వెలగు నాశర్వు 1025
పరమాత్మ తేజమై పరగు నా భర్గు
సురి చేవ దేవుఁడై మహినొప్పు నీశు 1026
యజ్ఞ కర్తయు భోక్తయై తత్ఫలంబు
ప్రాజ్ఞతం బొందు నాపశుపతి నీవిడి 1027
శ్రుతి విరుద్ధంబుగా జేయు నీ మఖము
గతి యధో పతితమౌ గాదె యోపక్ష! 1028
కాలకాలుని నీలకంఠు నవ్యయుని
శూలహస్తుని చంద్రచూడు నాశర్వు 1029
నెదిరించగా నెవ్వ డిలనోర్చు? నింత
పదరేల? మాను మొప్పదు నీకు పక్ష! 1030
యన మండి దక్షు డిట్లనియె నాతనికి
ఘన సరోజాక్షుండు కమలాసనాది 1031
వరులుంతగా నొక్క వామదేవుండు
తరుగౌనె నాకింత తప్పది దీక్ష 1032
కాన వానిని వీడి కల రుద్రులకును
మానక నేనిత్తు మఖభాగములన 1033
ముని యిట్లులనియెనో మూఢుడా! వినుము
ఘనుడైన భూతేశు గని భక్తిగొల్వ 1034
ఫలమబ్బు నవ్వాని పరిగణంబులను
ఖలవృత్తి మాని శంకరు బిల్వుమన్న 1035
రాజాన మితి నధ్వ రాశ్య రుద్రంబు
గాజెల్లు మంత్రంబు గైకొంచు మిగత 1036

పద్రాని కేసిత్తు రూఢిగా మాపిని
షద్మ వాలను దాని జూడనేనన్న — 1037

ముని కోపమున పల్కె మూర్ఖ! దక్షుండ!
యసుమృగా ధాత్రి రుద్రాంశలనంగ — 1038

ఘన షణ్ముఖుడు కుంభ కాలనాఖుడు
అనగ హాటక కేశవగు విభావసుడు — 1039

కాలాగ్ని కూష్మాండ కాక వరుణులును
వాల నాకేశుండు సంతాపకాడు — 1040

ఒసగ నందెవ్వారి కిచ్చిన గాని
పొసగ వాతని కిచ్చు పూజ పూర్ణముగ — 1041

సత్య స్వరూపుండు సర్వజ్ఞు డతడు
నిత్యుండు పూర్ణుండు నిర్మలజ్యోతి — 1042

యైన శంభుని బిల్వమా, యింకనైన
దాన కొతండిచ్చు మఘ ఫలంబన్న — 1043

వాల శర్వుని పట్ల సంతాప పడకు
ఏకీల నాతడే యిల కర్త యౌను — 1044

అన్న పల్కునకులికి యాతడిట్లనియె
ఏన్న మాటలనాడ చెల్లునా దక్ష! — 1045

జ్ఞాని నిత్యానందఘనుడు పూజ్యుండు
మానక చిచ్ఛక్తిమయుడా భవుండు — 1046

హరియజాదులకెల్ల నతడె మూలంబు
పరిపాలకుడు లోక పాలకు డెన్న — 1047

తానె పరంజ్యోతి తత్పరుండతడు
ఆనందమూర్తి సర్వైశ్వర్యు డతడు — 1048

ధర ఏకమేవ రుద్రమ్మనా వేద
సరణి యేకాకిగా చరియించు నతడె. — 1049

సదయు డాతడు వాని సాటి లేరెవరు.
అదిగాక విను మింక నభవునిగూర్చి — 1050

మును లోకృతటి యేగి భూతేశుజూచి
అనుపుగా పరమాత్మయగు నెవ్వడనగ 1051
నతడు సమ్యగ్ధ్యానుడై పరీక్షించి
నతియించి వినుతించి నాగభూషణుడు 1052
సర్వాత్ముడును జగచ్ఛయనేత యతడె
నిర్వికారుడు సదా నిర్మలజ్యోతి 1053
బ్రహ్మాధిపతియును బ్రహ్మణోధిపతి
బ్రహ్మశివోమియై పరగునాతండె 1054
పశుపతిత్వం బంది పరగ రక్షించు
పశమీ జగము వాని వాడె నిత్యుండు 1055
అనుచు దక్షునకింక నాతడు దేలిపె
విన సభాసదులెల్ల విశ్రుతంబుగను 1056
గజముఖాసురుతోలు గైకొన్న కథయు
అజవిష్ణులకు శివు డగపడ్డ కథయు. 1057
వినిపించి మఱియింక వినిపించె నిట్లు
సనకాదులకు వేద శాస్త్రంబులిచ్చె 1058
హరిధాతలకును వేదార్థముల్ దెలిపె
పరిశుద్ధతత్వమీ ధపుడంచు వేద 1059
సమితి వక్కాణించు సత్యమీమాట
విమలుదాతం డింక వేయు నేమిటికి 1060
అనగ దక్షుండప్పుడనియె సభయందు
విను దధీచీ! వాడు వేద్యుడౌ నతని 1061
కబ్బియయ్యెడు గాక హవిరంశమీయ
నబ్బురంబగు పల్కు లాపుమిక నన్న 1062
దుష్టుడా భవునిట్లు దూఱుచున్నావు
కష్టముల్ నీకమరు కాలమేతెంచె 1063
కాచుకో యికనంచు గ్రక్కునలేచి
వేచనియె సభయెల్ల వెలవెలబోవ 1064

కాని దక్షుడు ధైర్యకలితుడై దేవ
ధేనువృక్షాదులం దివ్యరత్నముల 1065
సంతతులను దృప్తి సల్పి ప్రేక్షకులు
సంతోసమున నుండ సరగ నారదుడు 1066
కైలాసమున కేగి కాళీప్రయుక్త
హాళిగాంచి నతించి శోభనాకార! 1067
పక్షుండు మిము వీడి దరిలేనియజ్ఞ
దీక్ష సల్పుచునుండె దేవతల్గూడ 1068
ఈక్షణంబున వాని నెటులైన సరసి
శిక్షింపవే చంద్రశేఖరా! యనిన 1069

## సతీదేవి దక్షుని యజ్ఞమున కేగుట

కనిదుర్గ మదియందు విస్మయంబంది
ఘనసాధునకుమ్రొక్కి తానేగగోర 1070
సద్మాశంభుడు పల్కె నా మోహనాంగి!
యెవ్విధంబున నైన నెచ్చోటికైన 1071
ఆవాహనములేక చరుగ రాదనిన
ఆవారి గాంచగా మనసాయె దేవ! 1072
పితృదంప్రులను తోడు తరుణులగాంచి
కెల బంధుజాలము గాంచి మాతండ్రి 1073
కెచేగించి మీరీతినెల్ల మీకొఱకు
మటి మాజనకు బుత్తు మహదేవ! యనిన 1074
అనురాగమున నేగు మట్లే యనంగ
మణియుక్తఘంటికామయ విమానమున 1075
మాలినీ మానినుల్ మంగళాదులను
వాల కెలకుల నొప్పి చామరవ్ వీవ 1076
జయ కేశి సునంద లనెడి నాప్రమధ
తరుణుల గొల్వ నంబర భూష లొప్ప 1077

వివిధ వాద్యంబులు విరివిగా మ్రోయ
శివనాఢ్య ప్రముఖులు జేరి గొల్వంగ 1078
సభాంతికము జేర దద్భుందు లెల్ల
వీక్షించి మాటాడ రెంతయు మసల 1079

## సతీ దక్షుల సంవాదము

చకితయై యాదేవి జనకుని జూచి
అకటా యనుచు బల్కె నయ్యా యటంచు 1080
అఖిలబంధువులకీ వాహ్వాన మిచ్చి
సుఖముగా లోకముల్ జూచి మెచ్చంగ 1081
యాగంబొనర్చుచు యాగనాథుడగు
భోగికంకణు మాన బొసగునే తండ్రి 1082
అదిగాక నేగూతు నల్లుడా తండు
సదినెంచు నీపట్టి మహనీయు విడచి 1083
మఖమొనర్చుట యెట్టి మాట తలపోయ
అఘము చేకూరదే యందు నీకనిన 1084
నంది దక్షుడు సర్వమంగళను జూచి
యుండి నీనాథుండు మూర్ఖుడౌ మఱియు 1085
ప్రేతధాత్రి వసించు బిచ్చమెత్తెడిని
నీతిజాతియు లేదు నిలువెల్ల విసము 1086
కట్టుచర్మము చేత కనటు శూలమును
బట్టు బూదిని మెత్తు భైరవాకారి 1087
వీనాడు నిన్నతని కిచ్చినా నింక
నానాడె నీకు దిలాంబువు లిడితి 1088
పిలువకుండగ నిట్టి పేరంటమునకు
తలచి వచ్చుట నీకు తగదు పోపొమ్ము 1089
అన దుర్గ కోపించి యాతని జూచి
వినరోరి నీచః యా శివు పవిత్ర 1090

బృందారకులు జగద్విధి యెవ్వడనెడి
సందేహచిత్తులై చని దివ్యగిరికి 1091
ఈజగత్కారణం బెవ్వడో యనగ
ఆజనార్దనుడును నంబుజాసనుడు 1092
నేను నేన యటంచు నిస్తులంబుగను
పూని పోరుచునుండ భూరి చిచ్ఛక్తి 1093
ప్రణవ స్వరూపయై పరమార్గమందు
అనె మీకలీకృతి యదరగానేల? 1094

కర్తహర్తయువేరె కలడతడు నింక
భర్త చిన్మయమూర్తి ప్రాజ్ఞస్వరూపి 1095
అణువులందణువు మహత్తులన్నిటను
ఘనమౌచు మీకెల్ల కారణంబౌను 1096
అతడు పూరుషుడుగా దతివయుగాను
క్షితి నిచ్చనొప్పారు చెలగు లుప్తించు 1097
అతడ నేనౌదు నంచనుచుండ నెదుట
మితిలేని జలజాప్త మేటి తేజమున 1098
హరుడుమా సహితుడై యగుపించె నంత
పరమేష్ఠి విష్ణులా పశుపతి కెఱగి 1099
తమ గర్వముల వీడి తమ్ముదా మెఱిగి
అమరు సద్భక్తితో నంజలు లిడిరి 1100
అతడె శంభుండనగ నభవుండనంగ
క్షితిని నానాథు దక్షిణడాతండు 1101
ప్రళయకాలమున నీ బ్రహ్మాండమెల్ల
లలితమౌ నేత్రానలంబుచే గాల్చి 1102
చితభస్మముగ వీకజేసి యాభూత
పతి కపాలము దాల్చి భవ్యనిగమములు 1103
వేగగల్పించి యావిధి సర్వమందు
నాగమోక్తంబుగా నతడె దీపించు 1104

మనియించు నాదేవు మహిమను నీవు
గనుపన్న దక్షుడా కంజాక్షి గనియె 1105
నేనెఱుంగనివాడె యీశాను డనగ
వానితన్నను నీచవర్తనుండున్నె? 1106
ఇట్టింత ఘోషింప నేమియౌ నీకు
గట్టువిల్తుడు తాళిగట్టినకతన 1107
నీతోడ భాషింప నిశ్చయంబుగను
పాతకం బబ్బునోపడతిరో యింక 1108
బంధువనే గాను భవు జేరబొమ్మ
మొంపమాటలనాడ మొత్తింతు ననిన 1109
దుష్టుడా యిమ్మట్లు దూషించు నీకు
నష్టమౌ సర్వంబు నాకు లల్లాడ
అదిగాక నీయుత్తమాంగమేకాలు
చదరకు మింకనో పాపిష్టియనుచు 1111
శపియించి యయ్యాగశాలను వీడి
సపరివారంబుగా జనె పతిన్గాంచ 1112
వినిపించి నాధునకు వృత్తాంత మెల్ల
తన నాధునింగోరె తక్షణంచట 1113

## సతీదేవి దాక్షాయణీశరీరమును విడుచుట

నావద్ద మిముదూలె నా మనోనాథ
యేవగించెను మనం బికనిల్వజాల 1114
దాక్షాయణీయంచు ధర నన్ను బిల్వ
కుక్షిలోపల నేర్చె కూడదీజన్మ 1115
నా పునర్జన్మంబునకు నొక్కచోటు
జూపవే యన చంద్రచూడు డదిమెచ్చి 1116
అట్లైననీవు హిమాలయంబందు
బుట్టి పార్వతిగమ్మ పూజ్యు డాతండు 1117

తనపట్టితోడ నిష్టనయగా గోరి
కాని ఘోర నిష్ఠ చేకూరియున్నాడు 1118

అన దుర్గ మదమంది హరునెంచి యిద్ధ
మున మహాతత్త్వమై మోద మొప్పార 1119

కూటస్థలిని జూడ్కి గూర్చి యాధార
కూటాగ్ని నటలేపి కూర్చి వాయువును 1120

తన శరీరమొసర్చె దగ్ధ మాత్రముగ
పెను దుఃఖవంతుడై భీము డేడ్వంగ 1121

## వీరభద్ర మహాకాళుల జననము

ఆపైనిగల గాథ నలవియా చెప్ప
కోపానలంబు జేకూర రుద్రునకు 1122

తనదు మూర్తిని నగ్నిదాహగా జేయ
ననవగ్రహంబుగా నగ్ని యందుండి 1123

అయుతశీర్షుడు సహస్రాక్షుండు మఱియు
జయసిద్ధుడును సర్వసంకాశజటుడు 1124

మణికిరీటుడు మహా మహిమాన్వితుండు
ఘన గదా చక్రాది కలిత ప్రశస్త 1125

మౌనాయుధుండు హారాంచితుండు
ఆనర్తముగ నృత్యమాడెడివాడు 1126

రక్తగాత్రుడు మహా రణసోన్ముఖుండు
దిక్తటంబుల గూడ తెగటార్చు బలుడు 1127

ఘాతి రుద్రాక్ష ప్రభూతుడౌ వీర
జాతుడౌ భద్రుండు చయ్యన బుట్టె 1128

వాని వెంటనె బుట్టె వరబలశాలి
యైన మహాకాళి అట్టహాసమున 1189

## వీరభద్ర మహోత్కాయుల విజృంభణము

వామదేవుడు వారి వంక వీక్షించి
ఆమూలముగ చెప్పెనంతయు వారు
ఘాతవీరులతోడ పోరికై కడగి
ఘాతలాంబరములు ఘోరు మసంగ
వివిధాట్టహాసులై వేగంబ తరలి
గెలియ యజ్ఞమువారి గని పాఱజూచు
వారి బోసిక గావరిగాయ ఘాత
వీరు లన్నిరాయించి వీర భద్రుండు
భద్రకాళియు వేగ వాహాటముగను
రౌద్రమలై తలవెల్ల రాల్చి యూర్పులను
గోపురంబుల నెట్టి కుడ్యముల్ గూల్చి
యూపంబులను విరిచి హోమంబు దాటి
అట్టహాస మొనర్పనవరు దేవతలు
కట్టలై ధరగూలు గంధర్వతతులు
చుట్టలై పడిపోవుచున్న నాగులును
పట్టుదప్పగ వేగ పఱచు కిన్నరులు
కటకటంబడు యక్షగణము చారణులు
పటలు వీడగ బహ్వీజటిలులై తోప
వీరు శర్వోద్భూతవీరులే యనెడి
వారు ఎందులకిట్లు వచ్చితి మనెడి
వారు సతీదుఃఖవార్థియే యిట్టి
తీరౌచు మనపట్ల చేలె ననువారు
ఆ రుద్రపత్నిచె ట్లనియెను నట్టి
వార కాయెనటంచు వాపోవువారు
శ్రుతులు పల్కవె చంద్రమూర్తి నిందించి
హతమాయె రది నిజం బాయె ననువారు

తంత్రి యజ్ఞము గాంచదనవిష్ణు రాగ
గంత్రించు మొండి కీగతియనువాడు 1143

ఓయనా రనుచుండవీరభద్రుండు
ఘోరాకృతంబుగా ఘూర్ణిల్లి యచట 1144

అసమ భద్రుని కేళి హుంకరింపుచును
ముసలంబుతో శత్రుమూకపై కడచి 1145

ఉయపతి దేవతల నాటుచుండంగ
ప్రియమున నాయజ్ఞరంగంబునందు 1146

తన నిష్టయందున్న దక్షుని బట్టి
ఘన ఖడ్గమున వాని కంఠము ద్రునిమి 1147

వానిబంధువు లెల్లవాపోవుచుండ
నానందమున నగ్నినాహుతి జేసె 1148

హరియజాదులు గాంచియప్పుడు భీతిల్లి
హరుని ప్రార్థింపగా నాతని దయను 1149

బస్తమస్తకు డౌచుబ్రతికెదక్షుండు
నిష్ఠలంబుగభద్రునిర్మితుం డౌచు 1150

## సూతుడు శక్తిపీఠము లెఱిగించుట

దీనినింతటనాపి దివ్యమైనట్టి
స్థానదుర్గల మహా చరితమువ్వినుతు 1151

అరీతి సతికాయ మగ్నిలో జేర్చి
మారడంబై యుంచునట్టి చిత్కళను 1152

ఆన నాసింప్పుడు నభవుండు భ్రాంతి
హాసతీ హాసతీ యని దుఃఖపడుచు 1153

లోకంబులను బట్టిలోలుభుం డౌచు
ప్రాకటంబుగ లేచి పఱుగులువెట్టు 1154

అంత శ్రీహరి సూక్ష్మదౌచు చక్రమున
నంతరువులం జేసి యాభాగములను 1155

భూమిపై వెవజల్ల బొల్చె నావోట్ల
నామహావిష్ణుశక్తియైన పీఠములు 1156

ఎచ్చటెచ్చట నట్లు లెసగె పీఠములు
నచ్చ టచ్చటనె శర్వాంశ లొప్పంగ 1157

నన శౌనకాము లిట్లనిరి సూతునకు
వినిపించవే శక్తి విమల తేజములు 1158

నన సూతుడనెనిట్లు లనఘాత్ములార
ఘన శుభప్రదములా కాశీపీఠములు 1159

వినుడు తెల్పెద మీకు వివరమౌ నట్లు
మునులార మునిసిద్ధి మోక్షమార్గంబు 1160

ఆనందకాననంబగు విశాలాక్షి
ఆనంద మఠమునందయ్యె గాయత్రి 1161

అల ముఖముఖక్షేత్ర మందయ్యె గౌరి
ఉలసైమఠమునం దగె లింగధారి 1162

కమనీయ మగు ప్రయాగమునందు లలిత
విమలసౌ మధురలో వెలసె మీనాక్షి 1163

గంధమాదనమందు కాముకీశక్తి
సంధానముగ మానసం బందు కుముద 1164

దక్షిణక్షేత్రభూస్థలి విశ్వకామ
రక్షణీయగ నుత్తరమున ప్రపూర్ణ 1165

గోమంత భూస్థలి గ్గోమంతదేవి
ఆమహాగజపురం బందయ్యె జయతి 1166

మందరాద్రిని బొల్చె మరి కామచారి
అందె కన్యాకుబ్జమందు శ్రీగౌరి 1167

అల చైత్రరథమునందా మధూత్కట
మలయాద్రిపై నొప్పె మహిత రంభ [illegible] 1168

ఏకామ్రపీఠమం దెసగె కీర్తిమతి
పీక విశ్వమున విశ్వేశ్వరియనగ 1169

పుష్కరక్షేత్రాన పురుహూతయయ్యె
[illegible]ర్ష గామంద నీహారగిరిని 1170
[illegible] కేదారాన సన్మార్గదాయి
[illegible] తానేశ్వరంబున నా భవాని 1171
గోకర్ణపీఠము న్గాంచె భద్రకర్ణి
[illegible] శ్రీగిరియందు వెన్గె మాధవిగ 1172
[illegible]రంబున బిల్వపత్రిగా నయ్యె
[illegible] భద్రకోటి మందామె భద్ర యన 1173
[illegible] సువ్యక్షేత్రధాత్రిపై కమల
[illegible] మందారదేవి వృషభాద్రి 1174
[illegible]కోటస్థ రుద్రాణి యనగ
[illegible]ద్రలంబకములోపలనయ్యె కాళి 1175
భూరి సాలగ్రామమున మహాదేవి
[illegible] మహాలింగ సంగతిని కపిల 1176
[illegible]మౌ శివలింగమందు జాలంధ్రి
పొందె మాయా స్థలిన్ భూరి కౌమారి 1177
[illegible]కొట తీతియందు మకుటేశ్వరి యన
[illegible]కసంతానమున వేద్యా లలితగను 1178
మహితమౌ గయయందు మంగలాదేవి
మహిపురుషోత్తమంబున విమల 1179
[illegible] సహస్రాక్షంబు గనె నుత్పలాక్షి
[illegible]రు హోమమున మహోత్పల యనగ 1180
అలరు విపాశ మందు నమోఘాక్షి
[illegible]ల సుపాశమున నారాయణీదేవి 1181
మెగి పుండ్రవర్ధనమ్మున పాటలాఖ్య
[illegible]గును త్రికూటాద్రి యందు సుందరిగ 1182
[illegible]లంబునం [illegible] [illegible]పులయే యనగ
[illegible] మలయాద్రి కల్యాణిగా నయ్యె 1183

ప్రేమ సహ్యాద్రిపై ఏకవీర సనగ
రామతీర్థమునందు రమణగానయ్యె 1154
ఓలప హరిశ్చంద్రధాత్రి చంద్రికగ
అల మృగావతియయ్యె యమున తీర్థమున 1155
కోట తీర్థమునందు గోటరీదేవి
తేట మాధవమందు ధీర సుగంధ 1156
గోదావరీనదిక్షోణి త్రిసంధ్య
ఆదేవి శాద్దూలంబందు నందినిగ 1157
హరి గంగాద్వారమం దతిప్రియగ
ద్వారకాపురములో బరగె రుక్మిణిగ 115
మొనసి శ్రీశివకుండమున శుభానంద
లనుపుగా శ్రీబృందావనం దొప్పె రాధ 11
పాతాళధాత్రిపై పరమేశ్వరిగను
ఆటిల్లి శ్రీవినాయకధాత్రి నుమగ 11
చిత్రంబుగా మధుర జెందె దేవకిగ
చిత్రకూటంబులో సీతయై యొప్పె 11
అల కరవీరమం దామె శ్రీలక్ష్మి
తిలకింపగా నుష్ణతీర్థమం దభయ 11
వింధ్యపర్వతమందు వెస సువాసినిగ
వింధ్యపరిసరధాత్రి వెలిగె నితంబ 11
అల వైద్యనాథమున నారోగ్య యయ్యె
చెలగె మాండవ్య భూస్థితిని మాండవిగ
ఘన మహాకాల సంగతి మహేశ్వరిగ 11
కనక మహేశ్వరిం గలిగె నాస్వాహ
ఛగలండ మందొప్పె చండికాదేవి 11
ఇగ వరారోహ సోమేశ్వరం బందు
అల పురందక పురంబందయ్యె చండి 11
తలప మాహేశ్వరి స్థగె సోమిదేవి

భువి ప్రభాసంబున బుష్కరావతిగ
అవల వాగ్దేవిగా నామె విధిపురిని 1198
రహితలంబందు పారావార యనగ
మహి పయోష్ణిని యయ్యె మహితవింగళగ 1199
భువిని మహాలయంబున మహాభాగ
అవల సింహిక యయ్యెనా కృతస్థలిని 1200
అరయ కార్తికధాత్రి యందు శంకరిగ
వర లోల యయ్యె నుత్పల ధాత్రియందు 1201
సొరిది సౌభద్రగా శోణసంగమున
మరి సిద్ధవనములో మాత మహాలక్ష్మి 1202
భరతాశ్రమంబున స్ఫురగె ననంగ
మరియు జాలంధర మహి విశ్వముఖిగ 1203
కిష్కింధ భూధర క్షితియందు తార
నిష్కర్షగా దారునెలవులో బుష్టి 1204
ఘనమైన కాశ్మీర కాశ్యపి న్మేధ
మొనసి హిమాద్రిపై మురిసె నా భీమ 1205
విశ్వేశ్వరీ ధాత్రి వెలసె దుష్టిగను
శాశ్వతారోహణ క్ష్మాస్థలి మాత 1206
లలితమౌ నా గపాలము నందు శుద్ధి
అలరె శంఖోద్ధార మందు శ్రీధరగ 1207
పిండారక క్షేత్ర పృథివిపై ధృతిగ
దండియౌ చంద్రభాగస్థలియందు కళగ 1208
మరి శైవధారిణిగ మచ్ఛోర మందు
ఉరసిగా బదరియం దొప్పె నాదేవి 1209
కురుధాత్రి యందు చేకూరె నోషధిగ
అరయ త్రుత్యాలయం బందయ్యె నిధిగ 1210
ఆకాశద్వీపమం దలరె గుశోధ
వీక పశుపతియందు వెలిగె పార్వతిగ 1211

వేద వచనంబందు వెలసె గాయత్రి
ఆచట బ్రహ్మయం దయ్యె సావిత్రి 1212
దివ్యలోకంబులో దేలె నింద్రాణి
అవ్యయం బగు ద్వాదశాత్మ సుప్రభగ 1213
హేమకూటంబులో హెచ్చె మన్మథగ
ప్రేమ మాతల వైష్ణవీ మాత యయ్యె 1214
తెలియంగ సత్యవాదిని కల్విధాత్రి
తలప పీఠాధరీ స్థలియందు సమ్మత 1215
అల వందనీయగా నశ్వద్ధమందు
తలపగా నా తిలోత్తమగ నచ్చరల 1216
ధర నరుంధతి యయ్యె తగ వధూమణుల
మరి బ్రహ్మకళయయ్యె మానసంబులను 1217
సర్వస్వరూపం దీరీతి శక్తియే యొాచు
నిర్వహించెను సృష్టి నేర్పు మీరంగ 1218
ఈ నూటయెన్మిదై ఎసగు క్షేత్రములు
ఏనోట బడువాడె హెచ్చుభాగ్యుండు 1219
ఎన్నిమంత్రములైన నిలపైని దీని
కెన్నగా సరిగావు యిది నిశ్చయంబు 1220
మానక నీమహా మంత్రరాజములు
దానోట వల్లించ దలప వ్రాయంగ 1221
శక్తితో మాట్లాడజాలుచే గాక
ముక్తి గాంచునుమహామోద మెప్పార 1222

## శక్తి హిమాలయమందు జన్మించుట

ఆలీలశివపట్టియై పుట్టనెంచు
కాలమందున మంచుమన నగేంద్రుండు 1223
జ్ఞానమానమేతుడై శాంతిసత్వమున
బానక జటిలుడై భస్మత్రిపుండ్ర 1224

మరలెల్ల దనచుట్టు సురటీలువైవ
మరి దివ్యమునులట్టి మహిమ నెన్నంగ 1280

దివ్యలోకము లెన్నొ తెల్వియు దాటి
అవ్యయానందమైనట్టి మార్గమున 1281

తెలకులందీయూష కేంద్రముల్ దాటి
కలపపుష్పంబుల గంధమున్బొందీ 1282

సుమమహాఫలసార శుద్ధపాతేటి
వరలితెన్నెలను ద్రాక్ష పందిళ్ళయందు 1283

తేనెమార్గములందు దివ్యసుందరుల
గానమాలింపుచు ఘనపద్మరాగ 1284

కలపవృక్షములందు గ్రాలిదివ్యముగ
కలకలంగూయు చిల్కల మెచ్చికొనుచు 1285

నవరత్నసోపాన సవ్యమార్గమున
నవిరళంబౌకోటలందు బేటలను 1286

అక్షౌహిణీ దివ్యలగు యంగనాళి
వీక్షించి నతియించి యెంతయు హాస 1287

తులనియ్య మెచ్చు చందుల బోసదోస
తులలేని మణిదీధితులరత్న దీప 1288

ములవెల్గు నొకవనంబునుగాంచి యందు
నలలితానందమౌ నవ్యస్థలమున 1289

మూర్తులెల్లరకాది మూర్తియైలోక
వర్తియౌపరతేజ పరిపూర్ణపుష్టి 1290

మైనరూపంబది మానితాకార
లీనులౌదుట వారి లీల లద్భుతము 1291

అన నగేంద్రుండప్పు డా మాతకెఱగి
గనజేయుమా నీదు ఘనతేజమనగ 1292

## విశ్వరూప సందర్శనము

పాదంబులొప్పె మహాతలంబుగను
అనఘగుల్ఫంబు లలమహాతలము 1293

పసపడి జంఘలై రసాతలము
తమిపరిజానువుల్ దగెరసాతలము 1294

ఊరువుల్ వితలమై యొప్పారెనంత
మొలి నితంబమై మేటి యతలంబు 1295

తలపై పైపై యొప్పె నుతలలోకంబు
వెలసిల్లె భూలోక విశదమైనాభి 1296

పరగె నుదరము భువర్లోకమౌచు
నరయ సువర్లోకమయ్యె వక్షంబు 1297

ఘనమహర్లోకమై గ్రాలెగంఠంబు
తనరె గహాలంబు ధాతలోకముల 1298

నాసమె స్థిరముగా నలినాప్తవిధులు
వీకనేత్రములుగా వేదముల్ పలుకు 1299

వాయువు ప్రాణమై బరగగా దిశలు
పాయకశ్రుతులౌను బరగ లోకములు 1300

హృదయంబుగా బరమేశుడు గాగ
అదిరకైలాసం బె యూపెకవముగను 1301

మాయలీలగ శంకరాంబె సీపు
ఆయహోరాత్రంబు లావెక్షణములుగ 1302

సభము నాభికయైన నదులు నాడులుగ
పరిభవించె స్వర్గమై బంధురస్మితము 1303

పిష్వలాశ్వినులెల్ల పీకనాసాలుగ
వైశ్వానురుదె ఫాలభాగమై యొప్ప 1304

శతధృతి స్థానంబె వాలతీకముగ
అతులితంబగు పుష్కరంబె కేశంబు 1305

కాయుచె దంష్ట్రలై కాళ్లిలగా వేడ్క
వాల ధర్మంబులై వనె కర్మలెల్ల 1306
పెంపు నేత్రంబుల నెక్కు శిరములును
పెక్కు ఖడ్గములతో పేర్మిమగనుపట్టు 1307
నిట్లు హిమవంతుడు తల్లి మోంమున
నిట్లు సాష్టాంగంబు లెంతయు వేడ్క 1308
వినుతింప మెచ్చి దీవించి వారలను
తన విశ్వరూప సంవర్శనంబువిపి 1309
నాటియజీదేహ దహ్యాకాలమున
శ్రీమాజ్ఞ హిమవంతు తనయగా నౌచు 1310
నాడునినే సేవింతు నన్నపల్కునకు
కరము నా హిమవంతు కన్యయై యొప్పె 1311
నిమ కన్యకాత్వంబు కనుటతో జూడ
హిమవంతు దంపతుల్ హెచ్చినమోద 1312
మునులౌచు నగరోత్సవంబు సేయించి
మరి పార్వతిగ బిల్చి మనుచుచుండంగ 1313
వాలగా సితపక్ష శశియోయనంగ
నాలపెరుగుచునుండె పర్వతుని యింట 1314
అంతనా పద్మాక్షి కైదవయేడు
గొంతగడవ భర్గు గూర్చితపియించ 1315
తలపు గల్గిన వల్కె తనతండ్రిగాంచి
యుల జీవులకు మృత్యు వెంతయు నిజము 1316
కాన మృత్యువునొంచు ఘను దెవ్వడతని
పూని భర్తగగాంచబోవు దపియించ 1317
వినగ హిమవంతుడా యమ్మ నిశ్చయము
మనమునందున నాట మదిమెంట విజయ 1318
జయలోను గాగల్గు సఖియల నిచ్చి
సమముతో పనుప నా నాతియు నేగి 1319

చేరి గౌరీనాథు శిఖరాగ్రమందు
దారక భవునాత్మ వరియించి నిష్ఠ 1320
నిలిచి యేకాగ్రయై నిర్వృతితోడ
సలిలభక్షణగూడ సలుపుటమాని 1321
వాయుభక్షణగూడ వదలి యుగ్రముగ
జేయుచుండె దపంబు శివునాత్మనెంచి 1322

## శుంభ నిశుంభుల చరిత్ర

శౌనకుడ యిట్టుండ నింకొక్క గాథ
చేకొని వినిపింతు చెలగు నీ కథలు 1323
మునురాక్షసుల నెల్ల మునుమున గెలిచి
యసువుగా బీయూష మంది నిర్జరులు 1324
అమరావతిలో నగనొప్పుచుండ
సమిత బలాఢ్యులై నట్టి శుంభుండు 1325
వాని సోదరుడైన వర నిశుంభుండు
పూని మహాదంభ ముండములతోడ 1326
రక్తబీజాసుర రాక్షసుంగూడి
శక్తుడై తపియించి శతధృతింగూర్చి 1327
పరిపంథి విజయంబు బహు వాహనములను
గరిమ శస్త్రాస్త్రముల్ ఘనతేజములను 1328
బొంది పురుషులచేత బొలియకుండంగ
నందిరి బహుకోట్ల నంతియేగాక 1329
రుధిర బీజాసురు రుధిరంబు ధాత్రి
నధిగమించగ నెట్టి యసురులు లక్ష 1330
మంది జన్మించగా మరి వరంబులను
నంది యా కోట్లల నవనిపై మోప్పి 1331
సేనలతోగూడి చెలరేగి బుధుల
పూని హింసించుచు బుధకర్మలెల్ల 1332

ఆమాత కృపచేత నౌను మీకెల్ల
కామితంబులు సర్వ కష్టముల్ దీరు 1347
అని దివ్యముని వారలందఱతోడ
చని నిచ్ఛతోడ సంచారియై యెటకొ 1348

## దేవతలు పార్వతిని ప్రార్థించుట

పరమేష్ఠిలోనైన భవ్య నిర్జరులు
హరితోడగూడి నీహారాద్రిజేరి 1349
కని యంబ తపియించు ఘనపర్ణశాల
మునివృత్తయై మహా మోదమార్గమున 1350
ఘోరమౌనిష్ఠలో గూరి సర్వంబు
దూరంబుగాజేసి ధూర్జటి గూర్చి 1351
సాకల్య చిత్తయై శక్తి స్వరూప
మేకత్వమున నిల్పి యెసగు పార్వతిని 1352
ప్రాకటంబుగగాంచి ప్రార్థించిరిట్లు
ఓకాళి రుద్రాణి యోకాళికాంబ 1353
సతతమహాతేజ సాధుభాగ్యంబ
నిత సచ్చిదానంద నిర్మలజ్యోతి 1354
ఈవె కర్తృత్వంబ వీవె కారయిక
వీవె క్రియాశక్తి వీవె పరమవును 1355
చంద్రసూర్యాగ్నితేజములెల్ల నీవె
ఇంద్రియాద్యాదిలో కేశులు నీవె 1356
ఈ జగంబులకెల్ల నీశ్వరి వీవె
బీజరూపిణివి నీ కీర్తివునీవె 1357
వేదార్థములు నీవె విద్యాదులీవె
ఆదిమూర్తివి నీవె అనుపమంబీవె 1358
కర్మసాక్షివి నీవె కామ్యంబు లీవె
ధర్మమూర్తివినీవె దైవంబవీవె 1359

గరిమ వసంతమై కాలమొప్పార
మరి విల్లుతెమ్మెరల్ మందగతి వీవ 1373
క్రొమ్మొగ్గతెల్లజిగుర్ప్ప మఱియు సర్వములు
వేయి లోకములెల్ల పరివిగా కీర 1374
సంతతుల్ కేర జాపాణముల్ గరుగ
ఒంరుజాలము చొక్క జగమెల్ల మ్రొక్క 1375
సకల మయూరముల్ సలుప నృత్యములు
పికసంతతులువేడ్క వీనులందోర్చ 1376
నారులు హేషింపగా కరులు మోదమున
కరములెత్తుచు నమస్కారముల్ సలుప 1377
శృతులగూర్చుచు వీణ చెలగ మీటుచును
అతిమనోహరముగా నాలాపమమర 1378
దివ్యగాత్రరవంబు పరగ గచ్ఛపిని
దివ్యగాంధారంబు దేవి బాడంగ 1379
కాళికా కౌశికుల్ గలసి పాడుచును
తాళముల్ పై చిరత్తరుణంబునందు 1380
చండముండులు కాల సరణిమోదంబు
నిండ బోవుచు గాంచి నిల్చిచకితుల 1381
గాంచి యొక యద్భుతైన గదలగానోడి
మించి యాశుంభుసామీప్యంబు జేరి 1382

## చండముండులు శక్తిత్రయమునుగూర్చి శుంభునితో దెల్పుట

శౌరః మహాచిత్ర మాయెగా నేడు
నారులు మువ్వురీ నగరికేతెంచి 1383
యావనంబున నొక్క యాలయంబందు
దేవనొప్పిరి వారి తీవినెన్నంగ 1384
తరమౌనె గీర్వాణ ధాత్రిపైగాని
మరి నాగగంధర్వ మహులపైగాని 1385

పికపోలినవారి పింటిమే మున్ను?
చాటుకచ్ఛపిమెట్ల సవరించి కన్న 1386
లరమోడ్చి సఖకాంతు లందువింవించ
గురుకుచంబుల నంటగూర్చి వీణెలను 13·7
చిరునవ్వు లమృతంబుజిల్క గాత్రముల
వరకీరములగేప వాక్కులతోడ 1388
మేళవింపుచు వాద మేతలను మాని
లీలమృగావళుల్ లేగలను మఱచె 1389
కీరమయూరముల్ గేరె రాలెల్ల
జారెసిరైవృక్ష సమితి చిగిర్చె 1390
నారీతి హంసవరాలిపురాలి
హారహంసశ్రీయు లంత పున్నాగ 1391
కలితాచలయు చంద్రకళచక్రవాక
మలయమారుత మహా మధురసనాట 1392
గములంఘులును, కచ కర్రింధినూ గాల్లు
గమన శర్రివణ నాభి ఘన పిరుందులును 1393
చిరునవ్వు పాలిండ్లు చెలగు నుచ్ఛ్వాస
వరచరణాదులై వరుసగా నొప్పె 1394
వారి నెన్నగనొక్క భారతంబౌను
వారి వల్కాక కోటివరహాలమూట 1395
వారి నాదములాత్మ వరచిదానంద
దారులిద్దర వారు దైవమోహితలె 1396
సారసంబులు వారి జాతంబు లౌట
కోరి తార్రిమలు ధాత్రి కోవలంబుట 1397
అలశంఖములు దిన్నెలందు గన్పట్టుట
ఇల చక్రిములు ఖూజ మెలమి జేపటయు 1398
నళిక జాలంబు బిమ్మల ధూపటయు
ఖేర ః రంధలు ధాత్రి వనములంటుంట 1399

చిగురుటాకులు పికాంచిత ఘ_త్తపౌట
తిపురు రిక్కలగాంచ దివియందు సంప 1400
గాకయుండిన వారి కన్నులం బడల
నీక కంఠంబుల న్వేలయు వక్షోజ 1401
మూగారులందొడల నునుపు పాదములు
బాగైన నఖపాల భాగముల నందు 1402
పరియధరోష్ఠాన మాధుర్యముంట
సరిగాపు కెంపులచ్చగ దానినంద 1403
వేయేలనీధాత్రి వెన్నెల జేడు
చేయజాలడు వారి చిటిగోటికైన 1404
ఇకను చెప్పగనేల నినుకాంతులౌరసి
సకలాత్ముదెవ్వడో సరగనల్పెనుగ 1405
సత్యలోకాధీశు బాలనెప్పించి
దైత్యరారాజవై ధరణియందొప్ప 1406
అష్టదిక్పాలకుల నల్లాడజేసి
స్పష్టంబుగా దివ్యవాసమున్గనిన 1407
ఆనందమౌనె నీయతివలం గౌనెడి
యానందమునకు వేయవ భాగమైన 1408
యనగ శుంభుం డప్పుడానందమొంది
ఘనుడైన నొక దార్పుకాని బిలిపించి 1409

## శుంభుడు సుగ్రీవుని బంపుట

వింటివె సుగ్రీవః వీరి మాటలను
వంటయింటికి జేరువరశశంబులుగ 1410
పాపమెవరోగాని పద్మాక్షులంట
ఏసగిదినోవచ్చి యా పురంబందు 1411
నున్నవనమందొప్పుచున్న సౌధమున
నున్నారటదియెంత యొప్పెడిమాట 1412

కావున నీవేగ గావలయునటకు
నీవెఱుంగనిచొప్పు యిలయందులేదు 1413
కానన్పై నీదు కనికరంబొప్ప
పూనినాకై చిన్న పుణ్యకార్యంబు 1414
వెంటనేపోయి నావిధమెఱిగించి
వెంటగై కొనిరమ్మ వేగమేపొమ్మ 1415
అనగ నాసుగ్రీవు డప్పుడె పోయి
అనె వారితోనిట్టు లహాహా యెవరు 1416
మీరమణీయముల్ మీ యొయ్యారములు
మారాజువిని చాల మన్మథప్రేమ 1417
గూరె మీ పుణ్యంబు గొప్పదిగాన
వీరలున్వినుడట్టి మేటినిగూర్చి 1418
పాకశాసనునెట్టి పాలించెవిని
ఏక దిక్పాలాది వీరులంగెలిచె 1419
యజ్ఞభాగములెల్ల నతడె భక్షించె
ప్రజ్ఞానుడగువాని సాటిలేరిలను 1420
వాని నామము శుంభవర చక్రవర్తి
వానితమ్ముండౌను వర నిశుంభుండు 1420
అదిమేలు వారు మీకనువరులైన
పదునాల్గులోకముల్ పాలించవచ్చు 1422

## అంబ సుగ్రీవునకు జవాబిచ్చుట

అన నంబవచియించె నమరమానవులు
దనుజులుగూడ నాదర్పాని కొదిగి 1423
మమ్ముగై కొనలేక మసలుచున్నారు
నమ్ముగాదిది మేము వారి నామముల 1424
విని చాల ముదముతో వేగవచ్చితిమి
ఘనుడైన నిన్నె మాకడకంపె నిట్లు 1425

వారికిదెల్పు మీవర్తమానంబు
కోరివచ్చితిమిగా కుశలంబు మేము 1426
చూపులుమీరొట బభమహార్తమున
జేరవమ్ములబెండ్లి శీఘ్రంబయౌను 1427
కాని మాకొకదీక్షకలదు. మాతోడ
పూనిపోరగమికు పౌనగును పెండ్లి 1428
అక్కటా ! యొకదీని నరయకయున్న
నొక్కనిమునపైన యోర్వతే మనుపు 1429
అనగ సుగ్రీవుడా యంబనుగాంచి
వినగ నాశ్చర్యమై వెలసె వీనులకు 1430
వెఱ్ఱివీక్షసుబాని విఱ్ఱి పిగకుదు
విఱ్ఱమాటలికేల వేగంబె శుంభు 1431
వానితమ్మునిగూడ పసులుగా జేసి
తోన గైకొనివత్తు తొట్రుపాటేల 1432
అని వెంటనేపోయి యంతయు దెల్ప
సని మాటకై కొంత యనుమాన మంది 1433

## శుంభుడు ధూమ్రలోచనుని పంపుట

ఘనధూమ్రలోచనుంగాంచి నీ విపుడె
చని వారినింక నా చక్కికిటుదెమ్ము 1434
కని సామమున నిట్లు కాదేని బల్మి
అననాత దదియెంత యనుచు దావెడలి 1435
మనమునం దనుమాన మలచగా బోయి
వినవమ్మ మానేత విమల శుంభాఖ్య 1436
దనుజుండు నిను గూడదలచెను వాని
యనుజుండు తాగూడ నతిప్రేమతోడ 1437
వీరిగ్గైకొనవెంచె విధియత్నమిద్ది
మీరె మీభాగ్యంబు మించె పుణ్యంబు 1438

పశునాధుడైన నొప్పని వారిముందు
అశుభంబుగాబల్కనౌసె నెపుడ ఖన 1439
శుద్ధ ఛాందసుడైన సుగ్రీవుడేమొ
యుద్ధతలంపు మీకున్నదంచనగ 1440
వా నిరతి సంగ్రామ తత్పరంబనుచు
నేను బాగుగజెప్పి నీతి నిల్పితిని 1441
కాదేని యాదనుజకంఠీరవములు
ఆదరింతురె మిమ్ము ఆభయములేదు. 1442
ఏమీదిపేర్చుచే మేదినివ్రాలి
కాముశరముల జిక్కెగాన శుంఠుండె 1443
ఓడిపోయెనటంచు నొప్పుకున్నాను
చూడుడీ యిదిమంచి శుభము మీకనిన 1444
అటనంట యుగ్రయై యనియె ఛండాల
యిట తార్క్ష్యకహత నీ విట్లు కూయుదువె 1445
ఛీ నీదుబ్రదుకేల సిగ్గు లేదటర
నీ నాలుకను జీల్తు నిల్వరా యికను 1446
అన కాలరౌద్రియై యమరపూశితను
ఘనమదేభముగోరు గార్దభమురీతి 1447
కోవమ సింగముగోరు గోమాయువనగ
మదమెక్కి పల్కెదే మఱుమాటలేల 1448
ననికి రమ్మింకని న్నంత మొందింతు
ననగ గోపించి వాడకాశిజూచి 1449
పాత్రమూవపుపెంకు ఛాతియౌ మొగము
చేత దిత్తులరీతి చెలగగా చనులు 1450
ప్రేలుచుంటివి పుట్టువెధవ ఛీ కుంక
యీలీల నాతోడ హేళనా నీకు 1451
ఛండాలి నాకు నీ శాసనంబేమి
ఉండు ముండికను నిస్సిగ్గుగూల్పకయె 1452

వసుధాపస్రి లోచనుండన గూడదనుచు
కణకన నేత్రాగ్ని కణములుప్పొంగ

విలుగట్టి పటువాణ వితతి గుప్పంగ
తిలగింజలుగనేసి తీవ్రబాణముల

విరథుజేయగ వాడు విలునెక్కు పెట్టి
మఱియొక్క రథమెక్కి మార్కొనికాళి

పై నేయగా దివ్యభల్లముల్ గురిసి
వానిశతాంగంబు వ్రక్కలుగ నర్చి

వానిబాణాసనంబును ద్రుంచిసూతు
తోన ధాత్రినిగూల్చి తురగసంతతుల

నురుమాడ విరథుడై నాడుబాహువుల
పరిఘ కాళినివైవ బట్టి యాచేత

నురవడింపుచు వాని యురమున బొడువ
ధరణినెత్తురు గ్రక్కి దనుజుండు వడిమె

గదిసిసేనల నంపుగముల నేయంగ
శవములెల్లెడ నిండె జన్యస్థలమున

వాకలేయుచు రక్త వాహినుల్ సాగ
కాకఘూకాదు లక్కడమూగె వఱదు

వెల్ల వృజ్జలమెక్కె నీరీతినచట
నల్ల కల్లోలమౌనట్లు బాణములను

ప్రేంఖంబులుగ యుద్ధ భూమిపై గురిసి
శంఖారవమొనర్చె సరగ నాకాళి

అంతనాహత శేషు లరిగి పురంబు
అంతకంతకు హెచ్చనేడ్పు దూమ్రాక్షు

డట్టో మహాకాళిదా చేతి పరిఘ
దెబ్బచే గూలంగ తికనుకలవ్యై

ననగ గుండియ లెల్ల నణచిన రీతి
కొనగ భీతిని శుంభ గోర్కెరావించి 1466

## శుంభుడు తమ్మునితో నాలోచించుట

అనుజ : యేమీది చిత్రమాయెరా నేను
కనవినలేదెప్టు కలికితంత్రియంబు 1467
మదమెక్కి ధూమ్రాక్షు మహిగూలనేసి
అదరుచు నుండి రట్లనగ నాతండు 1468
హరిహయుపోనెట్టి యగ్నినిదూర్చి
మరియు ప్రేతాధిపు మదమడగించి 1469
కోణాధిపతి నొక్కకోలచే నొంచి
మానకః పతి నొక్కమాటలోగెల్చి 1470
పవను నొక్కమ్ముచే బాధించియంత
తివిరిన ఈశాను దిప్పలు బెట్టి 1471
నట్టి మనకీచానలన నెంత వాహ్వా
పట్టి తెచ్చెదనింక బనుపుము నన్ను 1472
అని ధూమ్రలోచనుండన వృద్ధుడౌట
వనితల మాయలంబడి యీల్గెనేమొ 1473
దానికై నీవింత తగదు యోచించ
పూనుధైర్యమనంగ పొంగి యాతండు 1474
నలిపి యాలోచనల్ చండముండులను
పిలిపించి వారితో భీషణంబుగను 1475
సిగ్గుపీడుచు క్రొవ్వుచే నిక్కుచున్న
ముగ్గురు వనితలకా ముందుగా గాలి 1476
గట్టి తెండిటకట్లు కాదేని వట్టి
మట్టు బెట్టుడు జన్యమహియందు మీరె 0477

అనవారలును లక్షయరదముల్ గొనుచు
ఘన ధరామార్గముల్ గప్పుచుబోయి 1478
ఆర్భటిల్లుచు పెచ్చి యంబనుగాంచి
నిర్భయంబుగ బిల్చి నిల్చి యిట్లనిరి 1479

## చండ ముండుల యుద్ధము

శుంభ నిశుంభులజూచి యున్నారె
దంభోళిధరు పోలి దమనులు వారు 1480
అవి వారిగెల్వమా యనబోకు డింక
ఘనసాళువము ముందు కాకి పిల్లెంత 1481
తరళాక్షి వారితో తగపేలననెడి
సరసులౌ హితులైన చక్కని లేరె 1482
సురలెన్న నుతిగన్న చోరులీధాత్రి
మరి వారిమాటలను మహి కొంపగూలు 1483
ఉడుకు మురుకను వార లుందురేగాని
యురకవచ్చెడి వారలుందురే ధాత్రి 1484
ధరరిత్త మంగలాతడు బిల్లితలను
గొరిగినట్లుగ మీకు కూడదీ తగవు 1485
మామాట విని శుంభు మగనిగా గొనుడు
కామశాస్త్రంబులో గట్టి వాడితడు 1486
ధర్మ మిత్రులమంచు దలపుడీ మమ్ము
నిర్మలాంగిరో యిట్టి నీతిలేదెందు 1487
అనుచుండ వారి నా యంబయుగ్ర గాంచి
కణకణాగ్నిచ్ఛటల్ కనులదూలించి 1488
ఛండాలులార మా శౌర్యముల్ జూప
రండు రండికమిమ్ము రణధాత్రి గూల్తు 1489

నిట్టి శుంభనిశుంభు లెందరిని గావి
మట్టు వెట్టెదకాని మడిమచే నొత్తి 1490

అనుచు దేవియు శంఖ మపుడు బూరింప
గనివారలును దేవి గదిసి తీవ్రముగ 1491

శరవర్షమును గుప్ప శక్తి దున్మాడి
కరము కల్పాంత మేఘము మాడ్కి నురియు 1492

విలురోహితంబుగా వెల్గు చుండంగ
తలపగా శంపానిధానమై బాణ 1493

వర్షము గురియించె వరపూర్వదేవ
శీర్షముల్ శరకాలి శీర్ణముల్ గాగ 1494

కాళరాత్రిగ నొక్క గదకేల దాల్చి
కాళివెడలెను జిహ్వ కదలించి కొనుచు 1495

భయద సింగపుతోలు పట్కాధరించి
పయిన నా చర్మమే పైటగా నొప్ప 1496

నిక్కి పిల్లల వ్యాఘ్రిమెట్లు నారీతి
మిక్కిచూచుచు సేనమీద లంఘించి 1497

తాటిఫలములరీతి తలలెల్ల రాల్చి
మాటి మాటికి పెచ్చి మనుజాశనులను 1498

పోక బద్దలరీతి బొక్క చాపైని
వీక శతాంగముల్ వీచివైచుచును 1499

గుత్తాలపీన్గుల గూర్చి దౌడలను
బిత్తుగా మెక్కుచు భీభత్సనర్ప 1500

చండముండులుగాంచి చాలకోపమున
చండాస్త్రములవేయ సరగనాకాళి 1501

ఖండితంబుగ నొక్క ఖడ్గంబుచేత
చండముండుల ధరాస్థలివైచి త్రొక్కి 1502

ఖండించె శీర్షముల్ గణుతింపసురలు
చండముండులనిట్లు చావనేయంగ 1503
చాముండయై యొప్పెజగతి నాకాళి
అ మహావిధగాంచి హతశేషులంత 1504
గుండెలు చెదరగ గుప్పలై కూలి
ఖండితంబుగ యుద్ధ కధనెఱిగించి 1505
ఘనమెంత వారిచే ఘనలేముగాన
చనెద మెచ్చటికైన చయ్యనననిన 1506

## రక్తబీజాసురుని యుద్ధమున దనుప్రకు

ఇలగూలి ఘంఘంపు యెల్లెట్లొ లేచి
తలచి చిత్రింబుగా తనగాధ లెల్ల 1507
ఇదికాలరూపమౌ నిలను సర్వంబు
అచిరకాలంబుచే నౌను క్షీణించు 1508
నని యెంచి రక్త బీజాసుడు జేరి
పనిపడి యొప్పించి పంపగా ననికి 1509
ఢక్కాది వాద్య యాడంఖరంబులను
దిక్కులెల్లగలంగ ధివ్యులదరంగ 1510
సైన్యాళి ధూళిచే సందర్భముల్ గలగ
సన్యస్త భీతుడై చని దేవిగాంచి 1511
భువిజంతు జాలముల్ జొనగగానెంచి
నవరసంబుల నెల్ల నలువసృష్టించె 1512
నందు శృంగారము యధికమౌచుండ
లందచూచెదరింక నవని నద్దాని 1513
అదియె సృష్టికి మూల మదియి రక్షణము
అదియె నాశత్వమౌ నదియె సర్వంబు 1514

గాన శృంగారమే గావలెనన్న
పూనిశుంభునిగోసు పోయపునీకేల ? 1515

అతడు దివ్యులపట్ల యంతకుండౌను
అతడునీ కౌను నీవతని కయ్యెదవు 1516

అననంబ కోపించి యనెనోరి ! దుష్ట !
మును నీవు పేర్కొన్న మూలతత్వముల 1517
కల నాశసంబునే గందురు మీరు
కలన నీకాయంబు ఖండింతునన్న 1518

అంత నారక్త బీజాసురుండదరి
చింతనిప్పులరీతి చెలగనేత్రములు 1519
పిల్లు సారించి యా వినువీధికంట
పెల్లుగా బాణముల్ బేర్చితిండ్రించ 1520
అంబ విల్లెక్కించి యార్పుటిల్లుచును
అంబకంబులు గుప్పి యవయవంబులను 1521

రూక్షాస్త్రములనేయ రుధిరబీజుండు
వక్షంబు బ్రిద్దలై వసుధగూలంగ 1522
కాలకేయాది రాక్షసు లెల్లనసమ
కాలులోయనవచ్చి కాళిపై నదరి 1523
అట్టహాసములతో నవనికంపింప
దట్టంబుగా బాణతతిచేత గుప్ప 1524
డాసియంబయు ధనుష్టం కారమొప్ప
జేసె దిగ్గజములు జెవుడు కానంగ 1525

నంతకాళియు రేగి యార్వగా ఘూన
ఘోంతరాశములెల్ల టోరునమ్రోసె 1526

అంబవాహనమైన హరి గర్జనమున
కంబురాసులుగూడ గలగె నాపైని 1527

దానవుల్ క్రోధవిస్తారులై బాణ
సోనలంగురియగా చుఱచుఱజూచి 1528

ఘోరాస్త్రముల నంబ కూల్చి యార్వంగ
ఘోరాకృతులవచ్చె కోట్లశక్తులిటు 1529

వరచక్రపాణియై వైష్ణవీశక్తి
కరశూలమునను శాంకరి యక్ష సూత్రి 1530

మునసు బ్రాహ్మీశక్తి మొనసి నిజశక్తి
తనర కౌమారి సుత్రామి వజ్రమున 1531

ఘోరనఖపాళిచేఁదారనరసింహి
మీఱి వారాహియా మేటి గదతోడ 1532

తగయామ్యి దండ హస్తముతోడ నింక
నగణితంబగు పాశహస్తయై వరుణి 1533

ఘన ఖడ్గపాణియై కౌబేరి మరియు
కనుపించె నైరుతి గదచేతబట్టి 1534

ఈ రీతిగానెల్ల హెచ్చి శక్తులుగ
మారణంబొనరించె మనుజాశనులను 1535

పెక్కురీతులవారు పేర్చి జన్యమున
నుక్కడించెను లోక ముఱ్ఱూతలూగె 1536

రక్తబీజుండంత రణమున కడరి
దిక్తటంబులుగూడ దిమ్మరబోవ 1537

సమరధాత్రినిబొల్చి పరగ బాణముల
నమితంబుగానేయ నంబ దునుమాడి 1538

ఖండించగా వానికాయమునుండి
దండిగారక్తమై ధారలు వార 1539

బిందు సంఖ్యలనట్టి భీషణులౌర
మ్రిందిన రాక్షసుల్ మహికోట్లుపుట్టి 1540

ధీరత్వమున యుద్ధదేశమున కడరి
క్రూరంబుగా ఘోర కూల్చగాదేవి 1541

ఎన్నిసారులు వారినెంతయుదునుమ
నెన్నిరక్త కణంబు నేలమిమై జాఱ 1542
అన్నిలక్షలకోట్లు లట్టి రాక్షసులు
లెన్నగాబుట్టి యాదేవిపై కడరి 1543

సురలునిశ్చేష్టులై చూడగా నంబ
కరము గోపించి దాఖండింప నెంచి 1544

చాముండి శక్తిలో సరగనిట్లనియె
నీమదాంధుని రక్త మిలజాఱకుండ 1545

ఘోరాకృతినిదాల్చి కుదర బస్వచును
ఏపుగా నీనోరు దెరచి రక్తంబు 1546
పీల్చుచుండుము వీని పీచమడంతు
పొల్చనే రణధాత్రి పోటుబాణముల 1547

ననకాళి ఘోరముగ యఖిలంబునంచు
తన నాలుకనుచాచి లనరగారక్త 1548
బీజు మాయారక్తబీజులను గూడ
నోట దా దునుమాడె నొక్కబాణమున 1549

## శుంభ నిశుంభులని కేతెంచుట

హతశేషులేగి యాహవవార్త దెలుప
క్షితి మూర్ఛబడిలేచి చిందువందొచు 155

నతికోపమున శుంభు డది సైపలేక
ఘృతయుక్త మౌవహ్నికీల తానగ 1551
తనమూలబలమెల్ల తనవెంటరాగ
అసురుని శుంభుడా యన్నవంటంగ 1552
చటులధ్వజాగ్ర సంచలిత వాయువున

పటుపటజీమూత పటలముల్ విచ్చ 1553
కమనీయ రథనేమి ఘట్టనల ఘూర్ణి
కమలాప్త బింబముఁ గప్పగా రణిత 1554
ఘంటానినాద సంఘట్టనల్ నింగి
నంటి దిక్కరులనే యవియ జేయంగ 1555
వేగభారము చేత విఱిగి శేషుండు
భోగంబులను వంప భూరిముసలముల 1556
పరిఘ పట్టిస ఖడ్గ ప్రాసగద పాశ
వరభిండివాల దివ్యాస్త్ర సంతతుల 1557
తెగనొప్పి భగవతి న్దాకి తీక్ష్ణముగ
జగములూగగ నట్టహాసంబొనర్చి 1558
అంబికాశినిగాంచి యనె నిట్లు పిరి
నందకంబుల నేసి యువని పాల్జేతు 1559
నీప్రంచుమని పీక నిర్దుముల్ బొంగ
దేవి వింటని గిటి తీవ్రాస్త్రములను 1560

వారినేయగదేవి వారును నేయ
దారుణరణమైన ధరదద్దరిల్లె 1561

సురికి యూతుంభుండు హుమ్మని పంట్లు
కొరికి వాహనమును గొట్టి గదతోడ 1562

నెదిరి, దేహము బెంచి ఎఱ్ఱనికనుల
గదిసి యంబయు వాని గదగూల నేసె 1563

వాడు దేవిని దాకి వరసాయకముల
నేడు తొమ్మిది వందలెన్నియో వేసి 1564

పెళ్లపెళ్లన దిట్టి పెనునిశాచరుల
నెల్ల జంపిన మిమ్ము నిలగూల్తు ననిన 1565

కల్లగాదిదినీకు గడియలో పెద్ద
పెళ్లి జేసెదనంచు పెల్లార్చిదేవి 1566

రంతు రండికమిమ్ము రణధాత్రి గూల్తు
ఖండితంబుగ నన్న గదనేయ నతఁడు 1567
అంతలోన నిశుంభుఁడా వాహనమును
పంతంబుతోనేయ భగభగ మండి 1568
దేవి గదతోనేయ దేవాసులకును
దేవికినపుడు నుత్తేజరణమందు 1569
దనుజసైన్యములు రణస్థలి నిండియుండె
కని కోపమున నగ్నికణములరాల్చి 1570
ఆనిశుంభుడు దేవి నంటిగద నేయ
మానకాతనిబట్టి మహినంట ద్రొక్కి 1571
కటికుండు మేషముంగా గరకర కోయు
వటువున నటచిత్రవధ సల్పదాని 1572
చూచి శుంభుండిట్లు చోద్యముగ నెంచి
నీచరాచర మెల్ల నెపగు కాలమున 1573
భ్రాతసచివులు సర్వబలగ మిట్లయ్యె
నేతీరుగాయింక నిలనుండ గలను 1574
దైవనిర్ణయమేరు తప్పించలేరు
దేవాదులనె నేను దివినుండి తఱిమి 1575
నెట్టినా కబలచే నాశినేరకట
ఇట్టి పరాభవం బెసగగానింక 1576
నా విరోధులుగూడ నన్ను నవ్వంగ
నీవసుంధరయందు నెట్లు జీవింతు 1577
జాతస్య మరణమౌ జగతి నిశ్చయము
క్ష్మాతలంబున లక్ష సంవత్సరములు 1578
బ్రతికినగాని యీ పాడుజీవులకు
గతిలేదు మరణంబుగాక వేరొకటి 1579
అటవిష్ణు లెందరో హరులెందరొక్కొ
నిజము సర్వము దైవ నిర్ణయంబౌను 1580

ఘనుడు కీర్తినిగోప గానవేనింక
నని యొనర్చెద జీవితాశను విడచి 1581

గెలుతునా నీ ధాత్రి కీర్తి గడింతు
కలనుగూలిన వీరగతిని గడింతు 1582

ననియద్రినిభమైన యరదంబునెక్కి
దనుజనాయకులెల్ల దనవెంటనంట 1583

దశదిశ దిక్తటప్పు దనరగా వేడి
లలితమైయొప్పుబులాకి నాసమున 1584

ఘనఘనత్కాంచనమౌ కాంచి జఘనమున
తనరు కౌశేయంబుదాల్చి గేహమున 1585

శోభితంబౌదాని చూడగా దేవి
యాభీలముగ శంఖమంత బూరించి 1586

ఆకృతి మునుని మోహపు బొమ్మయనగ
కోరి జగములకాంతి గూర్చు యొప్పనగ 15 7

అలపరంజ్యోతి మోహపు లీలయనగ
నిలచిన తొలిప్రాదినీదేవి యనగ 1588

రచితసుందర మహారాసియో యనగ
రుచిరార్కకోట్ల నద్రూపమే ననగ 1589

నీటైన పరకామినీ మోదమనగ
కోటిబ్రహ్మానంద కూటమియనగ 1590

పొసగెడి నపరంజి బొమ్మయే ననగ
మిసిమి గాంచిన సుధామీగడ యనగ 1591

చండ కోదండ ప్రచండత్వమొప్ప
నుండు భగవతిజూచి యుల్లమువీయంగ 1592

పంచబాణుని పుష్పబాణహతుడౌచు
నెంచి రాత్రించరుండిటు పల్కెనప్పుడు 1593

ఎంతటిజాణవె ఇంతిరో నీవు
దంతి గమనలకిద్ది ధర్మమే చెప్పుమ 1594

నీరూపమేది యానిశ్చయంబేది
సారసాక్షిరొ యింక వాలుబాణములు 1595
కనుబొమల్ విండ్లసంగతిగ భావములు
ఘనమంత్రములు లక్ష్యకము పూరుషుండు 1596
తన మనోరథమె రథంబుగానొప్పు
కనయంగరాగమె కవిత సన్నాహ 1597
గరిమ వాగ్రుచి మించి గ్రాలభేరులుగ
మరలజ్జమే దివ్యమవి భూషణముగ 1598
ననదివ్యచూడ్కుల సంశయంబుగను
ఘనవిడంబన మన్యకరశస్త్రమట్లు 1599
యీ విధపూరుషునితో యుద్ధమొనరింప
ఆ విరళానందమౌ నవియెల్లమాని 1600
గడవట్టి యీరీతి గాంక్రింప నౌనె
మదమెక్కి పురుషుం మార్కొననౌనె 1601
కోపారుణం బట్లు గూర్పగానౌనె
తీ॰ శరాది శస్త్రంబు లేయగానౌనె 1602
ఘోరవాహనమందు మూర్ఛిల్లనౌనె
[illegible]యీరీతిగా మించగా నౌనె 1603
నీకు సంగరమందు యిచ్ఛయేయున్న
కానిరూపముగల్గి కనుగొనువారి 1604
దేహ్యంబుగారాధి యింతినిన్నాంచి
సహ్యంబెనాకింక జన్యస్థలమున 1605
కర్కశంబౌ నంబకముల నిగ్గూల్చ
తక్క నేటికి యట్టిదారి విడుమన్న 1606
బిగద[illegible]నవిన్ని మోషండాలయిట్లు
నాగర[illegible]టబనాద బోలునా నీకు 1607
ఐననే[illegible]యె నీకంత్యకాలంబు
కామన్న నీతోన కలనత్సమేల 1608

వీక నన్నెదిరించి వీలుగాకున్న
నీకాళి నెదిరించు మెంతయునీవ 1809

సంగ కాళియు ధట్టినట్టె బిగియించి
పొంగుచు గదదాల్చి బొబ్బరిల్లంగ 1810

సంచలనమాయె నీ సర్వలోకంబు
పంచభూతములును పరగె దిగ్భ్రమల 1811

నత్తరి యాకాళి యతనిరథంబు
నుత్తుమురుగజేసి తురగాళిజంపి 1812

దారకునిధరగూల్చి దద్దరిల్లంగ
మీరి శుంభుడు గూడ మేటిగదబట్టి 1813

చండిదాకొ్కన శుంభు చండులుద్దండ
చండధారులనంగ దాకి పోరంగ 1814

ఘోరఘోరగ గదల్ పొడిపొడియైన
వారకచాముండి వాలుముంబలక 1815

దాల్చి ఖండించగా దక్షిణ భుజంబు
వొల్చి శుంభుండొంటిభుజమునదండ 1816

మేరు దానింద్రొక్కి హెచ్చియాశుంభు
కాయంబుదుత్తుమురు గావించెనంత 1817

ఆవేళలోకంబు లావంద మొందె
దేవీత్రయముపైని దేవతల్ పుష్ప 1818

వర్షముల్ గురియించ పరసిద్ధ సాధ్య
హర్షనాదములొప్పె నద్భుతంబుగను 1819

పాడగంధర్వులప్సరస లాడంగ
వేడి రద్దేవిని వేదయున్ మునులు 1820

ఇలను దీనివి వ్రాయ నెంతయు జదువ
కలుగు శత్రుజయంబు ఘనతరైశ్వర్య 1821

సమితి గల్గును వొప్పు జగతిలోనింక
సమయదేవీలోకయావాస శుభము 1822

## శివుడు తపం బొనర్చుట

అనగసూతునిజూచి యనిరిట్లు మునులు
అనఘ నీవాక్యంబు లమృతంబు మాకు 1623

అత్యుగ్రతపమట్లు హరునెంచి సేయు
కాత్యాయనినిగూర్చి కరుణతోమాకు 1624

దెలుపగోరెదమన్న దేవిని దలచి
పలికెనిట్లని సూతపౌరాణికుండు 1625

మునులార వినుడింక మొదలనుండియును
వినె నింతవనుక నాశక్తి రూపంబు 1626

మహితగా నికనా యుమా శంకరులకు
గుహుడౌచు పుత్రుడై కోర్కెజన్మించు 1627

కడువిచిత్రమైన యాగాథతెల్పెదను
మరియు నావలనెల్ల-మంత్రించినట్లు 1628

ఆకీర్తి గౌరీమహాఖ్య గిరియందు
కోరి శర్వుండు మది గూర్చి ఘోరముగ 1629

నిశ్చలచిత్తమై నిలచి లోకములు
ఆశ్చర్యమందగా నంబ దపియించు 1630

అంత నాసనకాదులైన సంయములు
ఎంతయు ధాత్రాజ్ఞ నీసరబుచ్చి 1631

జగముకార్యముమాని చాల విరాగు
లగుచు నిత్యానంద లభవు రీశు 1632

కైలాసమందు భోగప్రదేశమున
జాలన్యగ్రోధ వృక్షచ్ఛాయయందు 1633

నమరించి దివ్యపద్మాసన స్థితిని
కమనీయమగు మాల కరమునదాల్చి 1634

దాని మలపెడికీర్తి త్రాచు గోముఖము
పూని సర్వవిలాస భూషలొప్పార 1635

దక్షిణాస్యుండౌచు దనరి చిన్ముద్ర
దక్షిణామూర్తియౌ ధన్యునిజేరి 1636
నతిజేసి నుతిసల్పి నాగభూషణుని
శ్రుతిరహస్యము మాకు చెప్పవేయనగ 1637
కటుణించి సర్వసుజ్ఞానం బొసంగి
విశివియౌ నిగమార్థ వివిధ గోప్యముల 1638
ప్రణవవాచ్యార్థ సత్ఫలలక్ష్యములను
అనువైన నాయారహస్యముల్ దెలిపి 1639
బ్రహ్మపుత్రులతోడ పరమ శివుండు
బ్రహ్మచర్య పరీక్షపద్ధతిం గాంచి 1640
ధ్యానయోగ సమాధి తత్పరుం డౌచు
సానకలోకమున్ మరచియుండంగ 1641
శివదర్శనాయత్త చిత్త దానౌచు
శివ ఘోరతపమందు జేరి యుండంగ 1642
శివశక్తికూటమీక్షితిని లేకునికి
అవతరిల్లెను పాపమనెడి భూతంబు 1643
యజ్ఞయాగాదు లేయవని లేకునికి
అజ్ఞానమెల్ల యందావరించంగ 1644
ఈ రీతిపాపంబు హెచ్చగానపుడు
సారమెల్ల నశించె జగముపై నట్టి 1645
పీడాపహరణకై భీముండునక్క
లేడన్యశరణుండు లెన్నపరికించ 1646
ననియెంచి దివ్యులాయ్యభవుని కొఱకు
ఘనమైనమూకలై కైలాసమరుగ 1647
అసువుగాశైలాదియట వారినాచి
అనువుగాదని వారి నవలకు పనుప 1648
సేయజాలకనోడి శీఘ్రుం దెవారు
గాయత్రి నగరిలో గల పీఠమందు 1649

## దేవతలు బ్రహ్మలోకమున కరుగుట

మునిజనావృతుఁడౌచు ముదముతో నున్న
వనజాసనుని జేరి వారెల్ల మ్రొక్కి 1650
స్తోత్రలంచెల్ల నీకారణంబౌట
మాతవయ్యెదవల్లె మహాతవయ్యెదవు 1651
ధాత్రివయ్యెద వల్లె ప్రభువవయ్యెదవు
ధాతవయ్యెద వల్లె పాత్రివయ్యెదవు 1652
నతులొనర్చెదమన్న నజుఁడంతనదితి
సుతుల నీక్షించి యా చొప్పెల్లననుగ 1653
అదితి సంతసమెల్ల రాపురు మనగ
గుణగణ లాలవా గురుభీష్టులనిమె 1654
శతధృతి వినుము నిర్జరుల చారిత్రి
మతిదుఃఖ పరము మహాహీనమయ్యె 1655
అప్పర : కశ్యపునిగర్భాన జన్మించి
పుత్రునిమాగ మెసర్చి బహుతేజమంది 1656
వారపమ్యం డనే ఖంతదైత్యుంపు
తారకాసుర మృగేంద్రు ముఖ్యులైనట్టి 1657
యనుజాలంగూడి యాహవ పటుండౌచు
ఘనదైత్యరాజావళి గదియగా హెచ్చి 1658
ధూమకేతుప్రీతి దోచి లోకముల
కామయంబై బాధలంద జేసెడిని 1659
తండ్రి : యికేమందు ధరనెల్ల వారు
గాంక్రించి తిలకింప గడగడలాడు 1660
ఆది తేయులు వారి యాజ్ఞలమౌళి
నాది జీవములతో నొప్పుచున్నారు 1661
బలివుండే వారి ప్రాంగణంబందు
కలయంపి జల్లగా కలిగె నష్టాప్చి 1662

పాకకార్య మొనర్చి వానిదర్బారు
లోకదివ్వె వహించి లోబడెయముడు 1663

వైద్యుడై యాదోగ్రహివాసంబునందు
వైద్యంబొనర్పగా వలసె నేడకట 1664

రాత్రిం చరుండింక రాత్రిం బవల్ప
వేత్రహస్తుండౌచు విలసిల్లవలసె 1665

యాదసాంపతి వాని యాజ్ఞలకొదిగి
ఆదట కష్టంబు లందుచున్నాడు 1666

మాతరిశ్వుండు సమ్మార్జనంబట్టి
అతతాయి గృహంబునందు సల్పెడిని 1667

యక్షేశ్వరుడు వాని యంతఃపురాన
ఎక్షిక భటుడౌచు రణబాధనుండె 1668

మరియు నీశాను డామనుజాశి కొల్వ
పరికరంబులమర్చి బ్రిదుకగావలసె 1669

సప్తాశ్వదనిశంబు సంకుచితమైన
దీప్తుడై యుండు నా దేవారి వీట 1670

జలజారి రెండు పక్షంబుల నచట
నిలచి వెన్నెలగాయు నిశ్చయంబుగను 1671

వసురుద్రగంధర్వ వరసిద్ధ సాధ్య
విసరముల్ సేవగావింతు రాతనికి 1672

సురజాతు లెల్లరా సురవైరి కొదిగి
అరచేతులందుంతు రసువుల నెపుడు 1673

వేయేలనీరీతి విచ్చల విడిగ
వేయుపై నెన్మిదై వెలయు బ్రహ్మాండ 1674

ముల కధినాథుడై మోదమందుచును
పలు విధంములబాధ బఱుపుచున్నాడ 1675

గాన నాదుష్టులం గడతేర్చగల్గు
వాని నొక్కనిజూపు వాణీశయనిన 1676

పాకశాసనుడిట్లు పల్కె దీనుడఖు
ఓకమలజా ! యేను నొక్కింత వినుతు 1677

తారకుం డను శస్త్రధారియై యెపుడు
మారణం బొనరించు మాయలమారి 1678

వానియనుజుడు సింహ వక్త్రుండు గూడ
వానికి తుల్యుడౌ పాపకార్యముల 1679

మా యమాయకులను మాదుశక్తులను
ఆ యయ్యలను జేరనైనను లేక 1680

వ్యర్థమైపోవ, మాయందింక, వారి
స్పర్థ మిక్కుటమయ్యె సంతాపమొదవె 1681

ఆబిడ్డలతోడ నసురుల గొల్వ
జాలమీ విధికన్న చావు మేలనిన 1682

ఒక్కింతనిల్చి నిట్టూర్పు నిగిడించి
యక్కమలాసనుం డమరులతోడ 1683

ఒకబడ పాదముల్ దైత్యారిగూర్చి
నడి వడిగా నేగె వైకుంఠమునకు 1684

## నారాయణమూర్తి సహితులై దేవతలు శక్తిని ప్రార్థించుట

నారాయణునిజేరి నలువాదు లెల్ల
ఘోరున దుఃఖించి పుండరీకాక్ష 1685

లోకంబు దుష్టకల్లోలమైయుండ
నీకరణి నిట్లుండ నెట్లు మనసాయె 1686

బ్రతుకు వారమె శూరపద్మాసనాది
తతి దౌష్ట్యమున వారి ధాత్రిపై గూల్చ 1687

గతిజూడవె యన్న కంజాక్షుడపుడు
మతులువోయెను మీకు మఘవాదు లార 1688

ఆహారభీరుండ నౌచున్న నేను
ఆశలన్నియుడీపి యతిరహస్యముగ 1689

మనుచుంటి హాని నామమునైన వినక
అనుమానమేల నయ్యాది నాకుగాను 1690
మనెల నాచిచ్ఛక్తి మనుచునేగాని
మనుజుల ధరిగూల్చు దారియికలేదు 1691
అని మాధవునిగూర్చి యమభటులు మసులు
వినయంబుగా శక్తి వేడిరీరీతి 1692
నీవు తల్లివి నీవె నిఖిలసాక్షివిను
నీవె నాదబ్రహ్మ నీవె కాలంబు 1693
నీవె సమూర్తంబు నీవె సర్వాత్మ
నీవె వేదార్థంబు నీవె మోక్షంబు 1694
నిన్ను కానిది లేదు నిఖిలలోకముల
నన్నుకాచుంటనే ఇంద్రాదియొకడు 1695
వశ్యము బ్రహ్మకు ఘనమాయ యందు
దృశ్యమై భవపరా దృష్టంబు నంది 1696
గర్వించిమమ్మేచ గడగుటేగాక
నుర్వి సత్పురుషులనొంచి వేదార్థ 1697
కార్యముల్ మాపె నాకతినాత్మనింక
నిర్వాణ మందింప నీవింకబూన 1698
కున్నమాకికదిక్కు యొండులేదన్న
విన్నపం బాలించి వినువీధినుండి 1699
నూర్యుడై లోకముల గుందగాజేయు
ఘోరు బంధులతోడ శోధించి చంపు 1700
పనికి బూనెదనేను వసుధపై నాదు
ఘనమైన తేజమౌ గౌరి ఘోరముగ 1701
హరునిగూర్చి తపించనతడు నిర్మోహ 1702
పరతనున్నాడంత పర్యంత మెల్ల
నీచరాచరమింక హీనించు గాన 1703
యోచించి మీరెట్టి యుక్తిచేనైన

శివశక్తి చాటమున్ జెందగా జేయ
నవతరింతునుగాక యంత వార్లకు 1704

అనగాంచి దేవితో నడుగ వారెల్ల
వినిదేవి వారికా విధమిట్లు దెలిపె 1705

నేరికైనను నెప్పుడే ఫలంబైన
కారణంబే లేక కలుగదు ధాత్రి 1706

వినుడు మాకిట్లైన విధము తెల్లముగ
ఘనుడు శంభునివీడి గర్వించి మున్ను 1707

దక్షుడే పక్షుండు గర్వించియజ్ఞ
దీక్షలో మీరెల్ల తెరచి హీనముగ 1708

పాలుగొన్నారట్టి పాటు మీకౌనె
ఆలీల సతి దగ్ధమాయె నావేళ 1709

తనను భర్తను వీడి తపియించుచుండె
వనిత యిప్పటికిని వనములయందు 1710

ఆపాప ఫలమెల్ల నవనిలో నిపుడు
ఈ పాపులైపుట్టి హెచ్చిరీరీతి 1711

గానయిట్లుండ మీకష్టముల్ పోవు
పూని మీరొక యుక్తి బొందుడిక పైని 1712

ఏతీరుగానైన నీరు యత్నించి
భూతేశు పార్వతుల బొందగాజేయ 1713

గుహుడనై జన్మించి కోరి వారలకు
అహిత రాక్షసకోటి నంత మొందింతు 1714

గాన మీరెల్లరా కార్యంబు కొరకు
పూనుడీయికనంచు బోయెచిచ్ఛక్తి 1715

## దేవతలు మన్మథుని శివుని వద్దకు అనుపుట

దేవతల్ సభ గూడ దిలకించి వారి
కీ విధంబున పల్కె నిందిరావరుడు 1716

వింటిరేకద దేవి విమల వాక్యములు
తంటలేదిక పైని దనుజుల వలన 1717
ఆపెబల్కినరీతి యభవు పార్వతుల
కాప్తరస్తులజేయ గల్గు మంగళము 1718
దాని నొనర్ప గందర్పుంజుపేడ్క
పూనజుల్కన గానె పొసగు కార్యంబు 1719
అన నంగజుని వారలందరు దలచ
ఘన మార్గమునవచ్చె కార్ముకుండగుచు 1720
ఆ రతియును వసంతాదులగూడి
వారికెల్లను మ్రొక్కి వైకుంఠుగాంచి 1721
పీతాంబరా నన్ను బిలువగా నేమి
హేతువెయ్యెది తెల్పుమిది యెట్టిదైన 1722
నిర్వహించెద నొక్కనిముసాన ననగ
గీర్వాణ సభయందు కేశవుండనియె 1723
మదనా పరీక్షించ మహి నీకు సములు
సదయులు లేరింక జగముపైనెట్టి 1724
పనులైననగు నీకు పరికించ నితర
ఘనులెల్లరీ సృష్టి కార్యంబునందు 1725
నిజముగా స్త్రీపురుష నిర్మలప్రేమ
సృజియించు ధాతవై చెలగు నీసములె 1726
నీవు జీవులమీద నిర్మాతవౌట
భావభవుడనంగ బరగియున్నావు 1727
నేడీ చరాచర నిఖిలావనికిని
చూడ తలిదండ్రులై శోభిల్లునట్టి 1728
తేజశివశివులట్లు తికమకలైన
నీజగంబులబాధ హెచ్చెనికనీవు 1729
వేగవారిని గూర్చ విరివిగా శుభము
సాగునింక సుమాళి శరవృష్టిచేత 1730

నాకుస్థితిమన్న యభవుని మార్చి
ఆవశ్యకంబుగా నంబతోజేర్చు 1731

మన భావజుండనిమె నబ్బోయిదేటి
కని శంభుసేయగాబడునె మాదనవు 1732

వనితా యిదేటికో జనియించె నీకు
మనలేను నేనట్టి మహాని కోపాగ్ని 1733

గాన నన్పొమ్ము దక్షాటికమేపార
బూనలేనిక నిట్టి భూరి కార్యంబు 1734

అనగ పితామహుం డంగజుజూచి
వినుమానమేల నయ్యాది లోకరక్ష 1735

రాప్తంబుగాని నక్కానికంబుదోత
నాక్షైప్రయుంటు నిన్నెరయదేయనగ 1736

అందరొక పిత్తు ఆయభవుడొకయొత్తు
ప్రబంధింపగలకంఠిమంటి యాతనికి 1737

ప్రమంద నాకదినాడు యుర్విన్ప్రాణ
కంటకంబది ఎవాను గాన నేనోప 1738

వని యూరకున్న నాయంగజు జూచి
ఘన కోపమున పల్కె కమల గర్భుండు 1739

కతనాత్మ దేవతా కార్యంబు కొఱకు
శతు బున్ననేమగు వావనేమౌను 1740

మున్నాదకేవి నమ్మని నింద్రుడడుగ
వెన్నైముకనీయదో వెడమాటలేల 1741

నన కేశవుం తప్పు డనియె నోమదన!
మనబోటివానికి మాటతగునటర 1742

తగమిరా తగదింక ధాత్రి శివశక్తి
లగణితంబుగ గూడనౌను మంగళము 1743

అన పరమేష్ఠి యూ యంగజునిగాంచి
కనలి శాపంబిత్తు కందర్పయనిన 1744

విని రతిదేవి తన విభునకిట్లనియె
మనలేము మనమింతమంది బాధించ 1745
బ్రతికి శాపములచే బాధపడుకన్న
నతినిచేతనె గూలి హాయిగా కీర్తి 1746
పరసెదమని పల్కనా రతింగాంచి
కరము వేసట నంది కందర్పుడనియె 1747
కాగలకార్యముల్ గాకపోవెప్పుడు
ఏగతి కల్గునో యెవరెఱుంగుదురు 1748
తల్లి గర్భంబునం దగిలిననాడె
ఎల్లభవిష్యంబు నింపులలాట 1749
ఫలకమందున మూడు పంక్తులపెట్టి
అల పరమాత్మయే యఖిలజీవులకు 1750
ఓడలు బండ్లపై నొకవేళ రాగ
కూడివచ్చును బండ్లుగూడ యోడలను 1751
గాన సందియమేల కానున్నదెట్లొ
మానదంచని యెంచి మన్మధుండొప్ప 1752
పరమేష్ఠి మఘవుండు బద్మనాభుండు
వరుణాగ్ని సమవర్తి వాయ్వాదులైన 1753
దేవతాదులు మెచ్చి దివ్య మణిహార
భావ్రజేయగ మునుల్ బందురాశీస్సు 1754
లియ్య నానభవార లెల్లరును మెచ్చ
నయ్యారే యమరాంగనాదులాపంచ 1755
శయనకారతురెత్త జలజనాభుండు
పరమేష్ఠిలోనైన బ్రహ్మలందరును 1756
పచ్చవిల్తున కంత పట్టమును గట్టి
మెచ్చ నాకసమందు మేళముల్ హెచ్చ 1757
నాలదా సభవారి కంజలి యొనర్చి
చాలరణమున కోటీర పటీర 1758

పంక శోభిత గాత్రి భానురుండై కె
లంకుల బుధసుతుల్ లాజలం జల్ల 1759
కీరరభమున నొప్పి కికపిక బిహ్వా
కాహకాస్వన భేరి శంఖకాహళుల 1760
చెఱకునింట వనాటు చిత్రితరకసుం
వర మధూక గుణము పంకేజబాణ 1761
యుటుదౌచు శుభరూప మొప్పగా మమమ
రతితోడ నేగెనా రజితాద్రి కపుడు 1762

## మన్మథుని కైలాసయాత్ర

గమిత యక్షాదిత్య గంధర్వ రుద్ర
మరి సిద్ధసాధ్య సమ్మాన దీపితము 1763
మందార మల్లికా మాధవీ జాజి
చందనాంచిత సింధు సాల పున్నాగ 1764
వర వృక్షతతులలోపలినికుంజముల
మెరయ మదాంగనల్ మిరుమిట్లు గొలుప 1765
సదయలో శ్రీరుద్ర సతుల సంగీత
పదవిచే జాలిగా బరగి పీయూష 1766
సారప్రవాహ సంసక్తమై వటులు
భూరి యుపలస్థితుల బొం ఎ సానువులు 1767
చరిత సింహకిశోర శార్దూల ఋక్ష
హరిణకీశలులాయ హస్తి గున్నలును 1768
కమలకల్హార సౌగంధ విభ్రాజి
విమల పీయూష వాపీమనోహరము 1769
నైన కైలాసంబు నాతడు గాంచి
తా ధర పైసాగి తద్దయు మ్రొక్కి 1770
వినయంబుగా బట్టి విరికరం బొకటి
గుణమున గూర్చి యా గుడికట్టు దివ్య 1771

రసపసం గూర్పగా రతినాధుడేయ
సనము యుడసంగ నందుశైలాది 1772
వసియుంచగా వాని వరయాజ్ఞ నేమొ
పసచెడి ధాత్రిపై పడునంత మరుడు 1773
చలనరాహిత్యమై శైలభాగమున
గల చరాచరముల గాంచి యాశ్చర్య 1774
తరుడౌచు ఋషిమ నొప్పి కారణం బేమి
అరెరట్టబడె శరం బద్భుతరీతి 1775
పనియెంచి యొకట శైలాదినిగాంచి
లిసుపు ఘర్మంబున తడబడకాళ్ల 1776
పనిమాని శైలాది పరిక్కకు బోయి
గుణము సెంతటడించి కోర్కెనతియించి 1777
మరియు కేల్మోగిచె యామహనీయుగాంచి
సురల బుత్తెంచ వచ్చుట విన్నవించి 1778
ఈశ్వరాపరనందికేశ్వరా నేడు
విశ్వమెల్లను ఘోర విధ పీడనమున 1779
నష్టమయ్యె నతండు నాకులం దరిమి
అష్టోత్తర సహస్రమైన లోకముల 1780
కధినాధుడై యొప్పె నదిగాక వేద
విధులను బోకార్చె వీకతో వాని 1781
బాధలం గుంది యా పద్మనాభాది
సాధువుల్ చిచ్ఛక్తి జాల ప్రార్థించ
నాపె యా తుహినాద్రి యందొప్పగౌరి
నా పగిది రజితాద్రి యందున్న భవుని 1783
కలుపగా నవ్వారి ఘన తేజమందు
నిలచి జన్మింతునే నిల వారికొరకు 1784
అని తెల్పె గాన నే నందుకేతెంచి
ఘనినెల్ల నింక విస్పష్ట పరచితిని 1785

ననగ నాశైలాది యాతని గరుణ
కనుగొని యోచించి కానిమ్మటంచు 1786
పలికె మదనా ! నీవు పశ్చిమద్వార
కలన నెల్లగబోయి కలవరపడక 1787
సురహిత కార్యంబు జూడు సేయంగ
మరి శంకరుని భక్తి మార్గమున్ వినకు 1788
మని పల్కి విడువగా నపర మార్గమున
చని కీరరథముపై చదలున నిలచి 1789

## కామదహనము

సనకాది సేవ్యుడును స్ఫటిక సంకాశు
డును నాగభూషణుండును నారసింహవ్యా 1790
ఘ్రోత్తరీయుడును జగతి విశ్వహిణ
నిర్మలాంచితుడును నిశ్చలుడు యోగ 1791
వాసితుండును కోటి వారి జాస్త్రాది
వాసితుండును జగత్స్రష్ట భదుగ్రిందు 1792
నియతుడై యొప్పారు నిటలాక్షుగాంచి
భయముచే నాశ్చర్య పస తోడమనము 179
సంచలించ శరాలి జగతిపై జార
పంచ విల్లును పెట్టి వాడనం తేజ 1794
హీనుడై యుండ నాయింతి దనుగాంచి
మానకీతనికబ్బె మరి భయంబనుచు 179
ననుకొనుచుండగా నదిరె వామాక్షి
ఘనకార్ముకమునెత్తి కరముచే మరల 1796
మండలీ కృతచాప మండితుండౌచు
నుండ దేవతలెల్ల సప్పరము నందు 1797
దీవించగా నస్త్ర తేజంబు వలన
దేవదేవుని మన స్థిమితం బొకింత 1798

చెడిన, కీర్తిగంటనా చిత్తజు గాంచి
వెడలి సూక్ష్మాగ్నియా వెడవింటివాని 1799
భస్మంబొనర్చగా పత్నియటగాంచి
విస్మయ చిత్తయై పృథ్విపై గూలె 1800
నాయగ్నిరథ రథ్యమైన గుసుమేషు
ఆయుష్షు దొలగించ హడలి దేవతలు 1801

## దేవతలు శివుని ప్రార్థించుట

పెక్కురీతులనిట్లు వినుతించి
ముక్కంటి కటనుండి మ్రొక్కిరట్లనిరి 1802
ఈ చరాచరమెల్ల నెవనియందెనగు
నా చిన్మయుండు మా కగునింక దిక్కు 1803
అట్టి యేకాకి నిత్యానందుడైన
గట్టువిల్లున కిదే ఘననమస్కృతులు 1804
దుష్టరాక్షస భయాతురులమౌ మాకు
కష్టముల్ దీర్చవే కామారి యన్న 1805
నాలించి శైలాది నప్పుడే బిలిచి
శూలి వారెవ్వరో చూడు మంచనిన 1806
అనియె బ్రహ్మేంద్రులైన దేవతలు
దనుజపీడితులౌచు తమరక్షగోరి 1807
చనుదెంచి నారన్న శంభుండు వారి
గొని తెమ్మనగ నంత గొనితెచ్చి శంభు 1808
సన్నిధిని నిలువగా శంభుడా సురల
సన్నుతుల్ గొని వారి సరగ బీఠముల 1809
నిలిపి మీ కోర్కెలన్నియు దెల్పుడనగ
నల నిర్జరులు పల్కి రభవునిగాంచి 1810
కలసి పార్వతి తోడ ఘనుని సుపుత్రి
కలిగించి మమ్ము రక్షణ సల్పుమనిరి 1811

ఇక్కరణి నీగాథ ఇట్లొప్పుచుండ
సక్రాంతు నర్ధాంగి యట మూర్ఛదేరి 1812
హా కాంతుడా చెల్లె ననుకొని నంత
నేకరణి జీవింతు నికనేమి దిక్కు 1813
కల్పాంతమై తోచె గాదె యీవేళ
నిల్పుదెట్టుల ప్రాణ సచయ మీధాత్రి 1814
హా ! నిన్ను బాయగా నవనిలో నాకు
ప్రాణనాయక వేరు బంధువుల్లరె 1815
యొక్కతెం దిగనాడి యుర్వి కఠినముగ
నెక్కడకు బోతివో యే యింతి గూడ 1816
పిలచినావో యిద్ది ధర్మమా చెప్పుము
సలిపినానేమొ యిచ్చకు కేళియందు 1817
కోప మొదవగ నీకు కుధర నేనెంత
పాపం బొనర్చితినో పతితిని గాన 1818
క్షమియింపకయెయిట్లు శంభుని వలన
విమతుండవైతివె విధియెంత వ్రాసె 1819
నీరీతి నీప్రాణ మెంతయు దీయ
దారుణ సురలెట్లు దాపురంబైరి 1820
పరమేష్ఠి మనకొంపపై చిచ్చునెట్లు
బరపె శ్రీహరి యెంత పాపాత్ముడయ్యె 1821
ననుచు శిరోజంబు లవనిపై జార
తనుపు ధూళిని దోగ తనర ఘర్మంబు 1822
రొమ్ముబ్రిద్దలు గాగ రోదనధ్వనుల
నమ్మహా కైలాస మార్భటిల్లంగ 1823
ఎలుగెత్తి శంకరా ! ఈశా ! యటంచు
కలతప్పలను పైచి కావవా తండ్రి 1824
కక్ష యేటికి నీకు కాశ్యపి నొంటి
పక్షి నైతిని ప్రాణ భర్త నెడబాసి 1825

అనుదుఃఖ మాలించి హరుడు నందీశు
గనిపల్కె వినవచ్చె కల్కి ఏడ్చెచట 1826
అతడిట్లు పల్కె దేవాదు లెల్లరును
గతిలేక మీ కొరకు కందర్పు ననుప 1827
కేరపించెనటంచు కీర్తిగంటి మంట
మీరు వానినిగాల్చ మితిలేని దుఃఖ 1828
పరిభవంబున వానిపడతి యేడ్చెడిని
పరియాపె గావరే మహదేవయనుచు 1829
అచ్చాన నగపడునట్లుగా జేయ
హెచ్చిన దుఃఖయై యిలగూలబడిన 1830
మదను కాంతనుజూచి మదనసంహరుడు
సదయుడై యోరతీ సాధుశీవిలను 1831
ఘన పతివ్రిత వౌట కంతుండు నీకు
కనుపించు లీలగా కంతునితోడ 1832
మను మోదమున నంచు మదకాంత ననిపి
సనకాదులనుగాంచి శంకరుండనియె 1833
ఘనులార దేవతా కార్యార్థి నౌదు
చనుడు మీరికనన్న సర్వజ్ఞు కెఱిగి 1834
సనకాదులేగగా శంకరుండంత
తనమది పార్వతిందలచి యొంటరిగ 1835
మరచి సర్వస్వమును మందార వనిని
ధరణిపై మరివార్లి తపియించి తుదకు 1836

## శివుని వృద్ధవేషము

మేనుచాపునచాయ మించగా శుల్ప
జానూరుపుల హస్త సమితిపై వ్రాళ్ళ 1837
వలె బలుచిక్కులంబడిన రాలు
చలన కాష్ఠము భాతి శాంబరీదేహ 1838

కంకాళమున ముళ్లు గలియగా వంగి
ఇంక సింఘాణంబు హెచ్చగా నాస 1839

వెలి బొమల్ మరి బోసి వెడద మోమొప్ప
కల శిరః కంపంబు కఠినమౌ ఘూర్తి 1840

యవరి యుయ్యేలలూగునట్టి వస్త్రియును
కవల చన్గవ బూది కట్లతో ముఖము 1841

చెవులు జారగ పెద్ద చీగిరలందు
తివు కుండలములు తిపిరి దౌతలును 1842

గలుగ చేతిని పెద్ద కట్టెను బట్టి
యలచు దాతవు నొప్పులము గుంటుచును 1843

గూని మెతనును పెద్దగుబ్బిల్లును కలిగి
జైన తనసిగ పేర్లు జడల బిద్రాక్ష 1844

నముల జిక్కులు పట్ట జన్నిదంబులను
వమన జేయుచు మోముపై జేతినిడుచు 1845

వదులైన సంగోచి పావనాండముల
గుదియించి వేదముల్ గొణుగుచు వెడలి 1846

ముసిముసి నవ్వుల ముఖమెత్తి కనుచు
వెనగౌరి తపియించు విడిపట్టుజేర 1847

గాంచి చెలులనుగూడి గౌరి తోడ్తెచ్చి
యంచిత భక్తితో నర్ఘ్యపాద్యములు 1848

చెలగ దివ్యాసనా సీనుగా జేసి
చెలులతో వృంతాళి చేత విసరుచును 1849

మృదుల వాక్యములాడు మేన కాత్మజను
ముదుసలి విప్రుండు మోమెత్తిచూచి 1850

పడతిరో నీకిచట భద్రిమా యెట్టి
తడబాటులేక నీ తపమొప్పుచున్నె 1851

దివ్యోదకంబులును దిపురనే యిచట
అవ్యయానందంబు నందుచున్నావె 1852
సుకుమారి నాకునిజ జూడ నీతపము
నకు గారణంబౌను నాథుని కోర్కె 1853
నాదోచెనన సిగ్గు గావించ గౌరి
పాదముల్ వెనకాడ పశుపతిం దలచి 1854
చకితు లౌచును నా జయవసంతాది
నికటంపు చెలులతో నింకుమోదమున 1855
కనుసంజ్ఞ దెల్పనా కాంతలా వృద్ధు
గని పల్కిరిట్లు మా కథలెల్ల వినుము 1856
దాతో యనుచు వృద్ధ తాపసిందిలిచి
మాతన్వి మాచెలియ హిమవంతు తనయ 1857
శైశవంబున తండ్రి సదనంబు నందు
ఈశు పురాణంబు లెంతయో వినుచు 1858
శివుడె లోకాధారి చిన్మయమూర్తి
భవుడు పూజ్యుడు కాలుపాలి కాలుడును 1859
అనుచు నాతనిదక్క యన్యుని గోర
నని దీక్షబట్టి యాయమ్మ శివమంత్ర 1860
ముల జపించుచు గేలు మోడ్చుచు శివుని
దలచుచు నతనిపై దగిలిన మదిని 1861
నిదురబోవ దొకప్డు నిద్రబోయినను
అదరి లేచును శంభు నాత్మలో దలచి 1862
చలిత గుల్మ లతాది సంఘముల గాంచి
తలచి శంకరుడంచు దా పర్వులెత్తు 1863
కని శూలి గాడంచు కలవర మందు
వినుము తాతా యింక వేయునేమిటికి 1864

గాన నీవె ముఖంబు గని దెల్పుమాకు
పూని యాహరుడీపె బొందునో లేవొ 1865

అన నవ్వి వృద్ధుడా యద్రిజనుగాంచి
విను నిశ్చయములౌనె వీరి వాక్యములు 1866

అనిన నాపెయు నిశ్చయంబులె ననుచు
ఘన నన్ను శివుడింక గైకొనగజేయు 1867

మనగాంచి తలయూచి యౌరా యిదేమి
కనవిన కష్టమౌ ఖండ పరశుండు 1868

లోకనిందితుడును లోభి భూతముల
మూకలె పొత్తుగా ముష్టెత్తు కొనును 1869

కనటు చర్మము గట్టు కకపాల బట్టు
భసితంబు బూయు సర్పములను దాచు 1870

పత్తెై బట్టును పూను పునుక పూసలును
మిట్టిపై వసియించు మింగుపో విసము 1871

హరి చర్మమున నొప్పు నాటోతు నెక్క
మరి శ్మశానంబందు మసలు నిత్యంబు 1872

అట్టి వాని వరించి యవల నీవింక
నెట్టి సౌఖ్యములంద నెంచి యున్నావు 1873

ఉరు గజాశ్వమునెక్కి యూరేగు నీవు
మరియు దెట్టుల వాని ముసలెద్దునెక్కి 1874

స్వస్తి వాక్యములచే చకితనౌ నీవు
నిస్తులంబుగ భూత నినదముల్ గొనెదె 1875

మంగళ ధ్వనులను మదిమెచ్చునీవు
పొంగుదెట్టుల వాని పుత్తె వాద్యముల 1876

విరివియౌ సౌధముల విలసిల్లు నీవు
చరియించ గలవె శ్మశాన భూములను 1877

సరళ పరిసూనాపచయ మోర్వలేని
కరముల హరునెట్లు కౌగిలించెదవు 1878

తాకగా కందునీ తనువట్టి కఠిను
దాకగా చెడిపోదె తరుణిరో యింక 1879
నీముద్దు మురిపెముల్ నీ మనోహరము
లా మొద్దు ముందౌనె నతినీచ మిద్ది 1880
అదిగాక వంశమెయ్యేది గోత్ర మేది
సదుప లక్షణ మేది సౌభాగ్యమేది 1881
బంధువుల్గలరె దత్ప్రియంబదెంత
బాంధవంబగు విద్య బరగిన వాడె 1882
నీకు పొసగనివాని నీకేమొ చెప్ప
నోకమలేక్షణా యుగ్రుగోరుదువె 1883
అతనినేనెరుగనే యక్షేశు డియ్య
బ్రతుకు చుండెను వాని పంచనే జేరి 1884
నీవింక హరునిపై నేస్తముగాక
నావంక జూడుమో నళినాక్షి నేను 1885
ఆచారవంతుండ నౌదు శీలమున
నాచార్యుడను ధాత్రి యజ్ఞాది విధుల 1886
సల్పినాదను శుద్ధ జాతుండ నాకు
అల్పుడా భవుడెన్న నన్నిమార్గముల 1887
ఐశ్వర్యవంతుడ నగు నాకుసముడు
విశ్వమందున లేడు వేయేల దివ్య 1888
భూములున్నవి కల్ప భూజముల్ గలవు
గోమహిషాదులు స్వాడ నాకమరు 1889
భవుని మాటలు మాని పడతిరో నన్ను
దవునిగా గైకొమ్ము ధన్యవయ్యెదవు 1890
అన్నమాటలకుల్కి హాహహాయనుచు
గ్రిన్నన దనచెవుల్ కరముల మూసి 1891
ఓచెలులార మీరౌయ్యన నిట్టి
నీ చాత్మునెట్టదే నికటమందుండి 1892

అనిన వారలు గోపమంది యోవృద్ధ
ఘనుడు నిత్యానంద కరుడైన హరుని 1893
వృద్ధుడా నీవిట్లు పేర్శిలుట కన్న
బుద్ధి తక్కువలేదు పోపొమ్ము నంగ 1894
చివ్వన నిలుమండి చిఱునవ్వునవ్వి
యవ్వరారోహ కిట్లగుపించె నపుడు 1895

## శివుడు నిజరూప మగ బఱచుట

ఘన జటా మకుట సంఘటితేందు శోభ
గన వియన్నది దివ్యకాంతులుప్పొంగ 1896
దర్పించి యద్దాని దాకగా గలిత
సర్ప భూషద్యుతుల్ సమకట్ట వాని 1897
ధాక దేహచ్ఛటల్ దర్లుచుండంగ
వీక దానిని గూడు వేడ్కతో భూరి 1898
నంది వాహనుని యానంద మేపార
సుందరాస్యుండౌచు శుభకరుండౌచు 1899
గీర్వాణ పూజ్యుడౌ కృత్తి వాసుండు
శర్వాణి పెండ్లి వేసముతోడ బిల్చి 1900
చిఱునవ్వునవ్వ యోశివ నీదు భక్తి
గరిమకై మోదించి కన నీకునిట్టు 1901
లైతిగావున సంశయము లెల్లవీడి
నీతలంపును దెల్పు నీరేజ గంధి 1902
అను మహేశ్వరుగాంచి యాశ్చర్యమంది
పెనుమోదమున మహా విటతాటయౌచు 1903
కరములు మోడ్చి యాకంజాక్షి యిట్లు
మరి భక్తి నుతియించె మధురవాక్యముల 1904
సరగ యేనీ పదాబ్జములు బూజించి
హరియజాదులు మోదమంద నెంచెదరా 1905

ఏనీ స్వరూపంబు నీక్షించి యోగి
యాననాబ్జములెల్ల నలరునో సతము 1906
కరము జ్యోతిర్మయా కారత్వమంది
మిరియునే నీదివ్యమూర్తి లోకముల 1907
అట్టి భూతేశు పాదాబ్జముల్ భక్తి
పట్టి వేడెద నాకు భర్తగా గోరి 1908
అని వేడుచున్నట్టి యార్యను జూచి
ఘనముదంబున బల్కె ఖండపరశుండు 1909
వినుము దుర్గా నీదు విధమెల్లగంటి
ఘనునైన మీతండ్రి కడకు నేనింక 1910
తగువారెనంపి యా ధన్యు ననుమతిని
తగనిన్ను గైకొందు తప్పక ననుచు 1911
గిరిజ కావరమిచ్చి కృత్తివాసుండు
అరుగగా కైలాస మంత నాపెయును 1912
చెలిమికత్తియలతో చెలగు మోదమున
తలిదండ్రులనుగాంచ దనవాస మఱిగె 1913

## శివుడు హిమవంతునికడకు సప్తమహర్షులను పంపుట

ఆతీరుగా భవుండరిగి వాసంబు
క్ష్మాతలంబున గూలి సర్వముఁ మఱచి 1914
మఱియు బార్వతినెంచి మన్మథాయత్త
శరబద్ధుడై యాపె సౌష్టవంబెల్ల 1915
మందినెంచి సర్వము న్మాని మైమఱచి
అదరుచు నొంటిమై యావలింపుచును 1916
ఎపుడు దేనినిగాంచ నెంతయు మోహ
చపలత్వమంది యోశాంకరీ యనును 1917

నిన్నెప్పుడు గాంతునో నీకరగ్రహణ
మెన్నడే గందునో యీపజీవంబ 1918

నీ యొయ్యారము రూపు నీ భాషలెన్న
వేయి జిహ్వాలుగూడ విఫలముల్గావె 1919

విమలాంగి వేయేల విధివశుండౌచు
అమరాదులకు గూడ నాశ్చర్య మొదవ 1920

మరుని గెల్చినయట్టి మహాదేవుడట్టి
మరుని బాణములనే మరిజిక్కి నీకు 1921

దాసుడై శోప నెంతటి వారో కల్కి
యాస జిక్కని వారలవనిపై ననుచు 1922

విరహాతురుండౌచు విచికిత్సు డౌచు
హరుడు మేఘ ద్వారమందు నీక్షించి 1923

ఆప్తులు దివ్య మార్గాంచితులైన
సప్తర్షులను వేడ్క బయ్యన బిలువ 1924

ఘన మార్గమునచుంతి కైలాసమునకు
చనుదెంచి భక్తితో సాంబున కెఱగి 1925

అంచితోక్తుల నిట్టు లతని గీర్తించి
రెంచ నీజగమెల్లనే నీదు మయమొ 1926

తెలియగారానట్టి దివ్యమూర్తివియు
నిలసమస్తంబయ్యు నేదియు గనని 1927

అత్యంత కేవలుండైన చిత్కళవు
మృత్యుంజయుండవై మెలగు నిత్యుడవు 1928

పరమేష్ఠి వైకుంఠ వాసవాదులగు
వరనిర్జరుల తపః ఫలమౌచు నొప్పి 1929

వరతేజమై మహాబ్రహ్మండమెల్ల
గరిమనొప్పెడి నిన్ను గాంచ మాకబ్బె 1930

అనితన్ను నుతియించునట్టి పూజ్యులను
ఘనముగా పూజించు ఖండపరశుడును 1931

దివ్యమంగళ మహా తేజమున్గాంచి
అవ్యయానందులై యానంద బాష్ప 1932
ములరాల్చి కాబోలు మునిపత్నులెల్లి
రలదారుకావనం బందు మోహించి 1933
రదిగాక కాబోలు నంగజుండితని
గదిసి యనంగుడై ఖంగారు పడియె 1934
ముము సరోజాక్షుడే మోహినీత్వమును
గనిపీని వరియించెగాబోలు పురుష 1935
కోటులే మోహించగోరు నీపుణ్య
కోటులుగోరరే భువనంబులందు 1936
మాటిమాటికటంచు మానితభక్తి
పాటపంబున నుండ భర్గుడట్లుండ 1937
కుంభసంభవుడిట్లు కోరివచియించె
శంభో ! మహేశ్వరా ! శర్వ ! నిన్నెన్న 1938
పాపియైనను మహా భాగ్యుడగుచుండ
మాపుణ్య మెట్టిదో మహినీతలంపు 1939
నకు వచ్చి లోకమన్నన నందినాము
ఇకపైని మీయాజ్ఞ యెద్దియో తెలుప 1940
జటపనుంటి మనంగ శర్వుడిట్లనియె
ధర శూరదైత్యుండు తమ్ములనుగూడి 1941
బాధలం బెట్టగా ప్రార్థించి విష్ణు
వేదాదు లెల్లరా విధి మాన్పగోరి 1942
దానికై తుహినాద్రి దపియించు చున్న
జ్ఞాన స్వరూప జిచ్ఛ[illegible] పార్వతిని 1943
పొంది మహాసేను బుట్టింపనెంచి
తందుకై మీర లత్యంత శీఘ్రమున 1944
పోయి యాహిమవంతు బొంది తగపల్కి
చేయుడీ శుభమింక చెందుపుణ్యంబు 1945

మరియు గొంతలతోడ మాటాడి వారి
కెరిగించ మీతోడ యింతులు గూడ 1946
కొనివొంచనగ వాని కోర్కె నెరవేర్చ
ననఘులంతట పోయి రతివల తోడ 1947

## సప్తమహర్షులు హిమవంతునితో పార్వతిని శివునకిమ్మనుట

ధరణి కామక్రోధ దంభ లోభాది
హరణమౌ నోషధీయంబౌ హిమాద్రి 1948
నొప్పు నిర్జర తపంబోషధీ ప్రస్థ
మప్పుడు వారేగి రతివలతోడ 1949
అంత నాగిరిరాజు నంచితోక్తముగ
సంతసంబున నేగి సాగిలి మ్రొక్కి 1950
మణిపీఠములనిచ్చి మణిమణింగుశల
ఘనవార్త లడుగ నా ఘనులును నడుగ 1951
గిరిరాజువల్కె మీకృపచేత మేము
తరియించినాము నాతనువు మీయదిగ 1952
తలచి దాసున కాజ్ఞ దయసేతురేని
సలుప సిద్ధంబన్న సరగ నామునుల 1953
నాంగీరసుం డిట్లులనియె మారాక
మంగళ ప్రదమౌను మరిమోదమలర 1954
బంధుమిత్రులగూర్చి పరగ నీసుతను
బంధురంబుగ జేర్చు బాపురేయనగ 1955
చారునిం బనుప నాచారోక్తముగను
సారసేక్షణ నెల్ల సర్వమంగళను 1956
ఘనభూషణాది సంకలితగా జేసి
గని తిలకముందిద్ది కళకళలాడ 1957
సలుప దామునుగూడ చకితరై వెంట
బలిసిరా మోదించి పర్వతేశ్వరుడు 1958

మందస్మిత ముఖాబ్జ మయమైన నాత్మ
వందనంగాచి యానంద మొప్పార 1959

అంక స్థలంబునందలి పేర్మిమజేర్చి
శంక వీడిన ముఖాబ్జమున నొప్పార 1960

ఆ యరుంధతి గాంచి యార్యనుజూపి
ఈ యమ్మ యౌను లోకేశ్వరి యనుచు 1961

నిత్యుండు సిద్ధుండు నిర్మల జ్యోతి
సత్యస్వరూపు డక్షరుడు పూజ్యుండు 1962

భర్త యన్యోటి యీపె భాగ్య మేమందు
కీర్తి పంతుడవయ్యె గిరిరాజనీవు 1963

గట్టునిల్తుమ తాళిగట్టు నీముద్దు
పట్టి గాంచిన మహా భాగ్యంబు కతన 1964

అట్టి జగన్నాధు డల్లుడౌ పుణ్య
దిట్ట నాఘాతేశు తేజంబు వలన 1965

ఇక నీపె కుదయించు నెంతయు గుహుడు
నికషాత్మజుల గూల్చు నిర్జరుండౌచు 1966

గాన నీవింక నాకాలకంఠునకు
పూని కన్యాదానమును సేయుమింక 1967

అన బంధులెల్ల రత్యంత మోదమున
గన నన్య నచులెల్ల కాంచి మేనకను 1968

లోకమాతను గన్న లోలాక్షివనుచు
వీకగాంచగ నావిధి నగేంద్రుడును 1969

తన భాగ్యమున కుబ్బి తనయ ముద్దిడుచు
ముని పుంగవులకు కేల్మోగిచి సద్భక్తి 1970

తరియించి నామిక తప్పక నాదు
వరపట్టి నిత్తు నా వామ దేవునకు 1971

గాన శుభస్య శీఘ్రింబనుచు నా మ
హాను భావునకు మీ రగును చెల్వంగ 1972

అంత వారలు తథాస్తనగ నాంగిరసు
డింతలో హిమవంతు యింతులనుగాంచి 1973

ఇష్టమే మీ కెల్ల నీ వివాహమున
ఇష్టమేనన మేన కిట్లనె నపుడు 1974

మేము స్తావములపై మెలగుట జేసి
యా మహిమ తెలుగగా నగు నొక్కొమాకు 1975

అదిర మహాదేవు డనిన సంతసమె
అదిగాక మా యల్లుడనగ మోదంబె 1976

కాలుని కాలాన గడతేర్చె నండ్రు
హాలాహలము మ్రింగె నబ్ధియందండ్రు 1977

పరమేష్ఠి తలపుత్రె బట్టెచే నండ్రు
హరి సోమయాజియు మామయు నైన 1978

దక్షని తలద్రెంచి దండించె నండ్రు
శిక్షించె నచ్చోట జేజేల నండ్రు 1979

కాన నుగ్రత్వంబు గల్గు నా హరుని
మానసం బెన్నగా మా బోంట్లకౌనె 1980

అదిగాక మాబిడ్డ అతి సుకుమారి
సదయురా లీతల్లి సౌఖ్యంబు దరుగ 1981

జీవింతుమా మేము క్షితిపైని నింక
ఆ వామదేవున కాప్తు లున్నారె 1982

తలిదండ్రులును సహోదర బంధులెవరు
తలప నేకాకిగా ధర నొప్పునంట 1983

ఈ సమయంబున నీకు కియ్యంగ
ఆసయుణ భయము నా యందొప్పె రెండు 1984

అన యమంధతి పల్కె నామెకీరీతి
విను జగంబుల కాది వేల్పైనవాని 1985

మాయ గప్పుచు భూత మండలంబులను
పాయ గొట్టుగ వారి పాపటను గాంచి 3051
భూత నాయకులందు భూరి విజయుండు
భూతేశు మదనెంచి పొంగి తూణీర 3052
చాప ధారుండౌచు శరముల జిమ్మి
యాపూర్వదేవతల నవనిపై గూల్చి 3053
ఘోరాత్మజులనేసి చొక్కించి వారి
ధారుణిం గూల్చగా తక్షణమెవారు 3054
జనియించి మరియేయ జనియించుచుండ
కని విస్మయంబంది కార్తికేయునకు 3055
పరిణుతించ క్షణములో బాహులేయుండు
కనుపించి లీలగా ఘన మంత్రమొండు 3056
ఎఱిగించ దానిచే హెచ్చి విజయుండు
మఱి మాహాసేను దన మదియందు నిలిపి 3057
భైరవాస్త్రం బేయ ప్రళయకాలంపు
భైరవాకృతముగా బర్వి ఘోరముగ 3058
చిటపట ధ్వని తోడ చెలగి యాదైత్య
పటలి నాశణమందె భస్మం బొనర్చె 3059
విజయుని మెచ్చిరా విబుధులెల్లరును
విజయుండవే యనియె విబుధసేనాని 3060
సుమవర్ష మొనగూరె సుర వీధినుండి
ధిమిధిమి మొరయగా దివ్యవాద్యములు 3061

## ధర్మకోపుడు యుద్ధమునకువచ్చుట

చారులంతటనేగి సమరచరిత్రి
నీరీతి వినిచిరి హెచ్చి విజయుండ 3062

అనియెందు నీ పుత్రులందఱ నొకడె
అనిచె బరలోకమున కన గుండె లవియ 3063

తగిలిన దుఃఖాబ్ధి దరిగాన కుండ
వగచు తాతనుగాంచి వానిపౌత్రుండు 3064

ధర్మకోపుడు పల్కె తాతాయిదేమి
కర్మమయ్యెను నీకు కంగారి వైతి 3065

నీవిట్లు తపియించ నిర్జరాదులట
గావింతు వెగతాళి గాన ధైర్యమున 3066

ననుబంపు శాత్రవుల నలినులిచేసి
కని వీరబాహువు గట్టితెత్తునన 3067

తనపౌత్రు ననుప నాతడును దివ్యాస్త్ర
ఘనుడౌచు సేనతో దరలిపోవంగ 3068

అదిగాంచి భూతంబు లార్పుటిల్లుచును
గదిసి రాక్షససేన ఖంగాగొనర్చ 3069

ధర్మకోపుడు హెచ్చి ధర్మంబు గీటి
మర్మంబులను జించి మందరంబనగ 3070

తిరిగి భూతగణంబు దిమ్మరవోవ
ధరనేయ వీరుండు తనహస్తమెత్తి 3071

పిలిచి యీతనిగూల్తు భీతిల్లనేల
సలలితంబుగ నంచు చాపంబు గీటి 3072

ధర్మకోపుని దాకి ధైర్యమేపార
మర్మంబు లంటగా మార్గణములేయ 3073

నొచ్చియాప్పుచు వీరు నూరు బాణముల
గుచ్చి వానిని లెక్కగొనక వీరుండు 3074

తగు శరంబులనేయ ధర్మకోపునకు
పగుల వక్షము మూర్ఛబడి వేగలేచి 3075

శాతశిలీ ముఖాస్త్రంబులనేయ
నాతండు రోషించి యతనిపై దుమికి 3076

వానిరథమును బట్టి పైకి విసరంగ
పూని యాతండొక్క భూరిగదనేయ 3077

కరమునబట్టి యాగద నేలపైచె
మరిశూల మేయగా మడమచే ద్రొక్కి 3078

ధర్మకోపునినెత్తి ధరవీచి వీచి
మర్మముల్ బ్రిద్దలై మఱిగూలనేసె 3079

## భానుకోపుడు తండ్రితో యుద్ధమాపెద మనుట

హత శేషులేగి యాహవ వార్తదెలుప
క్షితిగూలి మఱిపేచి చిందువందొచు 3080

తపియించు తండ్రి నత్తఱి భానుకోపు
డుపశమింపగజేసి యొనర నిట్లనియె 3081

తండ్రి యికేమందు తగభూత పతులు
గాండ్రించుచున్నారు కాలాను సరణి 3082

నగర లుంఠనమాయె నాకారులెల్ల
పగరచే హతులైరి ప్రధనంబునందు 3083

జయము వైరుల కంచు సరగ నామదికి
భయము తోచెనుగాన బాహులేయునకు 3084

పూని మనమికనైన బోయి ప్రణమిల్లి
సేనాని దయను నార్జింత మాయనగ 3085

నాజ్య సంవేగమౌ అగ్నిచందమున
ప్రజ్వరిల్లుచు పండ్లు పటపట కొరికి 3086

గెల్చిన నాడెల్ల గేరి యీనాడు
పల్చనైతి మటంచు ప్రణుతిసేయంగ 3087

నుమియరే ముఖమునం దువిదలు గూడ
నమయంబు దప్పనీశ్వరుడైన సేయ 3088

గలడె యాప్తులనెల్ల కదన రంగమున
బలివెట్టి మనమెట్లు బ్రతికి యుండెదము 3089
నీవు భీతుడవైన నిలువు మీఖింట
నావంతు నేజేతు నలుగురు మెచ్చ 3090
అనగ భానుందోడి యనియె జనకునకు
జనకా యిదేపోదు సమరంబొనర్ప 3091
ఈతేప వీరుడో యేనొ ప్రాణముల
భూతలంబున నుండ బోలును గాక 3092
ఇపుపురమును గూడ నిల నుండపనుచు
మఱిమఱి రోషించి మచ్చరించంగ 3093
కనిశూరుడింక వేగమున బొమ్మనగ
తనమందిరముజేరి తగిన వేసమున 3094

## భాను కోపుని మూడవసారి యుద్ధము

భానుకోపుడు చిత్రభానుడోయనగ
ఆనీతమౌ దివ్యమైన రథమెక్కి 3095
వివిధాస్త్ర శస్త్రములు వెలుగ మాతంగ
అవిరళాశ్వరథాదు లంట తనవెంట 3096
వాహినీ నివహుడై వాద్యాళి లొప్ప
ఆహవస్థలి జేరి యార్భాట మొప్ప 3097
అరిసైన్యముల దాకి యంప వర్షంబు
గురియించ భూతముల్ ఘోరముగదాకి 3098
తరుగిరిపాషాణతతుల బాణముల
మరి ఖడ్గగదచక్ర మహిత ప్రాసముల 3099
సాధనంబుల బోర శవముల వల్లు
గాధరాస్థలి గాగ కాకఘూకాదు 3100
లెసగగా భీభత్స మేపారుచుండ
నసుర సైన్యము లెల్ల నట్టిట్టు బర్వె 3101

భానుకోపుడు దాకి బడబాగ్నిరీతి
బూని యేయగ నొచ్చు భూతవాహినులు 3102
వీరబాహువుగాంచి విలయ కాలుడన
ధీరత్వమున నాపి ధిక్కార మొదవ 3103
ఆనాడు పారి నాపై ననేమయ్యె
ఈనాడు నాచేత నీల్గవే యనుచు 3104
పైవగా దనుజ నాయకుడు మూర్ఛిల్లి
ఆ వెంటనే లేచి యదర వీరుండు 3105
పావకాస్త్రం బేయ భానుకోపుండు
పావకాస్త్రముననే పరిమార్ప నతడు 31 6
ఆరీతి హెచ్చగా నసురుడు మాయ
ధారియై సుడియాప ధరనెల్ల దిరుగ 3107
వీరుండు గుర్తించి వీక రక్తంపు
ధారలం గ్రిక్కగా దైత్యునేయంగ 3108
ఆతండు పూని మాయాస్త్రమేయంగ
భూతసైన్యములెల్ల బొబ్బలువెట్ట 3109
వీరుండు విజ్ఞాన విశిఖముం బైచి
కూరమాయాస్త్రముం గుధరపై నేయ 3110
అరథస్థుడై మింట నగుపించనతడు
అరదంబుతో నేగి యసురుని దాక 3111
యుద్ధముద్ధృతమైన యోధద్వయంబు
యుద్ధ పద్ధతుల దామేయు చౌంధొరుల 3112
అభ్రిమెల్లను దూల నంప వర్షంబు
విభ్రమం బొప్ప గావించి మించుచును 3133
పంతంబు లొప్పగా పాద ఘట్టనల
నంతకంతకు హెచ్చి యార్భటిల్లుచును 3114
తమ తొడల్ దట్టించి తాకుచౌండొరులు
సమయింతు నిన్ననుచు చంగున నెగసి 8115

సింహనాద ధ్వనుల్ చెలగ నల్పుచును
సింహంబులన దాకి జీవాశ లుడిగి 3116
పోరుచుండగ వారి భూరి వేగములు
తీరు గా మరి బర్వి దిక్కులఁ జించె 3117
పాదఘట్టనల సంబంధ మౌధూళి
రోదసిం బర్వగా రోసముల్ హెచ్చె 3118
భానుకోపుడు వేయు భల్లంబులేసి
పూని వీరరథంబును ధాత్రి నేయ 3119
వీటిడల్లె భాను విరథుని జేయ
వాటు ధీకొని రక్తపట్టులై యంత 3120
పాయుచు డాయుచు బడుచు లేచుచును
కాయములో దూట్లుగా గాయముల్ గాగ 3121
ధ్వంసమై శల్యముల్ ధరరాలుచుండ
హంసపుఁ ముద్దలై మహిగూల కూల 3122
భానుకోపుడు వీయ బరిఘతో నేయ
బూని వీరుడుబట్టి పొడువ వక్షమున 3123
పరమేష్టి దత్తమై పరగు నొకశక్తి
బరగించ నది వీరవాహుండు గాంచి 3124
మెరగి షాణ్మాతుని నేయ నొకశక్తి
చురుమౌచు ధాత్రిపై తొరగుటగాంచి 3125
భానుకోపుడు గూడ బట్టి ఖడ్గమును
పూని పెనగిరి మహాద్భుతముగా వారు 3126
దేవతాసురవీరధీయు లాతీప
గావించునట్టి యా ఖడ్గయుద్ధమున 3127
మండలాకృతులౌచు మలయు చొండొరుల
ఖండనం బొనరించు పట్ల వీరుండు 3128
అతని దక్షిణ భుజం బాటు తెగనేయ
నతడు రెండవ హస్తమందు ఖడ్గమును 3129

పూనబోవగ బట్టి భూమినె పుణిని
దానిగూడను గొట్టి ధరణి నేయంగ 3130
పక్షిరీతి నతండు బడ ధాత్రి దొక్కి
యాక్షణంబున వీరు డట్టతో నలకె 3131
పూని గురిసెను దివ్య పుష్పవర్షంబు
లోని నాకసమందు దుందుభుల్ మొరసె 3132
ఆరీతిగా దైత్యునట దునిమి మించి
వీరబాహుడు భక్తి పిలసిల్ల గుహుని 3133
పాదములవై వ్రాలి ప్రణమిల్లినంత
ఆదరింపుచు వాని నాంబికేయుండు 3134
యొడలెల్ల నిమురగా నొప్పె తేజంబు
వడి బాహులేయుడా భక్తికి మెచ్చి 3135
సంతసంబొప్పగా సాధు నీకోర్కె
లెంత యుందీర్తు నా కెఱిగింపుమనిన 3136
నీపాదముల భక్తి హెచ్చు భాగ్యంబు
ఆపాదితము సేయు మన సంతసించి 3137
యొసగి సుబ్రహ్మణ్య దొప్పుగా వీరు
అసదృశుంగా జేసె నఖిలలోకముల 3138
ధాత్రియందెవరేని తగ దీని నెన్న
శత్రుసంహారంబు సాధ్యమై తీరు 3139
సిరి సంపదల ధాత్రి చెలగి యాగుహుని
కరుణచే శక్తిలోకంబు నందెదరు 3140
పరశురాముడు దీని పఠియించి వేడ్క
అరికోట్ల విదళించె హనుమానుడట్లె 3141
అసుర కోటులనెల్ల హతము గావించె
వెసబాండవులు దీని విన్న మాత్రమున 3142
కౌరవ్యులనుగెల్చి ఘనత జేకొనిరి
వీరబాహుండట్లు విలసిల్లెనంచు 3143

దగసూతు డెటంగించి ధన్యాత్ములార
అగణింతటుగ విస్తు నావలి గాథ 3144

## భాసుకోపుని మరణవార్తవిని శూరపద్మాసురుడు విలాపించుట

అనుచు నచ్చటినుండి హతశేషు లేగి
వినిచిరా శూరునకు విశ్రుతరీతి 3145
కనికన మనమెల్లగ్రాల ధరవ్రాలి
కనుచు దిక్కులనెల్ల కళవళింపుచును 3146
మనము రాయిగ మార దహినుండి లేచి
తనవారు దను జుట్ట తనయుని నెంచి 3147
పిలపించె నా నొసట విధియెంతవ్రాసె
నిలవిర్జరావళుల కెగతాళిగాగ 3148
నని కుమారుని రూప మాత్మ యందొప్ప
తనమహా దుఃఖాబ్ధి దవిలి యుండంగ 3149
అతని పట్టపు దేవియౌ పద్మకోమ
లతయేడ్చుచును వచ్చె లలనలతోడ 3150
హాపుత్రకా పోతివా నాదుతండ్రి
ఏపగిది జీవింతు మెవరురా దిక్కు 3151
ఎంతపాప మొనర్చి తేను నీధాత్రి
నింతయై తీరె నాకిట్టు విధి వ్రాసె 3152
ఆశలెల్లను దీరెరా తుట్టతుదకు
వంశమారగ మాకు వంచనయుగల్గె 3153
అని పుత్రనిర్యాణ మైన శోకమున
తనువు ధూళినిదోగ ధాత్రిపై బడుచు 3154
తన శిరోజము లెల్ల ధాత్రి వ్రేలంగ
తనము హారాదులత్తరి చూర్ణమంద 3155

ఎలుగెత్తి నాతండ్రి ఎటుబోతి వనుచు
తలను హస్తములతో తగ గొట్టుకొనుచు 3156

పలువిధంబుల నేడ్చె పడతి నెవ్వెట్లొ
అలుక మానిచి పంచి యావలింపుచును 3157

తన దుఃఖ తీవ్ర మంతట కోపవహ్ని
గన సహోదరుడైన ఘనసింహ వక్త్రు 3158

పిలిపించి ఎఱిగించి వృత్తాంత మెల్ల
కలచి శత్రుల గూల్చగా బోదమనిన 3159

అనె సింహ వక్త్రుడా యన్నతో నిట్లు
మును నెంచి నట్లుగా మూడెమనకిట్లు 3160

ఇంతమందియు బోయి నెంతాయె నేడు
పంతగించితి మట్లు బాహులేయుండు 3161

డింభకుండంచు నాడిన ఫలంబబ్బె
శంభు నపత్యంబు సత్య సత్వుండు 3162

అని చెప్పగా హలా హల మయ్యె గాదె
చెనటి మాటలెనీకు చెవులలో జొచ్చె 3163

ఐన నేమాయె నీయాజ్ఞచే నేను
పూని నెల్లిట జన్యభూమిపై శత్రు 3164

పులగెల్తునని రాత్రిబుచ్చి యుదయమున
మిళితచందన దీప్త మేనితో గళిత 3165

కుసుమ ధామాంచిత కోవిదుండౌచు
అసదృశుండుగ నొప్పు చట్ట హాసమున 3166

## సింహవక్త్రుడు యుద్ధమునకు వెడలుట

ప్రాసాదికంబు లొప్పగ నశ్వతతుల
భాసిల్లురథ మెక్కి వాహినుల్ గొలువ 3167

రథహస్తి తురగ మారణ సాధనాది
వివిధ వాద్యములొప్ప విపులాతపత్రి — 3168

యుతుడౌచు వెడలగా నుగ్ర గృధ్రముల
తతులు గూబలును కేతనమందు వ్రాల — 3169

బల్లమెల్లనులాగ్ని విపాతంబు గాగ
నిలచి గోమాయువుల్ నెఱి గూయకాయ — 3170

ఈతీరు శకునంబు లెంతగానైన
నాత డాహవధాత్రి కరుదెంచుచుండ — 3171

పరమేష్ఠిలోనైన బ్రహ్మర్మఖాకి
పసుగలెత్తుచు నేగి పార్వతీసుతుని — 3172

రాంచి విలపించగా గద్గదికు లౌచు
నెంచి మాతకు రథంబిక దెమ్మనంగ — 3173

ఓరవాహాను వచ్చె వినయ మేపార
ఆరాక్షసుని తాక నన్నంపు మనగ — 3174

విసనచ్చి దళకోత్త సెలవిచ్చె గుహుడు
భరిత శస్త్రాస్త్ర సంబంధమౌ రథము — 3175

నెందు సన్నద్ధుడై యంబరాభరణ
పంచనాదులనొప్పి సరగ గోటీర — 3176

మునువాల్కి సుమధామములనొప్పి ఛత్రి
ముసు వామరాది సమ్మోహితుండౌచు — 3177

సర్వవాద్య విశేష సహితుడై భూత
పార్వతుల్ గొలువగా దోగయాగ్రిముగ — 3178

ఇరువాగు సైన్యముల్ హెచ్చు తురగోష్ఠి
పరదాడి ప్పనుమెల్ల యలమసైన్యముల — 3179

గరసల్ పెంగ నాకసమెల్ల బిగుల
గర్జించి భూత సంఘములు జృంభించి — 3180

తరుగిరి పాషాణ తతుల మహోగ్ర
శరగదా చక్రాది సాధనంబులను 3181
పోర బోదగ హెచ్చుఘాత సంఘముల
ధీరుడౌ సింహుడు దేర్కించి యసుర 3182
తండంబులను దాకి తన కరంబైన
దండంబుతో నేసి ధర గూల్చుచుండ 3183
అసురు సేనాధ్యక్షుడౌ దశాస్యుండు
అసమకేళి యనంగ నాసింహు నాగి 3184
శిత శరంబుల నేయ సింహుండు గినిసి
యతని నేయుగ దండ మది దైత్యు దాకి 3185
ధరగూల దైత్యుడాతని శక్తినేయ
పరిమార్చె సరచేత బట్టి సింహుండు 3186
అసుపు దేయగ శూలమదిబట్టి సింహు
డసమ రుద్రుడనంగ నసురునిదాకి 3187
వక్షముగ గుమ్మగా వడినెత్తు గక్క
యాక్షణంబున నేగె నంతకుని గాంచ 3188

అసుర నాయకులంత నాసింహుచుట్టు
ముసురు కొనంగ నా మూకపై దుమ్ర 3189
డెదుర వాని నెదిర్చి హెచ్చి దుర్ముఖుడు
పదులు వందలు వేలు పదివేలు లక్ష 3190
ఘన శరంబులనేయగా రుద్రుడంత
దునిమి దుర్ముఖునేయ ధూర్త బాణముల 3191
మర్మముల్ బ్రద్దలై మరి బోరనోడి
దుర్ముఖుండెడ బారె దురమంత వీడి 3192
అపుడు మహాకాయు డయుత శీర్షుడును
అపకర్తలౌచు సింహాననుని జూచి 3193
శరముల దొరగించ సరగ ఘాతములు
తరుగిరి పాషాణ తతుల వర్షింప 3194

నప్పుడా తనిపుత్రు లౌశత్థాధికులు
కుప్పించిరా గాంచి కుప్పెకోలలను 3209
వారినంవరనేసి వాక్రుచ్ఛతనను
వారుధనువుల వీడు బధపంచుఖడ్గ 3210
ములనేయ వీడు దమ్ములవానినెల్ల
డిలగింబలుగ గొట్టి తీవ్రకోపమున 3211
వీరభద్రాస్త్రమును వీరుండుపైవ
వారలందరునొక్క పడిజచ్చిపవిది 3212
అమరులు సుమవృష్టి యతనిపైగురియ
ధిమిధిమిమొరసె నా దివ్యవాద్యఘులు 3213
హరిముఖుండదియెల్ల నవలుచుగాంచి
తరిమదుఃఖంబుచే గలుకోపమున 3214
వీరబాహునిదాసి వీకనిట్లనియె
ధీరనీవెవ్వరో దెలుపుమందనిన 3215
వీరబాహువునేను వీరశరజన్ము
చాయడను తమ్ముడను చరణసేవకుడ 3216
ఆనాడు దూతపై యరుదెంచిమిమ్ము
పూని కలవడజేసి పోయినవాడ 3217
తలచి వచ్చితి శక్తిధరునాజ్ఞ నేను
కలగుండు వడజేయ గలన మిమ్మెల్ల 3218
అనగ మందుచువాని హరివక్త్రిదేయ
దునిమి నవ్వాచు పేయుటూపులదరించ 3219
దనుజుడాతని చేతి ధనువు వోసేయ
గని వీరు దొందంద గ్రవ్యాదుదేయ 3220
తరగ వీరుడు దైత్యసారథిని గూల్చ
హరిముఖుండంత కాలాగ్ని చందమున 3221
ఖల్లంబు వేసె నంబరమెల్లనిండ
తల్లడిల్లిరి భూత తతులెల్ల వీరు 3222

కత్తెరి నాటగసేయ నసురుండు క్రోధ
మతియౌచు గర్జిల్లి మండితాస్త్రముల 3223
పిపనేయనతండు విలయాగ్నిరీతి
ఆరాక్షసుని సేయ అతడును వేయ 3224
నరగదైత్యుడు వీరు చాపంబు దున్మ
మరియు నొండొండుచు మధ్యకాలమున 3225
రక్తస్రవంతుగా రహిసల్ప నతడు
శక్తిచే రక్ష్యముల జానేసి హెచ్చ 3226
సింహవక్త్రుండు యోచించి శాంబరిని
అంహస్సుపూరితంబైన పాశమున 3227
కట్టిపూర్వాద్రిలోగల గహ్వరమున
నట్టిపై వగ జాపులప్పుడే బోయి 3228
వాహులేయునకు దెల్పగ గోపమంది
ఆహవోక్త్రంబుగా నమరించి రథము 3229
తెప్పించి దానిపై దివిరి శస్త్రాస్త్ర
లొప్పగా గుహుడేగి యుద్ధంబొనర్ప 3230
ఘాతదైతేయులప్పట్ల శస్త్రాస్త్ర
ఘాతలం పాషాణ ఖడ్గఖేటముల 3231
ఘోరంబుగా బోర గుహుడు రౌద్రమున
పారగొబ్బెను దైత్య బలములనెల్ల 3232
హరి ముఖుండును నేయ నతని ఘాతములు
తరుగిరిపాషాణ తతుల నేయంగ 3233
కనియుగ్రుడై మ్రింగ కర్ణనాసారి
ఘన రంధ్రముల వచ్చి కాల్నిలుపలేక 3234
పాపవారను చిక్కుపడువారు గాగ
తారకాంతకు డేయ దైత్యుడును నేయ 3235
పంచాననాస్యుండు పరగి కోపమున
క్రౌంచమ్ము ఘోరాంబికముల నేయంగ 3236

శరజన్ముపై దైత్య తండముల్ గవియ
మరివారలను గూల్చి పంత్రించినట్లు 3237
ఆరాక్షసుని ఫాలమందేసి యతని
ఘోరంబుగా మూర్ఛ గూర్చి బాళముల 3238
అదరిపాటుడిపి వీరాదులవ్వీకువ
పదముల వ్రాలగా బాహులేయుండు 3239
కటుణించి రౌద్రమున గతినాస్త్రతతుల
నెంపి సేనలనెల్ల నేలపాల్జేసి 3240
రథము చూర్ణమొనర్చి రాక్షసునినేయ
అధిగతంబుగ నాత డంది శూలంబు 3241
నేయగా నది దున్మి హెచ్చి పేనాని
ఆ యసురుని నేయ హస్తముల్ దునిమి 3242
మరల బుట్టగ వాని మర్మంబులేసి
శిరములం గుట్టగా జేకూరె మరల 3243
ఇది వీరయోగ సాహిత్యమౌనంచు
కదిసి యాదైత్యునొక కరవాలమునసె 3244
అష్టోత్తర సహస్రాంశ వారముల
స్పష్టంబుగా గొట్టబడె కొండలట్లు 3 45
అంత వరబలమెల్ల నడగ దైత్యుండు
పంతగించుచు నొక్క పర్వతంబేయ 3246
ఇకనిట్టి ఖంతతో నెంతసేపనుచు
ప్రకటితంబుగ వాని బలిసేయనెంచి 3247
బ్రహ్మాండ భాండంబు బ్రద్దలుగనార్చి
బ్రహ్మణ్యమూర్తి సుబ్రహ్మణ్యడతని 3248
శక్తినంపగ సర్వసైన్య సందోహ
యుక్తంబుగా దైత్యు నుర్వి పాల్జేసి 3249
ఉర్వి యుప్పర వీధులుత్పాతలూగ
బర్వి యాసేనానిపట్ల లీనించె 3250

ఇది వినువారలు న్వినిపించువారు
అదిమి శత్రులనెల్ల నఖిలలోకముల 3251
తులతూగుటయెగాక తుదకు గోలోక
మలతిగా జేరి యందతిశయిల్లెదరు 3252
గరిమను దీని సంగతి నందిరామ
ధరణీ నాథుడంపె దశకంఠునాడు 3253
అనగ నామును లేమొ యడుగ బోవంగ
తన మదింగాంచి యాతండిట్టులనియె 3254

## సహస్రముఖుడు తమ్ముని మరణవార్త విని దుఃఖించుట

కథవినం డయ్యు ఆకరణి సింహాస్య
వదనప్పి యనస్వప్నవరు లెల్లమెచ్చ 3255
అరిగె సుబ్రహ్మణ్యుడటుపైని చారు
లరుదెంచి తెల్పగా నసురనాథుండు 3256
ధరవ్రాలి పలుసొప్ప తమ్ముడా నన్ను
దురవస్థలో ముంచి తొలగి పోయితివె 3257
మనమాటలకు లోగి మనపనుల్ సేయు
యని మిషాదుల కెంత హాస్యమయ్యెనుర 3258
అని యేడ్చి యేడ్చి యతని దుఃఖంబు
చనివడి కోపమై భగ్గు మనరగ 3259
కొలువు కూటముజేరి కూర్చుండి యాత్మ
బలగంబులను బిల్చి పలికె రోసమున 3260
తమ్ములాత్మజులను తరుగ జూచుండు
ఎమ్మెయి నల్పవాతిక యుద్ధమునుచు 3261
నతిశయిల్లు నరాతి హతమార్తునింక
యితర బ్రహ్మాండంబు లేర్పడ వెదకి 3262
నాచూడ్కిగా జెప్పి నాకారితతుల
నా మోఘన మొనర్ప నాహ్వానముగను 3263

రప్పించుడిక చార రాక్షసుల్ బోయి
తప్పేటాదులతోడ దగకేకలిడుచు 3264
అన చారులేగి యా యబ్జజాండముల
గని యందుగల దివౌకస వైరితతుల 3265
బిలువ వచ్చిరివారు భీషణార్భటుల
నిల మహాబిల జాల మెంతయును మ్రోయ 3266
అంత వారల గాంచి యాశూరపద్ము
డెంతయో యుప్పొంగి హెచ్చువేషమున 3267

## శూరపద్ముడు యుద్ధమునకు వెడలుట

పరిమళ ద్రవ్య లేపన భూరి మాల్య
మరి రత్న భూషలంబర వేష మొప్ప 3268
పశుపతాస్త్రం బాది బహు సాధనముల
అశని తుల్యాంచితంబైన టంకార 3269
యుక్తుడై తేజమై యొప్పు రథమందు
దిక్తటంబులు గూడ ధిమిధిమి మ్రోయ 3270
వీర నాగో ద్భూత విరచితం బౌచు
ఆరాధితం బైన యఖిల సామగ్రి 3271
హృద్యమై పేద్యమై యొప్పు వాద్యముల
చోద్యంబుగా దైత్య శూరులుప్పొంగ 3272
గోపుర ప్రాకార కోటికలం దాటి
దాపు జేరగ భూత తండముల్ గాంచి 3273
పరుగులెత్తుచుపోయి బాహులేయునకు
యెరిగించ పృషదశ్వు నికదెమ్ము రథము 3274
అన నట్లొనర్చగా నఖిలాయుధముల
ఘన గదాశూల చక్రముల దివ్యాస్త్ర 3275
శక్తి తోమర ప్రాసజాలముసలాది
యుక్తుడై వాద్యాదు లొప్ప నాయకులు 3276

కొలువ సైన్యములతో గూడ దాపెనలి
తిలకించె దనుజేంద్రు వీరవాహినుల 3277
ఘోరాతి ఘోరమౌ ఘోషలొప్పారు
వారి యురవడి సర్వవాస్తులం గదిపె 3278
ఒక్కొక్క డొప్పుగా యొక్కొక్క లోక
మొక్కొక్క గడియలో నుక్కడచునట్టి 3279
అయుత శీర్షుల రెటిహస్త పాదులును
నియతి వేగులు రక్త నిబిడకేశులును 3280
అనల నేత్రులు మహా హంకార యుతులు
ఘనసింహ పక్షాదిఘనులపై ఘనులు 3281
ధృవ లోకమును మించు దీర్ఘ కాయులును
భువనముల్ నింపారి పొల్చుటగాంచ 3282
కొండలై వాహొప్ప గొట్టె పిల్లలుగ
నుండిరట భూతాదు లోపగా లేక 3283
వీరవాహుం డాది వీరులా ఘోర
తీరునకు భీతిల్లి తిలకించు చుండ 3284
ఆ నిశాచరు లెల్లరా గుహుంబట్టి
బూన కృద్ధుండౌచు పొంగిసేనాని 3285

## గుహుడు రాక్షస కోట్ల నురుమాడుట

తనమూలశక్తి తత్వము ననుష్ఠించి
గుణనాద మొనరించ ఘూర్ణిల్లె జగము 3286
అంత వజ్రపు రవ్వలన బాణ ధాటి
యంతకంతకు హెచ్చగా గుహుండేయ 3287
కరశిరః పదముఖాంగకములు రాలంగ
కరితురగోష్ట్ర సంఘాతములు గూల 3288
ఛత్రకేతన చిత్ర చామరాదులను
ధాత్రి గొట్టుచు బర్వి దశదిశల్ వెలిగి 3289

భువిని నాకసమును బొంది యా పద్మ
భవుని లోకంబుగా బ్రహ్మాండ మెల్ల 3290
అంది పోవుచు నచ్చటచ్చటం గల్గు
నెందరో రాక్షసుల నేర్చి హతమార్చి 3291
శరజుని బాణముల్ సర్వమున నొప్పి
తరిగె నారాక్షసుల తలలెల్ల నరసి 3292
హరి యజాదులు గూడ హడలి చూడంగ
మరియన్య లోకాళి మనుజాళనులును 3293
మందలై దొమ్మిగా మరి గుహుం జుట్టి
సందివ్వకయె యేయ సర్వాయుధముల 3294
చిరునవ్వు నవ్వి గార్చిచ్చనగ లేచి
మరి సమీరుని గాంచి మనరథంబింక 3295
బరుపు చిత్రి విచిత్రి ఫక్కితోననిన
బరుప భూమ్యాకాశ బ్రహ్మాండ గతుల 3296
పటుతరంబుగ నస్త్ర పటలమున్గప్పి
కుటిలరాక్షస మహా కోటులను గూల్చ 3297
శవముల వట్టుగా జగమెల్లనిండ
అవిరళ సారమేయాళి శివాళి 3298
తినుచుండ శరజన్ము సర్వాయుధములు
ఘన మార్గమున బర్వె కర్బురుల్ బెదర 3299
శరజన్ము రథమొప్పె చదల మార్గమున
సురలు మెచ్చగ వాయుచోదకత్వమున 3300
గాంగేయు డట్లు రాక్షస కోట్లదాక
పొంగి రక్తపుటేర్లు భూమి యందుండి 3301
పాతాళమున కంటి బహు కబంధాది
జాతులెల్లను మెచ్చ జాలగా ద్రావి 3302
దనుజ నాశనమౌచు తావొదలినప్డు
గని యన్యజగములం గలుగు దైత్యులును 3303

పిచ్చటిల్లుచు వచ్చి ప్రేషణార్భటుల
హెచ్చి తాకుచు నుండ నీవు పుత్తుర్పించు 3304
విసుప కుండగనేసి వివిధాయుధముల
అసురులన్ బోకార్చ సతి రయం బొప్ప 3305
మరియు దోచుచునుండ మార్గణంబులను
నరికటి సర్వ లోకాళి మార్గముల 3306
పూని యేయుచు నుండ భూతేశు తనయు
బాణ ఘాతములచే బడు రాక్షసాళి 3307
యంగంబు లగములై యంతయు నింద
హొంగి రక్తము సర్వభూములను బర్వ 3308

## శూర పద్మాసురుని యుద్ధము

శూరుండు విలుగీటి శూరత్వ మొప్ప
తేను బోవగ నిచ్చి ధీరత బల్కె 3309
నాకు మరణ లేదు నాకులను గూడి
యాకరణి ననుదాక నెంచి రాక్షసుల 3310
నిర్జించినట్టి యీ నిన్ను నిర్జించి
నిర్జరాదుల గూల్తు నిముసమందనగ 3311
గాంగేయుడనె శూరుగాంచి యోదుష్ట
పొంగ బోకుము నిన్ను బోకార్తు నింక 3312
అనగ శూరుం డప్పుడధిక కోపమున
దన వింటి నెక్కించి దానవారులను 3313
ఘాత గణముల నేయ పొంగి వారెల్ల
శాత శిలీముఖాస్త్రంబుల నురియ 3314
అసురుండు వెసదున్మి యంత నేయంగ
వెసనిల్వగాలేక విరిగి పారంగ 3315
వీరబాహు ప్రముఖ వీరాధులెల్ల
శూరునేయ నతండు చొక్కించివారి 3316

వీరబాహుని నెత్తి వీచి యాళరజు
జేర జిమ్మగ చంద్రశేఖరుని పట్టి 3317
గర్జిల్లును దాక గర్వరాధిపతి
నిర్జరాధ్యక్షుని నియుతాంబకముల 3318
నేయ లోకమునెల్ల నెంతయు నిండి
పాయక లయకాలు పాశంబు లనగ 3319
బరగ నిర్జరులెల్ల బరగుట గాంచి
హరుని పట్టియు వాని నవని పాల్సేయ 3320
పందలు వేలు నాపై లక్షలిల్లె
సందడింపుచు నేయ చదల నిండంగ 3321
మరియేయ మరియేయ మంటలొప్పారె
శరకీర్ణమైయొప్పె సర్వలోకములు 3322
ఘోరుమావుల శంభు సూనుదేయంగ
శూరుదేసె సమీరు జొక్కగా నపుడు 3323
అపుడు విష్ణ్వాజ్ఞచే నగ్నిదేవుండు
సపచితంబుగ గుక్కుటాకారమౌచు 3324
ధ్వజముగా నొప్పారె బాహులేయనకు
నడయుడౌనట్లుగా నద్భుతరీతి 3325
కడమేఘమట్లుగా గర్జిల్లియపుడు
కడుకొని శూరు డాక్రందించి యేయ 3326
ఆదితేయులు భయంబందగా గుహుడు
ఆదిత్య మార్గంబు నందియేయంగ 3327
అంబరంబున వారి యరదముల్ తరణి
బింబద్వయంబుగా బేర్చ నార్చుచును 3328
చక్రంబులో నాగ చాలగిరగిరగ
విక్రమించుచు వాయువేగములతోడ 3629
పాతాళమాది స ప్తసావరముల
ఆతీరు సత్యాదులో నూర్ధ్వగతుల 3330

బ్రహ్మాండముల నెల్ల బరగి గర్జిలుచు
బ్రహ్మాండముగ ఘోర పౌరుషము దొప్ప 3331

సర్వ జగములు గూడ సంక్షోభమందె
నుర్వియుప్పర వీధు లుత్పాత లూగె. 3332

ఈతీరు నేట్లాడ హెచ్చి శరజుండు
పాతకా నిల్వరా పారిపోకనుచు 3333

అరదంబు తుత్తుమురు సన్నుదొనరించ
ధరణిపై నొప్పువాతం డేసె గుహుని 3334

బాహులేయుడు ద్రుంచి బహు మార్గణముల
బాహుయుగ్మంబుపై పఱువగా నవియు 3335

అతని కర్కశదేహమంటి పొడియౌచు
క్షితిరాల దనుజుండు చెలరేగి యేయ 3336

అవి వాని నంటకయె యణగి పోవంగ
నపగణింపక మాయ నంది యసురుండు 3337

ఎగిరిపోవగ గుహుండేగె వెన్నంటి
యగణితంబుగ దైత్యుడతలాది నిఖిల 3338

జగములన్నిటి దాటి చక్రవాళాది
యగము లన్నిట దోచ నంటి యాగుహుడు. 3339

సాయకంబుల నేయ శర్వరీచరుడు
ఆయోధన మొనర్చె బ్రహ్మాండమంచి 3340

అటకేగి శరజుడా యసురుని దాకి
చటులాస్త్రముల వాని సాధకమునేయ 3341

అతడు నాకంబంది యధిరథ స్మరణ
గతి జేసికొని మున్ను గ్రమ్మగా బడిన 3342

జగముల బలములం జరచరజించ
నగణితంబుగ దోచు నసుర సంఘములు 3343

బాణవర్షంబుల జా బరగించ గుహుని
గానబడయక పర్వి గణములేశ్వంగ 3344

ఈసపట్టియు నప్పు డీక్షణాగ్నులనె
నాశమున్గావించి నాకులుబ్బంగ 3345
తనచక్రి ఖడ్గాయుధంబులఁ బనుప
అనిధాత్రి నొప్పారు యఖిల రాక్షసుల 3346
నాశనం బొనరింప నాకారి విసిగి
పాశమొక్కటి మాయ బరగించియేయ 3347
విజ్ఞానమున దాని విధము దూలించి
ప్రజ్ఞచే ధాత్రిపైబడ దైత్యునేయ 3348
అంత శూరుడు బార నతని వెన్నంటి
వింతగానేయు చవ్విధి బోవ పోవ 3349
పరగ శూరుడు వేయుపై నెన్మిదైన
అరవింద జాండముల కరుగగా గుహుడు 3350
మరి వెంట నంటగా మనుజాశి కలగి
పరుగెత్తి తన వీర భవ్య మహేంద్ర 3351
పురమున కేగగా బోయె వెనువెంట
మరి శూరుడెదనెంచి మంతనోక్తముగ 3352
అతని మాతను దల్చ ఆపెయు రాగ
అతదేడ్చి తనుగెల్చు నట్లొనర్చుమన 3353
ఏర శూరా యిట్టు లెంత జేసితివి
తారక జిత్తునుందలచి యల్పునిగ 3354
వదలడురా కృత్తివాసు తనయుండు
అదను దప్పెర వినుమైన నొక త్రోవ 3355
మందరాద్రిని నొక్క మహనీయపాత్ర
యందుండు సుధదేగ సద్దాని పట్టిమ 3356
నీవారు జీవించ నేర్తురుర యింక
నీవారి గూడి నీనేర్పు జూపించు 3357
మనిచెప్పి యేగ నాయంబ వాక్యమున
దన గెల్పు నిజమంచు దనమది నెంచి 3358

అతడింద్రలోకమౌ నరదముసలచి
క్షితిధరంబును గూర్చి జెప్పి తెమ్మనగ 3359
క్షణము లోపల వేగ గాలి మాత్రమునె
అసుర పుత్రాదులౌ నందరు లేచి 3360
గదుర ఘోరి కతండు గని పొంగి యొక్క
మదపు సింగము నెక్కి మార్కొనియె పుత్ర 3361
పౌత్రానుజుల సర్వబలములం గూడి
శాత్రవులగాంచి నిర్జర భూతతతులు 3362
పటులై హడలెత్తి పాఱుచుండంగ
ఆక్షణంబున నెంచి యమర సేనాని 3363
పశుపతాస్త్రంవేయ బహుళప్రముఖులు
దిశలెల్ల దీపించి దివ్యాస్త్ర తతుల 3364
ఫాలాగ్నులనుగూడ భస్మంబొనర్ప
ఆలోనె మాయమై రందరు గూడ 3365
శూలదొంటిగ నిల్పి సుత్రామలోక
పౌరథంబును బిల్చి యంబికాతనయు 3366
వీరగణముల నెల్ల విసరి బ్రహ్మాండ
పారణ్యముల మధ్యమంబు జేయుమన 3367
శరజుండు దివ్యాస్త్ర సమితిచే నిల్పి
యసుదైన నాయింద్ర యరదమున్ బిల్చి 3369
ఇక నీకు సేకూర వింద్రారి పనులు
ప్రకటితంబుగనంచు బనిపియావలకు 3370
అతని నేయగ నప్పు డసురుడేయంగ
నతి ఘోరమైన నాయసుబంతు వీక 3371
వాహనంబును డిగ్గి వడి శూలమెత్తి
బాహులేయుని వైవ పడగొట్టియతడు 3372
మించిలక్షలు కోట్లు మేటి బాణముల
నించి పంచాస్యమును నేలపాల్జేయ 3373

కాక ఘూక మయూర కంకాళ హంస
కాకోదరాది సంజ్ఞలహెచ్చి రిపుల 3374
చీకాకొనర్చి మూర్ఛిల జేసి మరియు
వీక రెక్కల గొట్టి విరిచి కొందరిని 3375
తుండాగ్రమున జీల్చి తునిమి కొందరిని
ఖండించి నఖపాళి గదిసి కొందరిని 3376
చరణ ఘాతములచే జదిపి కొందరిని
నురుమాడి నురుమాడి నూర్పిడి యొనర్ప 3377
శిఖిరూపమున నొప్పి జిష్ణుడేతెంచ
శిఖివాహనుండెక్కి జృంభించి దనుజు 3378
కరవాలమున నేయ కప్పురుండదరి
ధరరూపమును వేగ దాల్చియేతేర 3379
అబ్ధిరూపంబొంచు నద్దానిమ్రింగ
స్తబ్ధుడై దనుజుండు సాగరంబైన 3380
బడవాగ్ని రూపమై భక్షించె గుహుడు
కడువడి విలయాగ్నిగా నతడురాగ 3381
జలధారయై దాని జల్లార్చె గుహుడు
విలయ మారుతముగా వెడలె శూరుండు 3382
కలచె శేషుండౌచు గౌరీసుతుండు
బలముచే శూరుండు బహు మాయలిట్టు 3383
భూత ప్రేత పిశాచ భూరి శార్దూల
మాతంగ భల్లూక మహిష రూపముల 3384
డాల్చ తత్ప్రతియౌచు తారకాంతకుడు
గూల్చుచుండగ నిట్లు గూలుచుండంగ 3385
ఈ రీతిగా వార లేడహోరాత్రు
లారటింపుచు బోరి రమిత దర్పముల 3386

## గుహుని విశ్వరూప సందర్శనము

అంతపై శాంతుడై యపుడు డొప్పార
వింతగా గుహుడొప్పె విశ్వరూపమున 3387
పాద మూలంబులఁ బరగె శైలములు
పాదాగ్రముల నహిం పతులు నఖాళి 3388
ఉడు గణంబులు గుల్ఫ మొప్ప దిక్పతులు
తడయక జంఘాళి తనరగా మునులు 3389
జానువుల్ కల్పాగ్ర సంస్థమై తోప
బూది యూపపులయ్యె బోసగ దిక్పతులు 3390
జఘన సంధుల యందు ఛాలె రుద్రాళి
జఘన భాగంబందు సప్తముని వసులు 3391
పక్ష పార్శ్వములందు బరగె మూర్తులును
వక్షస్థలంబున స్వరలె శాస్త్రములు 3392
దిక్కుపల్ మేఢ్రమై దివి గుహ్యముగను
అక్కజంబున నాభియయ్యె నాకంబు 3393
విజ్ఞాన మొప్పె నా విమల రూపమున
యజ్ఞోపవీతమై యలరె గుణాళి 3394
రోమంబులం దొప్పె రూఢిగా సృష్టి
ఆమహాస్థలములె హస్తంబులయ్యె 3395
భుజములందున నాత్మ భూవిష్ణులొప్ప
నిజముగా గళమందు నిల్చె కాలంబు 3396
వదనమందున వేద వరము లుప్పొంగ
నుదయించె నోంకార మొప్పి మూలమున 3397
తరణి చంద్రాగ్నులత్తటి నేత్రములుగ
అరయ మంత్రములెల్ల నాతని కళగ 3398
శ్రవణముల్ దిక్కులై చాలగా సృష్టి
తిపుర సంకల్పమై దివ్యతేజమున 3399

కోటిప్రభాకరుల కోటిశశిధరుల
గోటి సంతాపుల గోటితో మీటి 3400
పరమచిచ్ఛక్తి సుబ్రహ్మణ్యుడైన
సురలెల్ల నుతియించుచుండ జూచుండు 3401
కాంచి నిర్విణ్ణుడై జ్ఞాన మార్జించి
యెంచె దనమనమునం దిట్లుదేవాజ్ఞ 3402
తనతేజమున నాదు దైత్యమాయలను
పనిగొన్న యపుడైన బడయగానైతి 3403
హరిముఖాదులదెల్పి నపుడైన వీని
నెఱుగ లేకుంటినే నెంత ఱుబ్బుండ 3404
ఇతడు డింభకుడంచు నెంచితినిగాని
గతిలోకములకంచు కానలేనైతి 3405
మూడుమూర్తుల కాదిమూర్తి యితడన్న
జాడయే నెంచక జడబుద్ధినైతి 3406
ఐశ్వర్య మదమున న్నలరు నాకెట్లు
దృశ్యమౌ నా మహా దివ్యమహిమంబు 3407
నా యేలుబడి యిట్లు నటియించి నన్ను
ఈ యవస్థకు దెచ్చె యింతయేమిటికి 3408
వేయుపై నెన్మిది వెలయు లోకములు
ఆయత్తమయ్యె నీయయ్యయందిపుడు 3409
ఈ మహామహనదై యెసగు తేజంబు
నా మనంబున నేడు నాటె నిజముగను 3410
నా తపానికిమెచ్చి నను రక్షసేయ
ఈ తీరుగా నీత డెసగెను గాన 3411
ఇతనికి నతిసేయ నెంచె నామనము
గతి ఈతడే యంచు గలిగెను నాకు 3412
ఐన నీ ఫలమెల్ల నమర నాయకుల
పూని శిక్షార్హుల న్బాన చేయుటయె 3413

నీ మహాదర్శనం బెసగగా నింక
నా మహాదోసముల్ నశియించె నేను 3414
అని యిట్లు తలపోయు నట్టి కాలమున
తన రూపమును మార్చి తనపూర్వరూప 3415
మున నిల్వ శూరుండు మొదటి యట్లౌచు
అని యొనర్తు నటంచు హంకారమంది 3416
తనమాయచేనట మహాంధకారమును
గన జేసి ఘోరమౌ కాయమేపార 3417
అదితేయుల హతంబార్చ బైకొనగ
నాదిక్కుగాంచి తన యందైన శక్తి 3418
ఆవాహనముజేసి యసురుని జంపు
మీవంచు బంపనది యినకోట్లతేజ 3419
మనలార్చుతంబుగా నంధకారమును
దునియించి రాక్షసుని దునుమరా గాంచి 3420
వనధియందున జేరి ఫలపుష్పయుక్త
ఘనవృక్షమయ్యె లోకమున కన్మొరగి 3421
అది మహాద్భుతముగా నఖిల లోకముల
బొంది జృంభించగా భూరిగుహశక్తి 3423
మూలముల్ దెగనేయ మొదటిరూపమున
శూల మొక్కటి దాల్చి శూరుడేతేర 3423
చిటపట ధ్వనితోడ చెలగియాశక్తి
పటపటాంచితముగా బ్రహ్మాండమదుర 3424
అదితులెల్లరు మెచ్చ నసురుని యురము
గడిసి ఫట్టున జించి కాశ్యపిపైచి 3425
ఈ వియద్గంగలో నవగాహనంబు
గావించి గుహునిలో గలసె నాక్షణమె 3426
అంత శూరునిశవం బందుండి కేకి
వింత కుక్కుటములై వెడలి యా గుహుని 3427

పాదంబులను వ్రాల బాహులేయుండు
ఆదరింపుచు వాటి నగ్ని వాసవుల 3428
కవగతం బొనరించి యఖిల లోకముల
కవగతంబుగ నప్పుడాకుక్కుటమును 3429
ధ్వజముగా సల్పి యావల మయూరమును
నిజవాహనము సల్పి నిర్జరుల్ పొగడ 3430
వీరబాహుండాది వివిధ సేవకులు
తారకజిత్తు నత్తరి వేడ్కగొల్వ 3431
ధాత విష్ణ్వాదు లందరు గాంచి మ్రొక్క
ఆతండు దయతోడ నందరిని గాంచె 3432
వారు లేప్పుచు బోయి షాణ్మాతురుండు
శూరుని జంపిన చొప్పెరింగింప 3433
అతని పట్టపుదేవి యగు పద్మకోమ
లల ధాత్రిబడి సాధు లక్షింప నేగె 3434
అతని పుత్రుండు మున్నబ్ధిలో జొచ్చి
బ్రతికి మీనంబైన వరహిరణ్యుండు 3435
జనక ఘాతలనట్లు చనిపోవు టెరిగి
తనవారికై దుఃఖ తప్తుడై తుదకు 3436
ధ్వజవాహనములుగా తండ్రి జీవాత్మ
భజియించు టెరిగి యావనికి మోదించి 3437
తనవారికెల్ల నూర్ధ్వ క్రియల్ సల్పి
చనికావ్య శిష్యుడై చాలవిజ్ఞాన 3438
మును బొంది తపియించి మోక్షమార్గించె
తననులోకంబెన్నదైవాజ్ఞ కతన 3439
వీరబాహుని బిల్చి విబుధ సేనాని
శూరనిర్బంధాన శోకింపుచున్న 3440
అట్టి జయంతాదులైన నిర్జరుల
కట్టులన్ విడుపుమీ కాగనాయాజ్ఞ 3441
అన నాతడప్పుడే యట్లొనర్పంగ
ఘనమైన గుహునాజ్ఞగా వారలొప్ప 3442
అమృతము గురియించి యా జన్య ధాత్రి
గమనించి తనపక్ష ఘనుల నందరను 3443

జీవింపగా జేసి శివ శివాత్మజుడు
ఆపీఠ మాహేంద్రి మబ్ధిలో జేర్చి 3444
సురఘాత జాలముల్ జుట్టి సేవించ
గరిమ జేరెను సంధి ఘన పత్తనమును 3445
ఆరాత్రి వసియించి యరుణోదయమున
గౌరవంబున సర్వ గణయుతుండౌచు 3446
తనమయూరము నెక్కి తగ సముసంబు
లను గాంచుచును బోయి లక్షించి వేడ్క 3447
అపరశైలంబునం దతడుండ గోర
సపుడ దేవతలెల్లరా విశ్వకర్మ 3448
గన నాతడానగం బందు సుద్యాన
మణి విరాజిత దివ్య మహిమ కల్యాణ 3449
గోపుర ప్రాకార కుడ్యాంచితంబు
దీపిత ఫలపుష్ప దేశీయ వస్తు 3450
విరచితంబౌ పురము వేడ్క నిర్మింప
పరివార యుతముగా బాహులేయుండు 3451
అందు దానివసించె హాయిగొల్పంగ
బృందారకులు గోర పురుహూతు డపుడు 3452
భావమందున నెంచి వర నిజపుత్రి
దేవసేనను దెచ్చి దివ్యసేనాని 3453
కియ్యవేడగ నాత డెంతయు నొప్ప
అయ్యెడ సురశిల్పి యట దివ్యరత్న 3454
మణులచే కల్యాణ మండపం బొంది
గనజేయగా దివ్యగణము మౌనులును 3455
మరిలోకముల నొప్పు మహనీయులెల్ల
హరి శతానందాదు లైన సురవరులు 3456
రాగ దివ్యాసనాల్ రహిసిచ్చు నంత
వేగ వచ్చిరి యుమాభీము లావట్ల 3457
తలిదండ్రులకు మ్రొక్కి తారకాంతకుడు
నలరించె తనతండ్రి నంబను గూడ 3458

## కుమార స్వామి వివాహము

దివ్య వాద్యములెల్ల ధిమిధిమిమ్రోసె
దేవదేవాదులకా దీర్చి మోదించ 3459

సురసురాదులగూడ చూచి సేవించ
నరసి సంయమిలోక మాశీర్వదించ 3460
గంభీరముగ దేవ గానముల్ హెచ్చ
రంభోర్వసులు గూడి రక్తిగా నాడ 3471
అరుణ చంద్రులు ఛత్రి మచట బట్టంగ
వరుణ దేవుడు బార్శ్వ వర్తియై కొలువ 3462
మాతరిశ్వుండు వింజామరం బేయ
పీతాంబరుడు హెచ్చుప్రేమ జూపింప 3463
పరమేష్టి లోనైన బ్రహ్మ లెల్లరును
వరుసగా వేదాశీ పనపల జెప్ప 3464
తక్కిన దిక్పాల తతులు మోదమున
చక్కబెట్టగ పెండ్లి సామగ్రిలెల్ల 3465
వీర బాహువు భక్తి మెల్ల పూజించ
వారక నవలక్ష వరులు గీర్తించ 3466
అల సురాంగన లెల్ల రారతుల్ బట్ట
నలుప నృత్యంబు లప్సర లెల్ల లక్ష్మి 3467
వాణితోగూడి దివ్యముగ కల్యాణ
గానంబొనర్పగా గాంచి మఘవుండు 3468
అంచితంబుగ లోక మంతయు మెచ్చ
క్రౌంచఘ్ను పాదముల్ గడిగి యాతీర్థ 3469
మును తాను బొంది సమ్మోద మేపార
ఘనుల కెల్లరకిచ్చి కార్తికేయు నట 3470
గంధపుష్పాక్షతా గరు ధూపదీప
సందీప్తుగా జేసి సాగిలిమ్రొక్కి 3471
మధుపర్క మిచ్చియా మహదేవు సుతుని
వధువుతో గూర్చగా వాణీశు నాజ్ఞ 3472
గళమున దివ్యమాంగల్యముం గట్టి
కలప పుష్పమాల కంఠమందిడగ 3478
శతమన్యు పుత్రియా సభయందు దివ్య
పతిమ్రొక్కి వైచె నొకమాల గుహునకును 3474
అవిరళంబుగ నగ్ని కట ప్రదక్షిణా మించ
ధవు పత్నులకు నరుంధతిని జూపించె 3475

తలిదండ్రులకు మ్రొక్కి తన్మయుండౌచు
పలికి వారల గ్రుచ్చి యీ శిస్సులిడిరి 3476
ఆశర్వ శర్వాణు లాహ్లాదమేగ
ఈశ పట్టిను భక్తి యెసగగా సర్వ 3477
విభవముల బూజించి పెద్దలనెల్ల
రథమెక్కి పీను సారథ్య మేపార 3478
తనయ తమ్ముల ననియించు వేడ్క
మనమున దలపోసి మఘవునితోడ 3479
అమరావతికి జేరి యచట సౌఖ్యమున
నమరాళి సేవించ యానంద మొప్ప 3480
సురగణ యంతాది సంవృతుండౌచు
పరిహాసముల నొప్పు బావలతోడ 3481
గంధర్వ గానముల్ గాంచి మెచ్చుచును
బంధురంబగు నాట్యపంక్తి గనొనుచు 3482
ఇంద్రోపచారంబు లెన్నొ గైకొనుచు
ఇందిర బ్రహ్మానంద ఈశ్వరానంద 3883
ములపొచ్చి పత్నితో మోదమేపార
గలసి కొన్నాళ్ళుండి ఘనవాస మరుగ 3484
తలచ జిష్ణుండను తన పత్నితోడ
పిలసిల్లి సాంధిగ వీరబాహుండు 3485
శక్తితో సేవించ బంధువుల తోడ
శక్తిధరుడును వేడ్కఁ జనె వాసమునకు 3486
ఇది కథా సారాంశ మెంతయు దీని
బమిపు వారును భక్తి శాలురై వినెడి 3487
వారు వ్రాసెడి వారు వర్ణించు వారు
వారు వారల గొల్చువారు తద్బంధు 3488
వర్గంబులును గూడ వసపగా వేడ్క
నిర్గమింతురు శక్తి నెలవున కొప్ప 3489
అంతియేగాక నీయవని యందొప్ప
అంతకాలముగూడ నైశ్వర్యసిరుల 3490
పలు చుండగ వారి వంశంబు నందు
కరుణించి చిచ్ఛక్తి కలిగి యొప్పారు 3491
అయ్య మీకెల్లరకు నంజలి మొనర్చి
నెయ్యంబుగా దీని నిలుపుచున్నాడ 3492

ఇది శ్రీ నందూరివంశ పయఃపారావారరాకాసుధాకర బుధజన విధేయ నృసింహయామాత్యపౌత్ర శివరామయామాత్యపుత్ర లక్ష్మీనరసింహరాయ కవి విరచితంబైన శ్రీ శ్రీ శక్తి పురాణమందలి అంత్యభాగము

సమాప్తము

మాతృశ్రీ ప్రింటర్సు, బాపట్ల. ఫోన్ : 68

జనకు డుండెనె వాని సము లెవ్వరుండ్రి
కనుక బంధువు లెట్లు కలుగు చుండెదరు 1986

నయమున నాథాధి నాథుని గాంచి
భయమంద కుండునె బ్రహ్మాండమెల్ల 1987

శాశ్వతుండును జగచ్చయ నేతయైన
యైశ్వర్య దనువాని కధికమెందుండు 1988

శిక్షింపదే కర్త క్షితి దుష్టజనుల
దక్షుండొ నర్చదే త్ర్యక్షరహితముగ 1989

జన్నంబు శ్రుతి వీడి చపల మార్గమున
గ్రిన్నన దిట్టదే కాలకంధరుని 1990

పరమేష్ఠి బొంకడే పశుపతి ముందు
మరి కాలుడును నేనె మహిముడ ననడె 1991

అనుమానమేల నా యభవుని దూరు
పని మృత్యు రూపమై పడువెంట జగతి 1992

అతని మహాశక్తి నర్చించు పనుల
కతన సర్వంబును గాంచు నెవడైన 1993

అనవొప్పి వారికా యమ్మయుమ్రొక్కి
తనతప్పు మన్నించ తగవేడికొంచు 1994

సర్వమంగళ నియ్య సమ్మతించంగ
గీర్వాణ వాద్యముల్ గెలకులమ్రోసె 1995

అంత ప్రహాసంబు నటసేయ మౌని
సంతతుల్ వేర్వేర సతులను గూడి 1996

చక్కని ఫలమూలా సర్వమంగళకు
నక్కజంబుగ నిచ్చి యంతరంగముల 1997

జననిగా భావించి శర్వు కామినిగ
కని యక్షతల జల్లగా నగేంద్రుండు 1998

మోదించి భక్తితో మ్రొక్కి శుభలగ్న
మానసంబున దెల్పు డనగ వారెంచి 1999
మానక శశి యక్ష మంగళప్రదము
మౌని శాంతన మైత్రి లోదవి జామిత్రి 2000
గుణశుద్ధి నొప్పు ఫల్గుణి యందు మకర
ఘన లగ్నమై యొప్పు గౌరీ వివాహ 2001
మని తెల్పి వారెల్ల నతని వీడ్కొనుచు
చనిరి కైలాస మా శర్వునకు దెలుప 2002

## గౌరీశంకరుల వివాహ ప్రయత్నము

అంత నా హిమవంతు డాప్తులతోడ
మంతనం బొనరించి మైనాకు గాంచి 2003
ఓ కుమారా యిద్ది యొప్పు శివమౌను
లోక సర్వస్వ మాలోకింప వచ్చు 2004
లోప మింతగరాదు లోకోత్తరమును
ఈ పెండ్లి మనము గావింపగా వలయు 2005
అని తెల్పి బుధ శిల్పి నప్పుడ బిలిచి
వినిపింపగా నతడు వెంటనే పూని 2006
వైశాల్యమై రత్నవర చిత్రితముల
కౌశలంబైన ప్రాకార ముల్గలుగ 2007
సురుచిర నవరత్న శుభతోరణముల
కరము శోభిలు గవాక్ష ద్వారములును 2008
వెలుగు ముత్యాల సద్విధ చిత్రితముల
లలితమై యొప్పారు లావణ్యములను 2009
రవిబింబ ముంచిత ప్రాకార దీప్త
ధవళమై యొప్పారు ధ్వజచిహ్నములును 2010
కలుము లొప్పారు చక్కన పద్మరాగ
ముల కోటి సూర్యసమ్ముదమైన పెండ్లి 2011

మండపంబు ఘటించి మధ్య నవరత్న
మండిత పీఠముల్ మత్స్యాకృతముగ 2012
వేది యొందొనరించి విలసిల్లు నట్టి
ఆదర్శితము లెన్నో యమరించ మించ 2013

## గౌరీదేవిని పెండ్లి కూతును జేయుట

హిమవంతు నాజ్ఞచే నిందీవరాక్షి
యుమ పెండ్లికూతుగా నొనరించ నెంచి 2014
మంగళోచితమైన మగువ లగ్నమున
మంగళ వాద్యముల్ మరిమరి మ్రోయ 2015
నమరు పీఠిని ప్రాఙ్ముఖాసీన జేసి
ప్రమద లొప్పగ బాడి రమణీయముగను 2016
సంపంగి నూనెతో సర్వమంగళకు
ఇంపుగా దలయంటి యిడిమేన నలుగు 2017
ఘనమైన శ్రీ గంధకలివోసి కురుల
కొనగోరులను దువ్వ కోర్కెతో జలక 2018
మండపంబున నొక్క మణిపీఠమందు
హండోదకములతో నపుడు శాంకరిని 2019
జలక మాడగజేసి సర్వ తీర్థముల
జలముచే పరిశుద్ధ శాంతి గావించ 2020
పరిమళంబుల గూర్చి బ్రాహ్మ సూక్తముల
విరివిగా పఠియించి వృద్ధ విప్రులును 2021
ముని పత్నులును దైవముదితలు గూడ
అనువైన యా వటము లాపె కొనగూర్చి 2022
అంత నల్లన దేహమందు దడియొత్తి
వింత కౌశేయ మాపెకు గట్టనిచ్చి 2023
వరపీఠి నుంచి యా వపు పంకమలది
సరసిజ ముఖులెల్ల సరసోక్తులాడి 2024

మొలుపారు నూపురంబుల బెట్టి యంత
సలలితంబగు కాంచి జఘనమందొప్ప 2025

కలితకేయూరకంకణ హారతతుల
నలరించి బహువిధంబైన భూషలను 2026

మణిమయంబైన కమ్మలు వెల్గ చెవుల
నొనగూర్చి మణిసత్తు నొప్పగా జేసి 2027

సర్వావయవముల సరగ నీరీతి
సర్వజ్ఞు పత్నిని సరిపి మోదమున 2028

విరిమాలలను వైచి విరిబోడులెల్ల
మెరుగు కజ్జలమును మృదువుగా బెట్టి 2029

పచరించ తిలకంబు ఫాల భాగమున
సచరాచరంబెల్ల శాంకరిని గాంచి 2030

సొమ్ము లీయమ్మకే సొబగొన గూర్చు
సొమ్ముల కీయమ్మ సొమ్ము సుమ్మింక 2031

గిరిశున కీపెయే గృహిణియౌననుచు
మురియగా గిరిరాజు మునులతో గూడి 2032

అరయగా కైలాస మపుడేగుదెంచి
కరమొప్ప నందీశు గాంచి తదాజ్ఞ 2033

చని సనకాదు లచ్చట గొల్వ దివ్య
మణి పీఠమున నొప్పు మహనీయుగాంచి 2034

ప్రణుతించి దేవ నాభాగ్యంబు కతన
ఘనమైన మీసేవగాంచి నానింక 2035

రక్షించి పెండ్లికై రమ్మ నాపట్టి
నక్షయంబుగ వివాహము గమ్ము దయను 2036

అని వేడు గిరిరాజు హసనోన్ముఖమున
గని యట్లయని మహా కరుణతోననిపి 2037

హరుడంత నందీశు నప్పు డీక్షించి
ధరపిపీలికలాది ధాతయగుదాక 2038

## శివుని పెండ్లికై నందీశ్వరు డందరిని పిలుచుట

పిలుపు లేదనువారు పృథివి లేకుండ
పిలుపుమీయింక నాపెండ్లికై యనిన 2039
అతడు కన్నులుమూసి యాత్మలో సర్వ
మతికించి యేకాగ్రుడై మహాభక్తి 2040
అణువునంటుచు ధాతనందెడుదాక
గని సర్వమును భర్గు కల్యాణమునకు 2041
దండోయనుచు బిల్వ రసిావచ్చిరెల్ల
మండలాంచితులును మంత్రించినట్లు 2042
మణి మహాస్త్రశములు మకరాలయములు
సరితులు గిరులును సరగ వృక్షములు 2043
వనదేవతలు సర్వ పశుపక్షిలోహ
ఘన బలాహక కలాకాష్ఠముహూర్త 2044
దినయామ ఋతుపక్షతిథి మాసవర్ష
లౌనరగా ప్రళయంబులోజయుగ్మములు 2045
ఇల మహాక్రతులును ఇంద్రియంబులును
కలమంత్ర తంత్ర యజ్ఞములు పుణ్యములు 2046
ధర్మార్థ శౌచ శాస్త్రములు సత్యములు
కర్మలు భూతముల్ కారకంబులును 2047
ఏమని చెప్పుదు నెంత వర్ణింతు
నీమెయిసర్వంబు హేరాళముగను 2048
అవిరాళానందంబు లంది శివశివుల
శివము గాంచగరాగ శివుని శైలాది 2049
ఒక్కొక్కరినిశర్వు కౌనరగాజూపె
చక్కగా వేర్వేర చరితముల్ దెలిపి 2050

హరుని కటాక్షంబు నందజేయుచును
మరి వారలిచ్చు సన్మణిహారరత్న 2051
భూషణాదులు శర్వు భూనజేయుచును
తోషణంబై యుండ ద్రుహిణాంత మొప్ప 2052
కరము కైలాసంబు కళకళలాడె
మొరసె కాహళఢక్క మురజడిండిమలు 2053
పరమేష్ఠిలోనైన బ్రహ్మలరుదెంచి
తరియయ్యె జాగేల తర్లుకీ యనగ 2054

## ఈశ్వరుడు వివాహమునకై తర్లుట

నిస్సాణశృంగాది నిర్ఘోషలెల్ల
దుస్సహంబుగ మ్రోయ దూలెశేషుండు 2055
వేణువీణాంచిత విద్యాధరాది
గాన నృత్యాదులు క్రమముగానొప్ప 2056
రజతాద్రి నొప్పారు రవముచే నాడు
గజిబిజియయ్యె లోకములెల్ల నంత 2057
మార్గంబులను పంకుమదగంధ తావి
నిర్గమించగ శోభ నేత్రమౌచుండ 2058
కలితమౌ తావి మార్గముల సచ్ఛత్ర
ముల నీడలను జిత్రముగ వచ్చువారు 2059
మరిమనోవేగ సమ్మానితంబైన
హరులపై దామెక్కి యాడించువారు. 2060
కైలాస తుల్యమౌ ఘన మదేభముల
చాలనొప్పుచు ప్రక్క సాగెడివారు 2061
నిస్తంద్రముగ నొప్పు నియమానుకూల
స్వస్తి సూక్తంబుల జదివెడివారు 2062
పసిడి బెత్తంబులు బట్టి పార్శ్వముల
సమితి నట్టిట్టుగా సర్దెడువారు 2063

లలిత గంధర్వమేళములొప్పు చోట్ల
నలలిత విశ్రాంతి సరిజూపువారు 2064
ఈతీతి వారెల్ల హిమగిరి జేరి
జారుభూరౌనట్లు బాకాలనూద 2065

## శివుని కళ్యాణ ఘట్టము

హిమవంతుడెఱిగి దా నెదురేగుదెంచి
క్రమముగా వరపూజ గావించిదెచ్చి 2066
ఘనమైన విడుదలం గ్రాలజేయంగ
సనకాదులట లగ్న సమయమ్ముదెలుప 2067
ఘనరత్నమయ పాదుకాదులన్ దాల్చి
దినకరాంచిత కోట్లదివ్య తేజమున 2068
శృంగద్వయ విరాజచిత్ర నవరత్న
సంగతుండును భూష భూషితాంగుండు 2069
నైననుక్షంబుపై నభవుడొప్పంగ
పూని బ్రహ్మాదులప్పుడు వేదసూత్ర 2070
ములజెప్ప దేవతామునినాథులెల్ల
సలలిత లాజ లక్షతల జల్లంగ 2071
హారతుల్ బట్టగా ఆనందమొప్ప
నారదాదులు మహానందముగపాడ 2072
అంతలో గిరిరాజు యఖిల బంధువుల
నెంతయు గొనియేగి యీశ్వరునిగూడ 2073
గోపురప్రాకార కూట సౌధముల
సోపానముల దాటుచును బోవుచుండ 2074
హిమవంతు జామాత నీక్షించువేడ్క
తమ మహాదివ్య సౌధములందు బొల్చి 2075
కని మనపుణ్యంబుగాదె యీ భర్గు
ఘనము గాంచితి మంచు మదిపొంగువారు 2076

వాహ్వా యెంతటి భాగ్యవంతుడీ పర్వ
తాహ్వయుండీ యల్లు నందెననువారు 2077
అంబకెంతటి భాగ్యమబ్బెనో గనుడు
అంబరకేశ మోహపు రాణియయ్యె 2078
ననువారు హిమవంతు యల్లుని వేగ
కనువేగమున నలంకారముల్వార 2079
కొందరప్పుడు చీరకొంగులన్నీడచి
నందిళ్ళకాంచీల సవరించి కొనుచు 2080
కొనగోళ్ళకాటుకల్గొని దాని మరచి
యునుచుచు వస్త్రాల నురికెడివారు 2081
కురుల బుష్పంబుల గూర్చుచు లేచు
తరి ధాత్రిరాలు గొందరు బయ్యలెత్త 2082
పతుల కౌగిళలాపి పరుగెత్తు వేగ
గతికి పైటలు జారు ఘర్మముల్ గ్రమ్మ 2083
నీరీతి వారెల్ల రీశుని గాంచ
గోరి సర్వస్వమా గోలలో మరచి 2084
అల్లదే హిమవంతుడవ పుణ్యవంతు
డల్లునిగాగాంచె నీ యభవు ననుచుండ 2085
గిరిసుతా గిరిరాజు గేహ మధ్యమున
కరిగి యుక్షంబు నందుండి దిగిన 2086
హరిరత్నమయ ములౌ నట్టి పాదుకల
బరువ నధిష్ఠించి వానికై దండ 2087
గొనుచు మైనాకుపై కుడిహస్తముంచి
చనుచుండె సురలెల్ల జయజయ మనగ 2088
అంతకాంతకు నగ్రమందు శైలాది
యంతలో ఘనవేత్రహస్తుడై యొప్ప 2089
శివుని వాక్యములకై సెవియొగ్గిపద్మ
భవుడు నమ్రతతోడ పల్కుచుండంగ 20:0

అరిగి కల్యాణ గేహద్వారమందు
హరుడు నిల్వగ నెల్లరపుడంచితముగ 2091
హరునకు నర్ఘ్యపాద్యంబులు నొసగి
మరి హారతులుబట్ట మహనీయమునను 2092
కక్ష్యాంతరములెల్ల గడచి తద్గేహ
కక్ష్య మణిమయములై గ్రాలుకంబముల 2093
తరణికోటిప్రభల్ తనరు నవరత్న
గరిమ నొప్పు వివాహ గద్దియనుజేర 2094
కాలాగ్నిలోనైన గణనాధులెల్ల
శూలి బరివేష్టింప సురలు లోనైన 2095
వారెల్ల వరుసగా బరగు పీఠముల
జేర ముత్తైదువల్ శివుని సన్నిధిని 2096
పాడ దివ్యంబుగా పెండ్లిపాటలను
వేడు లోకములెల్ల వృషభవాహనుని 2097
చేత గణపతిపూజ సేయించి మరియు
నాతల శుభకర్మలన్ని చేయించ 2098
మేనక లోకముల్ మెచ్చి బార్వతిని
పూని దివ్యాంబర భూషణోచితగ 2099
చేసి యుత్సవముతో శివవాద్యములను
భాసిల్లు కల్యాణపరగీతలొప్ప 2100
మెల్లమెల్లగ దెచ్చి మీఱు మోదమున
నల్లుని దరిని రత్నాసనంబందు 2101
నివసింపజేయగా నిండారుభక్తి
నవిరళానందంబు నందె జగమెల్ల 2102
సురలు మౌనులుగూడ చూడ గిరిరాజు
మరియు ధాత్రాజ్ఞ నా మహదేవుపాద 2103
కంజముల్ దివ్యోదకంబు దనపత్ని
రంజితంబుగపోయ రహితోడగడిగి 2104

తత్త్రయమును వేడ్క దనశిరంబందు
అత్తమేనక శిరంబందునను జల్లి 2105
శేషమా సభవారి శిరములజల్లి
పాషికంబులగట్టి భవ్యమంత్రోక్తి 2106
మధుపర్కములనిచ్చి మరి పుష్పమాల
లధికంబుగావైచి హారాదులొసగి 2107
రమణించు దివ్యధారా పూర్వకముగ
అమలత సల్పె కన్యాదానమపుడు 2108
అంతపై సర్వ వాద్యంబులట్ర్మోయ
సంతసంబున మహా జయనాద మమర 2109
పాణిగ్రహణమొప్ప వారగా శివుడు
ఘనభోంతరము లుప్పొంగగా జేసె 2110
ఈరీతి లోకంబులెల్ల నాయూహ
గౌరీవివాహ సంగతి మోదమయ్యె 2111
అచట బ్రహ్మయు వివాహంబందు నగ్ని
పచరించగాజేసి పరచి దర్భలను 2112
పరగ వహ్ని కుదీచిభాగాన దర్వి
మరి యాజ్యపాత్ర యామాడ్కి ప్రోక్షణము 2113
పూర్ణపాత్రయు నట్లుపూరించి కుశల
నిర్ణయంబుగనుంచి నెక్కొనుచునగ్ని 2114
మరిలాజలనుచేర్చి మంత్రయుక్తముగ
గరిమహోమంబొప్పు గలుగ జేయించి 2115
పదసప్తకము సతీపతుల బోజేసి
పిదప నార్యకరంబు భీముండు పట్టు 2116
గాజేసి యట సన్నెకలును ద్రొక్కించి
ఓజప్రదక్షిణం బొప్ప సేయించి 2117
ఉచితాసనంబులం దొప్పగా జేయ
సచరాచరంబెల్ల సంతసమునొందె 2118

పరమేష్ఠులును సురల్ పద్మనాభుండు
మరి మునుల్ గల సర్వమహనీయతతులు 2119
మ్రొక్కఁగా శివ శివుల్ మోదించి కరుణ
నెక్కొఁనకైలాస నెలవు జేరంగ 2120

## రతీదేవుని శివుడనుగ్రహించుట

తలచుచుండగను గందర్పు నర్ధాంగి
నిలచి దుఃఖించుచు నెమ్మిప్రార్థించి 2121
నంత మెల్లగనప్పు నార్యకనుసన్న
సంతసింపుచు రతీ సాధునీభర్త 2122
నీకు సాంగుండౌచు నిను మోదపరచు
గాగ నెవ్వారికిని గ ట్టకుండు 2123
పరగరాబోపు ద్వాపరయుగంబందు
హరియైన శ్రీకృష్ణుడైన తేజమున 2124
పొసగ రుక్మిణియందు పుత్రుడై పుట్టి
వసుమతిపై నొప్పు ప్రద్యుమ్నుడనగ 2125
ననిన రతీదేవి యపుడు మోదించి
తనభర్తతో నేగె దనలోకమునకు 2126
మరియు నాశివశేష మధుపర్కమెల్ల
హరియజాదులు భక్తినపుడు గైకొనగ 2127
గరిమ మోదించి యా గంగాధరుండు
మురియుచు నందీశుమూపురముపై దరలి 2128
యగజాత్మతోడ దన యావాసమరిగె
గగన మార్గమునందు గరుణతో చనుడు 2129

## శివ కల్యాణ ఫలితం

సూతడా మౌనులంజూచి యిట్లనియె
సీతీరుగా నొప్పు నీకు కల్యాణ 2130

మెవరేని భక్తితో నెలమిపఠించ
నవివేకియైన మహాపూజ్యుడౌను 2131
పుత్రార్థులకు గూర్చు పుత్రసంతతుల
క్షేత్రకాములకు క్షేత్రముల్ గూర్చు 2132
కన్యార్థులకుగూర్చు కన్యకామణుల
సన్యాసులకు మహాజ్ఞాన మొనగూర్చు 2133
ఈ విధంబున ధాత్రినెసగి యంత్యమున
దేవి సన్నిధులోడు తేజరిల్లెదరు 2134
ఇది విన్న మాధవుం డిందిరనుబొందె
నిదివిన్నవిధి వాణి నెంతయు బొందె 2135
తివిరె నింద్రుడు శచీ దివ్యనాథుడుగ
అపని గౌతమమౌని హల్యనటబొందె 2136
ఈ మహాత్మ్యంబునే నెంత వర్ణింతు
నా మహాపరమేష్ఠి కలవిగాదనిన 2137
అనగ మౌనులు పల్కిరా సూతుగాంచి
వినిపింపు శివగాథ విస్తృతంబుగను 2138
వ్రతములు క్రతువులు భవ్యయజ్ఞములు
క్షితి మహా తపములు క్షేత్రవాసములు 2139
ఎన్నియైనను దీనికీడౌనె ధాత్రి
అన్నన్న మాకిదేయౌను తపమనిన 2140
వినువారలీరీతి వీనులదోర్చ
వినుపించువారికిని విందౌనుగాదె 2141

## శివపార్వతులు సంతోషముగా నుండుట

వినుడిక పైకథా విధము వినుతు
మునులార బ్రహ్మ సమ్మోదమొదవిన 2142
శివుడంతిపుర ప్రవేశించి శివతోడ
నవరత్నసింహాసనములందు పరిము 2143

ఉద్యాన వనములం దొప్పు హర్మ్యముల
హృద్యమౌ దివ్య సెలయేటి పులినముల 2144
నగణిత సౌఖ్యంబు లందు చుండంగ
యుగములు క్షణములై యోగాడు చుండ 2145
అంత నాసురలెల్ల రపుడు వైకుంఠు
చెంత జేరగ నందు జిష్ణు డిట్లనియె 2146
శంకరుండనె మున్ను శర్వాణి గూడి
పొంకమ్ముగా నొక్క పుత్రునింగాంచి 2147
దుష్ట రాక్షసకోట్ల దునిశ్ఛదతు నంచు
కష్టముల్ మనకొప్పెగాని యూహరుపు 2148
ఈనరికి నాకృత్య మేమియుగూడ
వీనమేనియును గావింప లేదయ్యె 2149
అన విష్ణు డది నిజంబగునైన వాని
మనసెట్లు లుండెనో మఱి బరీక్షించ 2150
గల వాని బనిచి యా ఘను మార్గమెఱిగి
తిలకించెదము గాక తెఱగెద్దియైన 2151
ననయజుండది యట్ల యౌనంచు బవను
గని పల్కె నింకనీ కార్యంబు నీకు 2152
దక్కె నేరికిగాదు తప్పకుండంగ
ముక్కంటి గుర్తించ బోవుమా యనగ 2153
నాత డుల్కుచు బల్కె నాపుష్పబాణు
డా తీరుగా బోయి యధ్వానమయ్యె 2154
నట్టు నేనును బోవ యౌను రెండవది
గట్టువిల్తుని నాకు గాదు గుర్తించ 2155
అన కేశవుండనియె నంగజుం డపుడు
మునియౌచు సవకాది మునులతో గూడి 2156
యుండు నాతనిజేరె యువిదతో బోయె
మండె యాతనికొాదల్ మఱియట్లుగాదు 2157

భయము లేదిక నీకు భవుని మానసము
రయమున గుర్తించి రాగ నీకన్న 2158
ఘనుడెవ్వడును లేడు కార్యార్థి వగుము
పనుమన్న విధిలేక శ్వసను డొప్పి కొని 2159
ఘన మార్గమున నేగి కైలాసమచట
గని భయంబొప్పగా గంపించు మనము 2160
హరు నికేతనముకు కరుదెంచ గూఢ
చరుడై యోచించు నా సమయ మంచతని 2161
లీలలన్నియు నాత్మ లిఖియించినట్లు
శైలాది గుర్తించి చాలునో యనిల 2162
చోరుని రీతిగా చుద్ధాంత మిట్లు
చేరుదో యెదవేల చీ నిల్వు మనిన 2163
భయ విచేతస్కుడై పవమానుడపుడు
నియముగా వినతుడై నలుగడల్ గాంచి 2164
తెనరాక మూలమంతయు విన్నవించ
గని నోటమూసికొని కదలి పొమ్మనగ 2165
మరలి వచ్చిన సురల్ మహిత మోహమున
హరగౌరులెట్లుండి రన సిగ్గు పడుచు 2166
శైలాది నను నాచ శంభుని గనక
నీలీల మరలి యేతెంచి నా ననగ 2167
విబుధాళిఖిన్నులై విధిదూఱుకొనుచు
గబగబయేగి రాకైలాసమునకు 2168

## దేవతలు శివుని దర్శించుట

నందీశ్వరుండట్టి నాకులం గాంచి
ఎందుకిట్టులవచ్చి తీరు దెల్పుడన 2169
పలికె గోవిందుండు భర్గుగన నగ
సలలితా మోదుడై శైలాది లోని 2170

కరిగి దివ్యులరాక నంతయుదెలుప
మరి మోదమంది యామహాదేవుడపుడు 2171
రావించి పీఠముల రంజిల్లజేసి
మీవచ్చిన విధంబు మేలుదెల్పుడన 2172
నీకు వందనమయ్య నీ వన్నయట్లు
లోకరక్షణ యందు లోలుండవౌచు 2173
పుత్రునింబుట్టించి భూరి నిర్జరుల
శత్రులంబోకార్చు చాయ గనుమనగ 2174

## ఈశ్వరుడూర్ధ్వ రేతస్కుడై కుమారుని బుట్టించుట

కరుణించి యప్పుడా ఖండపరశుండు
తిరమౌ పరాశక్తి తేజంబు నెంచి 2175
మరి యూర్ధ్వ రేతస్సు మహనీయముగను
ధరియించి షడ్వక్త్ర ధారియై వామ 2176
భాగ మందున నొప్పు భగవతి న్గాంచ
నాగంతుకంబుగా నభవుతేజంబు 2177
కోటి సూర్యులకాంతి గోట మీటుచును
కోటిబడబాగ్నులం గుంటు వెట్టుచును 2178
దశదిశల్ బర్వి నత్తఱి సురల్ గాంచి
అశని పాతంబైన యట్లుగా బరవ 2179
వారి నెల్లరగాంచి వామదేవుండు
కోరి దానిని శాంతిగూర్చి దేవతల 2180
వాయు పవనులబిల్చి వహియించి దీని
నాయాజ్ఞగొనుచు గం[illegible] నదీ ముఖ్య 2181
కూల మందున నొప్పుగూరు శరమందు
చాలజేర్చుడటన్న చాల కున్నంత 2182
నగు మొగంబునగాంచి నాగభూషణుడు
అగు మీకుబలము నాయాజ్ఞచే ననగ 2183

అనిలాగ్నులప్పుడా యభవుని పదను
గొనిచచ్చి చెడి యెట్లొ గొనిపోయిపోయి 2184
మందాకినీ ద్వీప మధ్య స్థలమున
సుందరంబై మహా శోభతో నొప్పు 2185
శరకాననమునందు చక్కని కమల
వరమందు భవునాజ్ఞ వారుంచి రపుడు 2186
ఆశీయ తేజంబు నందుండి యపుడు
ఆరురంబుగ బుట్టె నారు వక్త్రముల 2187
ద్వాదశహస్తుడై పాదద్వయమున
నాదిచిచ్ఛక్తి మహామూర్తి యవుడు 2188

## షణ్ముఖుని షట్కృత్తికలు పెంచుట

అప్పుడా దివినుండి యలరులు గురిసె
గొప్ప వాద్యములనుగూడ మొరయంగ 2189
శౌరి షట్కృత్తికా సమితిని బిల్చి
మీరలీపని బాలు మించు ప్రేముడిని 2190
పాలిచ్చి పెంచుడది భవునాజ్ఞయనగ
పాలు చేపంగ నా పద్మాక్షులపుడు 2191
పాలిచ్చి పెంచగా బాలుడొప్పారి
చాల బెరిగెను శుద్ధ చంద్రుడో యనగ 2192
ఆరు రూపములతో నగుపించి యతడు
వారి దుగ్ధములెల్ల వరుసగాగ్రోలి 2193
శైశవ క్రీడల చాల నొప్పంగ
నీసు తేజంబిట్టు లెసగు చుండంగ 2194

## మణిపుత్రులును మఱి లక్షమంది జన్మించుట

ఘన దివ్యముని యేగి కైలాసమునకు
వినిచె పార్వతి కెల్లవిధము తెల్లముగను 2195

ఒకనాడు రుద్రాణి వ్యోమకేశుండు
ప్రకటితంబుగ నాద పాదమంజీర 2196
ఖచిత రత్నము లెల్ల గమన వేగమున
పరిచరించె ధాత్రిపై రాలి తేజముల 2197
పదిరత్నముల యందు బార్వతి కళల
పదిమంది కాంతలై భవుని గాంచంగ 2198
హాయని వారిని గాంచ నట్టి తేజమున
పరగ గర్భంబులా భామలకొప్పె 2199
అది గాంచి యాదుర్గ యనె నీపుతోడ
వదలకుండుడు గర్భ భారముల మీరు 2200
అని శపించగ నట్టి యతివల ఘర్మ
కణము లందున లక్ష ఘనులుద్భవించ 2201
వారలం గని మెచ్చి వామదేవుండు
వారి నా గుహునితో వర్ధిలగనించె 2202
ఆ రత్న సతులెల్ల రంత బార్వతిని
కోరి సేవించగా గొన్నినాళ్ళట్లు 2203
మీరు ప్రసూతలై మించుడీ యనిన
వార లట్లైనంత వరుసగానైరి 2204
రతన వల్లికి బుట్టె రహి వీరబాహు
క్షితినా బ్రవాళ కుక్షిని వీరహరుడు 2205
వీర మహేంద్రుండు వెలసె బౌష్యమిని
వీర మాహేశ్వరుడు వెలసె గోమేధి 2206
వైడూర్యమున నయ్యె వరపురందరుడు
పాడిగా వజ్రంబు వడసె రాక్షసుని 2207
మరకతంబున వీర మార్తాండుడయ్యె
మరి వీరకాలు డిమ్మహి కెంపునందు 2208
నీలమణికిని వీర నేత్రుడొప్పారె
నీలీల దీపించి రెలమివారెల్ల 2209

వీరలందరు గూడ వీరులై పెచ్చి
వారక భవునాజ్ఞ వర్ధిల్లి ధాత్రి 2210
ఆ మహాసేనాని కతి భక్తులైరి
ప్రేమతో నొకనాడు భీముడాగౌరి 2211

## గౌరీ శంకరులు కుమారుని గాంచ నేగుట

గాంచి పల్కెను ఇట్లు కడు ప్రేమతోడ
గాంచ బోదము నేడు గారవం బొప్ప 2212
మన కుమారుని దివ్య మహిమని యనగ
మనమున నుప్పొంగి మహనీయ గౌరి 2213
నంది వాహన మందు నాధుని తోడ
పొందుగా గుహుడొప్పు భూమిని జేరి 2214
దిగి నందిపైనుండి తేటతో నచట
తగుపుత్రు లార్వుర తనదు కౌగిలిని 2215
చేర్చగా నాక్షణమె చిన్మయత్వమున
పేర్చి యొక్కండుగా బ్రేమ దళుకొత్త 2216
ఆరీతిగా మోము లారు పది రెండు
గూర హస్తంబులు కూర్మితో గౌరి 2217
అంక స్థలిని జేర్చి యతి ప్రేమతోడ
పొంకించు జనుపాలు పొసగద్రావించె 2218
గరిమ నా చనుబాల కణములు పేక్క
నరయ బరాశరు దైవ శాపమున 2219
మును గంగ బడియుండు మునిసుతుల్ బొంది
చనిరి యాశాప మోక్షమును వారంది 2220
ఆకృత్తి కలగాంచి యనిమె శంభుండు
మీకృతంబున వీడు మించగా జేసి 2221
మహికార్తికేయ నామమును వహించి
బహు కీర్తివంతుడై భాసిల్లుగాక 2222

ఈ కుమారుని జన్మ మెవడైన వినిన
శ్రీకరంబుగ ధాత్రి జెలగి చిచ్ఛక్తి 2223
పరమ భక్తులరౌచు భవరహితులౌచు
నిరుపమంబౌ శక్తి నెలవు గాంచెదరు 2224

## కార్తికేయుని శైశవక్రీడలు

సర్వస్వరూపముల జాలుచిచ్ఛక్తి
గీర్వాణులను బ్రోవ గీర్తనీయముగ 2225
ఈశు పుత్రిత్వమున నెసగు నాగుహుని
శైశవ క్రీడల జాలవర్ణింప 2226
నా బోంట్ల కెట్లౌను నలువకేగాదు
ఈశాను విడచుచో నెసగదు శక్తి 2227
ఘన మహోన్నతశాఖ గలిగిన ఫలము
గొనవామనుండైన గోరెడులీల 2228
పూనుచున్నాడ నేపున బాల్యమందు
మానక చిచ్ఛక్తి మహిముడై యతడు 2229
పదునాల్గులోకముల్ బర్వులెత్తుచును
ఉదయించు రవిబింబ మొడిసి పట్టుచును 2230
తిరిగి పాతాళంబు ధీరత డిగ్గి
మెరసి భూలోకంబు మీది కెగురుచును 2231
కుప్పించి యా మేరు కూటాన దుమికి
యుప్పరంబున కేగి యూపి స్వర్గంబు 2232
కైలాసమునకేగి గంతువేయుచును
ఆలీల ధ్రువలోక మంటి యాడుచును 2233
సత్యలోకము జేరి చక్రిలోకమున
కత్యంతమున జేరి యందునిందనక 2234
చరియించె దన బాల్య చాపల్య మొప్ప
మరి దిగ్గజంబుల కా మార్కొని యేయు 2235

వాయు రజ్జువు దుర్చించి వాహ్వారేయనును
పాయక పరమేష్ఠి బట్టి యాడించు 2236
శేషుని గరుడునిం జేర్చి మోదించు
భాషించు గౌరితో బాలుడై యొకట 2237
ఐరావతమునెక్కి హరహరాయనును
మేరు భూధరమెక్కి మీటు శిఖరముల 2238
ఉక్షంబు మూపురం బూగులాడించు
శిక్షించు నొకపట్ట జేజేలనెల్ల 2239

## దేవతలు కార్తికేయుని స్తుతించుట

కార్తికేయుని బాధగనలేక దివ్య
లార్తులైయొక్కనా డతనినిజేరి 2240
నుతియించి రీరీతినోరులకొలది
క్షితినీవె గతినీవె చిన్మయమీవె 2241
భవభంజనమవీవె ప్రణవంబవీవె
అవతారములునీవె యఖిలంబునీవె 2242
భక్త రక్షణమీవె బ్రహ్మాండమీవె
శక్తి వంతుడవీవె జగములునీవె 2243
సృష్టిస్థితులునీవె జీవాళినీవె
స్పష్టంబుగా జగత్పాలకమీవె 2244
మముబ్రోవ శివశక్తిమహియందు బుట్టి
కామరొప్ప మాకొసగు కోర్కెలును నీవె 2245
ఈవెందుకీధాత్రి కెనగ వచ్చితివొ
ఆవివరమును జ్ఞప్తికైన జేకొనుము 2246
నక్తంచరుల బాధనలినలియౌచు
శక్తులుడిగిన మమ్ము చనునె బాధించ 2247
అనియేడ్చు నమరుల నాతడుగాంచి
తనదివ్యరూప మాతండిట్లుజూపె. 2248

## విశ్వరూప సందర్శనము

అతలాది లోకంబులై పదంబులుగ
వితత కూపారముల్ వెలసె వస్త్రముగ 2249
దిక్కులును శ్రోత్రములౌచు తేజరిల్లంగ
చక్కగా నాకమే చనె మస్తకముగ 2250
జలధరంబులు కేశ సమితి ధారలును
వెలిగె యా పూవులై విశ్వమే యాత్మ 2251
మతి భవానియు గాగ మరియు వైకుంఠ
పతి యజుండును వాని పార్శ్వము ల్గాగ 2252
వాక్కు భారతిదేవి భార్గవియె కళగ
అక్కరణి పవమాను డంత ప్రాణముగ 2253
తరణి చంద్రాగ్నులు తగనేత్రములుగ
గరిమ నాకాలుండు గాగ కోపంబు 2254
భుజగాధిపతి పాద భూషణంబుగను
రజిత గిరీశుండు రాజితంబుగను 2255
ఈరీతి బ్రహ్మాండమూర్తిగా నౌచు
మీరి భాస్కరకోటి మించి నిర్జ్వలను 2256
విపులమై యొప్పు తన విశ్వరూపమును
కృపతోడ నక్కార్తికేయుండు జూపి 2257
తన తేజమును గాంచి తన్మయంబందు
ఘన నిర్జరాదులం గాంచి యిట్లనియె 2258
మును నొకప్పుడు కేలు మోడ్చి మీరెల్ల
నను వేడ నేనంటి నాడు మీకిట్లు 2259
కైలాస వాసియై గ్రాలు శంకరుని
చాల హిమగిరి నొప్పు శర్వాణి గలువ 2260
వారికే జన్మించి వసుధ రాక్షసుల
వారటింపగజేతు నన్న పల్కునకు 2261

నేను జన్మించితి నిశ్చయంబుగను
పూని రాక్షస కోట్ల పొగరడతు ననగ 2262

## దేవతలు కార్తికేయునకు సేనాపతిత్వమును గట్టుట

సుమవర్ష మొప్పగా సురవీధినుండి
అమరవాద్యములెల్ల నప్పుడు మ్రోసె 2263

నారదాదులును గానం బొప్ప సేయ
హారతుల్ దివ్యాంగనాదులు బట్ట 2264

సురల నందర గూర్చి సురపెద్ద పలుక
మరి దివ్యులును గోరి మహనీయముగను 2265

విశ్వకర్మను బిల్చి వేడ్కతో ననగ
విశ్వమెల్లనుతించ వేగంబ యిట్లు 2266

మణిమయ ప్రాకార మహిత ప్రాసాద
మును సర్వ సౌభాగ్యమును గాంచినట్టి 2267

శోభితంబై యొప్పుచున్న ధ్వజములును
ఆ భోగ దివ్య కల్హార రాజీవ 2268

రచిత కాసారాది రమణీయములును
రుచిర విద్యుద్దీప రోచు లొప్పారు 2269

కళల దివ్యంబుగా ఘన రత్నచిత్ర
ముల నొప్పు మండపంబులు చప్పరములు 2270

రవికాంతులను వెల్గు రత్న పీఠములు
శివపుర జేసెను మహా దివ్యమే ననగ 2271

ఆనాడు బ్రహ్మాదులందరా పురిని
సేనాధి పతినిగా జేసిరాగుహుని 2272

సుమ వర్ష మొప్పె నా సురవీధినుండి
అమర గానములెల్ల నప్పుడొప్పార 2273

నారద తుంబురుల్ నర్మిలి బాడ
హారతుల్ బట్టగా నమరాంగనలును 2274
ఇచట నొక చిత్రంబు నెంతయు వినుతు
అచలమైయొప్ప నొక యద్భుత గాథ 2275
ఒక బ్రాహ్మణుడు యజ్ఞమొనర్పింప మేష
మొక దాని దేగ నందుండి చిత్రముగ 2276
అతి సుందరం బౌచు నాగంతుకముగ
క్షితి నొక్క మేషమై చెలగి లోకముల 2277
అల్లాడ తల్లడం బంద జేయంగ
బల్లిదుండౌ వీరబాహుండు దాని 2278
బట్టి తన నేర్పుచే బాహులేయునకు
నట్టె సమర్పించ నతి భక్తి తోడ 2279
వీరబాహును మెచ్చి వేడ్క షణ్ముఖుడు
కోరి వాహనముగా గొనె దాని నంత 2280
ఈ రీతి కొన్ని నాళ్లేగ మాధవుడు
చారు సౌభాగ్యలై చనెడి పీయూష 2281
సౌందర్యవల్లి నా జను వధూమణుల
నందక త్తెలదెచ్చి యాగుహుని కియ్య 2282
సంతసంబున గొంచు శంభుని పట్టి
అంత వారలతోడ నమరులు గొల్వ 2283
ధౌతాచలము జేరి తల్లి దండ్రులకు
ప్రీతితో ప్రణమిల్లి వేడుకల్ గొలిపి 2284
సంతసింపుచునుండ సర్వదేవతలు
అంత నాకైలాస మరిగి యాభర్గు 2285
సుర గురూ: శంకరా! శూరాదులెల్ల
గరువించి మమ్మెల్ల గడతేర్చుచుండ 2286
నెన్నాళ్ల మేమిట్లు నేడ్చుచుండెదము
అన్నన్న దనుజాళిదౌ యుపద్రవము 2287

మాన్పి మమ్మికనైన మనజేయుమంచు
విన్పించి నిర్జరుల్ వేసట నంద 2288
శైలజాతయు బల్క చంద్రశేఖరుడు
చాలగా యోచించి షణ్ముఖుని బిల్చి 2289

## శివుడు షణ్ముఖుని యుద్ధమున కనుపుట

ఓకుమారా ! ఇంక నొప్పునాయాజ్ఞ
పీక రాక్షస కోట్ల విదళింప బొమ్ము 2290
సురకోట్ల హితమింక జూడుమీయనుచు
హరుడాతనికి సహాయము గాగ భూత 2291
గణములం దగనిచ్చి ఘనశక్తి నొసగి
అనువైన దివ్య మంత్రాదుల నిచ్చి 2292
ప్రాసతోమర ఖడ్గ బాణ శూలాదు
లౌసాధనములిచ్చి యంత నొకదివ్య 2293
మైన యరదంబిచ్చి యనిలు సారథ్య
మూనజేయుచు ప్రేమ యొప్పారుచుండ 2294
శిరము మూర్కొని పల్కె జిరజీవియనుచు
పరిమార్పుమా దుష్ట బలముల నెల్ల 2295
అనగ మొక్కుచు శంభు కంబకు గూడ
వినయంబుగాలేచి వేడ్క నాగుహుడు 2296
తనవెంట భూత సంతతులు దర్లంగ
గణనాధులును వేడ్కగాలు చుండంగ 2297
బ్రహ్మాది సురలెల్ల బాహులేయునకు
జిహ్మాశలమ్ములొసంగి చిరజీవి యనగ 2298
రావించి వృషదశ్వరథచోదకునిగ
గావించి స్వస్తి వాక్యంబులం గొనుచు 2299
వీరబాహ్వాదులు వెంట దర్లంగ
కోరి పయనంబైన గుహుని ప్రేమమ్మున 2300

అరసినారదు డిట్టులనె మార్గమందు
హరసుతా ; వినుము నాదైన విన్నపము 2301
కలడొక్క దుష్టుడౌ క్రౌంచ రాక్షసుడు
ఇల నగస్త్యుని శాపమెసగగా నతడు 2302
నగరూపమైయుండు నయమున నతని
కగుపాటులో 'మాయ' యను పురం బందు 2303
తారకుండను శూరదైత్యానుజుండు
మీరు నాతండౌను మేటిబలశాలి 2304
అతని గెల్వగ జాల రఖిల లోకముల
అతనికా క్రౌంచున కతిదోస్తి కలదు 2305
క్రౌంచగిరిపై మాయగల కోటలుండు
ఎంచ వానిని నేరి కేనియునుగాని 2306
తారకాసుర క్రౌంచ దనుజులిట్లుండ
శూర సింహాసనుల్ శోభిల్లు చుంద్రు 2307
కాన నాశూరునికన్న మునుముందె
పూని వీరిద్దున నొ్నసగు గూల్చంగ 2308

## తారకాసురుని యుద్ధము

అనవీరబాహునకు ననిమె సేనాని
పని బూనుమిక వీరిపైన తలపడగ 2309
అనవాహినులయందు నర్ధమేర్పరచి
చని క్రౌంచగిరి మాయ సాలముల్గ్రిమ్మె 2310
అదివిన్న తారకుండధిక రోసమున
నదరి నోటికొలంది బ్రహ్మాండ మదుర 2311
రణభేర్లు గొట్టించి రాణువల్ కదల
అనిశక్తి ధరుసేన నప్పుడుదాకె 2312
ఆతాకునకు నూర్ధ్వ మల్లాడెనింక
పాతాళలోకముల్ బరగె దిగ్భ్రమల 2313

అత్తఱి ధరగూలు హస్తి తండములు
తుత్తుమురులై పోవు తురగ సంతతులు 2314
ధరరాలునట్టి యరదములు యానములు
మరిగజారోహకుల్ మావురౌతులును 2315
తునకలౌ శస్త్రము ల్బాణముల్ గాగ
అణువులౌ భిండి వాలాది సాధనలు 2316
బొరియైన తోమరంబులును చక్రిములు
మరి దుమ్ముదుమ్మైన మహితప్రాసములు 2317
ఈరీతి భూతవాహినులు రాక్షసులు
ఘోరంబుగా బోర ఘూర్ణిల్లెఁగము 2318
వాకలేయుచు రక్త వాహిను ల్గాగ
కాక ఘూకంబులు కంకాళములును 2319
పీక గౌక్కెర శ్వాన భేరుండకములు
రాకాసి పక్షులుం రాబందుచయము 2320
బాలవృద్ధులతోడ పరిజనం బొప్ప
చాలపుత్త్రెల మెక్కి సరగ నాడుచును 2321
ధ్వంసమైయొప్పు యుద్ధపుధాత్రియందు
మాంసపిండములలో మఱి బంతులాడి 2322
ఘన శుభకార్యసంగతుల నొప్పుచును
తనువులమరచి విస్తార మోదమున 2323
తంధాన తాన తంధాన తాననుచు
బంధురంబుగ నాడె బహు నాటకముల 2324
ఈరీతి ఘోరమై హెచ్చుగా రణము
వీరబాహ్వాదులౌ వీరాధిపతులు 2325
ఘోరాంబకంబులఁ గురియించి దైత్య
వీరులఁ నురుమాడ వివశులై వారు 2326
పారుచుండగ నాపి భయమేలననుచు
తారకాసురుడు రథంబంత డిగ్గి 2327

ఖారవిరచిత మహా పట్టాన్వితంబు
ఘోరమౌ గదకేలగొని పండ్లుకొరికి 2328
అసమకాలపు మేఘమనగ గర్జించి
వెస భూతసేనపై వీకతోనుఱికి 2329
డేగరీతిగ వారిఢీకొంచు ధాత్రి
నాగంతుకంబుగా నని ధాత్రి గూల్చి 2330
భూతనాధుల దగాల్చి భూరిగణపతుల
భూతలంబున ద్రొబ్బి భుజమప్పళించి 2331
వీరవిహారంబు వెస సల్పుచుండ
వీరకేసరిగాంచి వీతి హోత్రుడుగ 2332
పొంగి దారకు నాగి భూరి బాణముల
నంగంబులవియగా నప్పుడేయంగ 2333
దారకుండును హెచ్చి దనరథంబెక్కి
వీరకేసరిదాకి వివిధాయధముల 2334
గుప్పించగా రెండు ఘోర బెబ్బులులు
కుప్పించు మాతంగ గున్నలో యనగ 2335
నొకరు నొండొరుదాకు చొంప సమకట్టి
సకలశస్త్రాస్త్ర సంజాతముల్ గుప్ప 2336
వీరకేసరి హెచ్చి వీరరోసమున
తారకాసురుకేతు దండంబు నరకి 2337
కఱకు బాణముల నంగమ్ము లగ్గొనుప
మరివాడు లోకముల్ మారు మ్రోయంగ 2338
తనగదాదండమంతట నూచివైవ
చనిరొమ్ము నంటగా చైతన్యముడిగి 2339
వీరకేసరి ధాత్రి వేగ గూలంగ
పారుసేనల కడ్డుపడి ద్రిప్పి మరల 2340
పడిన తమ్ముని వీరబాహుండుగాంచి
పిడుగురీతిగ పేరబిలచి తారకుని 2341

దుర్మదాంధాయింక దుర్దములోనీవు
మర్మముల్ విదళింతు మహిగూల్తునిన్ను 2342
అనవాడు భగ్గు మంచగ్ని హోత్రుడుగ
గనుమింక నీయనుజు గతి గూర్తునీకు 2343
ననగవారలు దాకి రాబోతులనగ
ఘనసింధువులు రెండుగదిసినయట్లు 2344
పంచాస్యములురెండు పౌరుషంబొప్ప
మించిఢీకొనినట్లు మేటి బెబ్బులులు 2345
కొండ్రు కొండ్రనరేగి గవియుచందాన
తీండ్రించి పోరాడు ద్విరదంబులనగ 2346
దాకిశస్త్రాస్త్రముల్ దగ గుప్పికొనుచు
వీక నొండొరుబట్టి విదళించి కొనుచు 2347
పోరుచుండగనట్లు భూతేశు పట్టి
తారకాసుర చతుర్దశబాణములను 2348
విరథు సేయనతండు వినువీధికెగసి
మరిలక్ష ఘంటికామయ శోభితంబు 2349
అభవు దత్తంబైన యట్టి శూలంబు
నభిఘాతముగ నేయ నభవునిపట్టి 2350
బాహులేయుని మది౯ ప్రార్థించుచుండ
రాహువా శుభ్రాంశు రహిగ్రమ్మినట్లు 2351
క్రమ్మి మూర్ఛను బొందగా జేసెగాని
అమ్మహాబలు సేయదాయె నేమియును 2352
అదిగాంచి గీర్వాణులదరి హోయనుచు
పదిదిక్కులకుగూడ బర్వగాహెచ్చి 2353
తారకుండును వారి దరిమి యేయంగ
వీరబాహువు మూర్ఛవీడి గొంతెత్తి 2354
తారకా నిల్వరా తక్కరీ యింక
తారు మారొనరింతు దైత్యులేడ్వంగ 2355

క్షణములోపల నిన్ను సమవర్తికిత్తు
నన తారకుంటిట్టులనియె నాతనికి 2356
వీరబాహూ నాదు విధమెఱుంగకయె
పోరనన్నెదురగా పొంగుచున్నావు 2357
వినుమింక ననుగూర్చి విష్ణు చక్రంబు
ననిమిషాధిపు వజ్రమగ్ని కుంతలము 2358
వరధనాధిపు కత్తి వరుణనాయుధము
మరిసదాగతి శక్తి మనుజ భక్షకుని 2359
గదయును నాచేత ఖండింపబడియె
నదిగాక బ్రహ్మాస్త్ర మణచగాబడియె 2360
నీ వెంత ననుజూడు నీకు నాచేత
చావు నిక్కంబన్న శంభుని సుతుడు 2361
చూతురా తారకా చోద్యంబునీదు
పోతరంబిక మాన్తు పోరరాయనుచు 2362
గంభీరముగ నార్చి ఖగగోళమెల్ల
స్తంభించ బాణముల్ సంధించియేయ 2363
తారకుండును వాని దాకి ఘోరముగ
ఘోరాంబకంబులఁ గ్రుమ్మరించంగ 2364
అపరూపముల బోరు నాద్వయంబందు
నపకర్తలెవ్వరో యపకృష్టులెవరో 2365
తేరిచూడగరాక తెగజూచికొనుచు
తారకాసుర శంభు తనయులు పోర 2366
అనల వాయుకుబేర ఐంద్రాస్త్రచంద్ర
ఆనల కృతాంత మేఘాద్యస్త్రములను 2367
అసురుడేయగ వాని నన్నిటినిగూడ
వెసగూల్చె ప్రత్యస్త్ర విధుల వీరుండు 2368
మాయాస్త్రమేయగా మహాదేవ సుతుడు
హాయజేసెను వీర భద్రాస్త్రమేసి 2369

ఈ రీతిగా బోర యిందాద్రిరి విసికి
వీరబాహునిగెల్చు విధమిట్టి దనుచు 2370
నెంచి మూషకమౌచు నిరుకుమార్గమున
క్రౌంచాద్రి గల గుహ గర్భమునుజొచ్చె 2371
అయ్యెడ విజిగీషుడై వీరబాహు
చయ్యన దారకుం జంపుదేననుచు 2372
అతని దరుముచు వెంట నరుగగా నతడు
అతిశయంబై యొప్పునట్టి మార్గముల 2373
దుర్గమంబులగూడ దూరు నా వీరు
మార్గముల్ దప్పించి మాయ క్రౌంచుంచు 2374
పలువిధంబుల జిక్కు పరచ వీరుండు
కలవరపడిగూడ కారు చీకటిని 2375
తిరుగు చుండగ వాని దిక్కు గనలేక
అరిగి రాతని గాంచ నతని సోదరులు 2376
కాని తనమాయచే క్రౌంచాసురుండు
పూని వారల నేచ బూడ్చె మార్గములు 2377
ఈ రీతిగా వార లెంతయు నుండ
తారకుం డరుదెంచి తనరథం బెక్కి 2378
జయభేరి గొట్టించి సంసిద్ధుడౌచు
రయమున దమ నాథ రహితమై నట్టి 2379
భూత సేనల దాకి భుజ మప్పళించి
శాతశిలీముఖాస్త్రముల గుప్పించి 2380
ఊచ కోతగ గోసి యుక్కడపుచుండ
పోరుచు వారలు లేక పుయిలోడు నవటి 2381
ఆర్త ధ్వనుల నెల్ల నాలించి వీక
కార్తికేయుం డన్నిలు గాంచి యరదంబు 2382
గట్టి తెమ్మనగ నా ఘనుడట్లొనర్ప
పట్టి శక్తిని చేత బాహులేయుండు 2383

అతని దాకగ గాంచి యద్భుతరీతి
వితతమై యొప్పారె వివిధ వాద్యములు 2384
రావంబులకు దైత్య రాజువల్ చెదర
దేవ వాద్యములెల్ల ధిమిధిమిలాడె 2385
రథముల ఢణఢణల్ రహి భూతపతుల
ప్రధిత ఘట్టన లొప్ప ప్రతిఘాతరవము 2386
గజ బృంహితములు కంఖాళహేషాది
గజి బిజి ధ్వనులచే గలగ లోకములు 2387
ఉదధి ద్వయంబుగా నొప్పెదైతేయ
త్రిదశ పక్షము లొప్పె తెంపు లేకుండ 2388
వాకలేయుచు రక్త వాహినుల్ గాగ
కాక ఘూకములు కంకాళ సంచయము 2389
భూతప్రేత గణంబు భూరి భేతాళ
జాతంబులును మహా సంతసం బొప్ప 2390
నల్ల కొల్లగ ద్రావి నానా విధముల
అల్లిబిల్లుల హెచ్చి యాడలాడంగ 2391
ఘోర ఘోరంబుగా బొంగారు చుండ
శూర సన్నిభమైన శోభతో నొప్పి 2392
శౌర్య గాంభీర్య విస్తార తేజముల
ధుర్యులై పటు చాప తూణేశుడైన 2393
ఆగుహుం గాంచి యా యసుర నాథుండు
వేగ నా సేనాని విధము దలపోసి 2394
తన మనం బందు వింతగ నూహ సల్పి
తన సారధిని బిల్చి తన రథం బటకు 2395
జేర బోనిమ్మనిగ జెచ్చెర నతడు
ఆరడంబున దోలె నాగుహుని జేరె 2396
బాహులేయుని గాంచి భక్తితో మ్రొక్కి
ఆహా షడాననా హరుడు నిన్గాంచి 2397

తన మహా పుత్రిసక్తత లాభమందె
ఘన భవానియు గూడ గాంచెనా నల్లె 2398

ఈ సురాసురుల కిట్లెసగ సంగరము
వ్రాసె దైవము చేట వ్రాసిన నాడె 2399

అమరుల కెట్టులో యట్టులే దైత్య
సమితికిం గూడ నా శర్వుడగు గాన 2400

అభవాత్మజుడవీ వఖిల పూజ్యుడవు
ఉభయుల కొకరీతి యొప్పునే గాని 2401

ధర్మమా పక్షపాతమున మమ్మేచ
నిర్మలాత్మక ఇంక నీవు గనుమేసు 2402

తారకాసురుడ ఈ దైత్య నాధుండ
ఘోరానుజుండ నా చొప్పు దెల్పితిని 2403

అనగ షాణ్మాతురుం డనియె ధీరతను
వినుమోయి తారకా వినుతు నికెల్ల 2404

మా చేతనే సృష్టి మహిమ శోభిల్ల
నీచరాచరమెల్ల నెసగు మావలన 2405

దానికై విధి నిషేధముల నేర్పరచి
పూని తత్కర్తల బొసగ నిల్పితిమి 2406

ఎవరైన నావిధుల హెచ్చి యీధాత్రి
నవియించగా వధ్యులౌదురు మాకు 2407

కాన మా యాజ్ఞచే కమల నాభాది
మాననీయుల దివ్య మహిమ యొప్పెదరు 2408

వారి మార్గాని మీరు వారి బాధించి
నారౌట మిము శిక్ష నాకౌను సేయ 2409

నిను జంపి వెంటనే నీ సహోదరుల
దునిమి సంతసమెల్ల తోవ జేయుదును 2410

అనగ దారకు డప్పు డా బాహులేయు
గని దైత్యు లస్వప్న గముల నేచుటయు 2411

విధి యాజ్ఞయగుగాదె వివరించి చూడ
అధికుడై యొకడొప్ప నాతని నణచ 2412
విధి యాజ్ఞయే యైన వివరించి చూడ
విధియాజ్ఞ యది యెట్లు వెధవాజ్ఞగాక 2413
నీవు బాలుడ వంచు నిను జంప లేక
ఈ విధంబున బల్కి విధి నచ్చకున్న 2414
సై యింక రారమ్ము జన్యంబొనర్ప
మాయింతు నే నీదు మదమడగింతు 2415
వీర బాహ్వాదులే విధి నందినారొ
కోరి నీవును దాని గొూన నుంటివనగ 2416
కని రదంబుల గీటి కార్తి కేయుండు
ఘనుడ వై తివి దైత్య కాని యిక నిల్వ 2417
పట్టి నీతలపుట్టె నవని పాల్జేతు
మిట్టి పోకుమటన్న మించుకోపమున 2418
తారకుండార్చి విస్తార గుణనాథ
మారటింపుచు నల్పి యమ్ములం గుటియ 2419
కార్తికేయుం డంత్యకాలుడో యనగ
ఘూర్త బాణంబుల న్దొరగించి కోట్లు 2420
ప్రళయ కాలము రీతి బరగి లోకముల
కళవళింపగ జేయగా తేజిచూచి 2421
తారకుండంత విస్తార రోసమున
మార సూదను పుత్రి మార్కొనియేసు 2422
ఆవిశాఖుడు వాని నణచి జృంభించి
తావక దివ్యాస్త్ర తప్తునిగ జేయ 2423
నవ్యాప నవ్యులై శరజతారకులు
అవ్యయంబుగ బోరు నప్పుడవ్వారి 2424
ధిక్కార హుంకార ధీరశబ్దములు
అక్కజ భ్రమణంబు లారథధ్వనులు 2425

హస్త లాఘవములు హుంకారములును
విస్తరిల్లగ వాసవీర రోసముల 2426
ఘోరయుద్ధ మొనర్ప ఘూర్ణిల్లె జగము
ఆరణంబున దారకారి జృంభించి 2427
అతి లాఘవంబుగా నా దైత్యు రథము
శత భిన్నముల సల్ప సరగ దారకుఁడు 2428
వేరొక్క రథమెక్కి విరివిగా నేయ
తారకారియు వాని ధనువు తున్మాడి 2429
వర్మంబు లంటగా మరి యేయ యేయ
దుర్మదుండై వాఁడు దూల్చె పవమాను 2430
కార్తికేయుడు హెచ్చి కార్ముకం బుడిపి
ధూర్తుడై సారథిని ద్రుంచి యార్వంగ 2431
తానె చోదకుఁ డౌచు దద్దరిల్లుచును
పూని మారుతి నేసి పొందించె మూర్ఛ 2432
అసుర నాయకులెల్ల రట్టహాసమున
ముసల పట్టిస ఖడ్గ ముద్గ రాదులను 2433
సాధనంబులను పాషాణ వర్షముల
ఆ ధనుర్ధరు నేయ నప్పుడా గుహుఁడు 2434
హస్త లాఘవ మొప్ప నాయోధ వరుల
నిస్తులంబగు బాణ నిహతుల జేసి 2435
ధీరుడే బాణముల దిశలెల్ల నింప
తారకుండును మహాధైర్యమేపార 2436
హమ్మంచు వేధాస్త్ర మొప్పుగా నేయ
నమ్మహాస్త్రము వాని నంటకయె గూలె 2437
తారకుండును క్రోధ తామ్రాక్షుడౌచు
వారుణాస్త్రంబును వాతాశనమును 2438
యామ్యాస్త్రమును భాస్కరాస్త్రంబు నింక
సౌమ్యాస్త్రమును భూరి జాత వేదమును 2439

సమ్మోహనమును వైశ్రవణముఁ మరియు
సమ్మహా మేఘాస్త్ర మచల బాణమును 2440
యక్షాస్త్రము నృన్నగాళ నాస్త్రంబు
రాక్షసాస్త్రంబును రహినేయ గుహాని 2441
పాద పద్మంబులఁ బడి శాంతినందె
నాదట తారకుం డథవాస్త్ర మేయ 2442
అది మహాఘోర మౌ చప్పుడు రాగ
పదిలంబుగా దాని భక్షించె గుహుడు 2443
అట్టు దివ్యాస్త్రంబు లన్నియు సనిన
పట్టు నప్పె నటంచు పాకారి వైరి 2444
రథచోదకుని బిల్చి రహిపల్కె నిట్లు
పృథన మందున వీడు బడుట కష్టంబు 2445
కాన నీ నేర్పెల్ల గనజేసి రథము
పూని చిత్రంబుగా బోవ నిమ్మనగ 2446
ఆరథంబును జిత్రమౌ రీతి నతడు
ఆరాటముగ మింట నాట లాడించ 2447
తారకుండును బాణతతి బట్టునట్టె
తీరు వదలెడి పీరు తెలియరాకుండ 2448
కాలాభ్రమంబుగా కరలాఘవమున
చాల దివ్యాస్త్ర వర్షంబంత గురియ 2449
భీషణాకారుడై భీభత్స గల్గ
రోషించి రవికోట్ల రుచిరుడై వాయు 2450
మానసవేగముఁ మరపించు నట్లు
కానలే కనిమిష గణము భ్రమించ 2451
వేయు లక్షలు కోట్లు విశిఖంబు లేయ
నాయధికమున కోడి హాహా యటంచు 2452
మాయచేత జయించ మదినెంచి యతడు
మాయమై క్రౌంచాద్రి మధ్య వసించ 2453

అంత క్రౌంచుని సహాయ ప్రమాయ వలన
పంతగా త్రిపురముల్ విమవీధి దోప 2454
త్రిపురాసురుల పోల్కి తేజరిల్లంగ
త్రిపురాంతకుండౌచు త్రిపురముల్ గాల్చె 2455
సమయాభ్రముగ వాడు సరగనేతెంచ
సమయించె వాయువుగ షాణ్మాతురుడు 2456
అంభోధి వలె నప్పు డసురుడు రాగ
కుంభసంభవుడౌచు గొనె శక్తిధరుడు 2457
చక్రవాళంబుగా చాల నొప్పార
నాక్రమించెను హంసుడై శక్తిధరుడు 2458
దారు చిచ్చుగ వాడు గదియ షణ్ముఖుడు
దారుణాకృతి నొప్పి దర్పించి మ్రింగె 2459
ఈ రీతిగా వార లెసగ ఘోరముగ
పోరుచుండ గుహుండు భూరి తేజమున 2460
మూర్తీభవంబైన మూల తత్త్వమును
గుర్తించి యద్దాని గూర్చి తన శక్తి 2461
నేయ భాస్కర కోట్ల మెచ్చి శతకోటి
వేయు కోటుల దాటి విస్మయంబొదవ 2462
పరగి దిక్కు నెల్ల బంధురంబుగను
మరి తారకునిబట్టి మహిత రౌద్రమున 2463
వక్షస్థలము జించి వడిగ నా క్రౌంచ
రాక్షసుని జంపగా రణ వసుంధరను 2644
మాయ కోటలు బోయె మరుక్షణంబందె
నాయెడ వీరబాహ్వాదు లరుదెంచి 2465
శక్తి ధరునకు మ్రొక్కి చాల మోదమున
శక్తి కొలది నుతించి జయ శీల వైరి 2466
పరుల వర్షం బొప్పె వినువీధి నుండి
పరివిగా జయ దుందుభి ధ్వనులు మ్రోయ 2467

శ్లాఘించె లోకముల్ శరజన్ముడప్పుడు
ఆఖండ లాదులును బొరాయనంగ 2468
ఈ సత్కథను విన్న నెలమిని వ్రాయ
భాసురంబుగ సర్వ భద్రముల్ గలుగు 2469
తూలు శత్రు చయంబు తొలగు పాపములు
చాల సౌభాగ్య సంచయ మొప్పు ధాత్రి 2470
దేవతానందంబు దీపించు తుదకు
దేవ సన్నిధినొప్పి తేజరిల్లెదరు 2471
అనగ నామునులెల్ల రధిక మోదమున
వినుపించవె గాథ వీనులలరంగ 2472
అన సూతజుడు పొంగి యధిక మోదమున
వినుడంచు దెల్పె పై విధము మౌనులకు 2473
వీర బాహ్వాదులై వెలయు సోదరులు
చేరి కొల్వంగ నా సేనాని యంత 2474
మాతామహుని గాంచ మన సైన నేగి
ప్రీతిగా వారిచ్చు వివిధోచితముల 2475
వంది దేవ గిరీంద్రి మాపైని జేరి
యుందు నిర్జర శిల్పి యద్భుతంబుగను 2476
బహురత్న చిత్ర విభ్రాజమానంబు
అహి దివ్యలోకాళులంద నూపంబు 2477
ఐన నగరంబొండు నచట నిర్మించ
పూని పరిగణముతో పొల్చె నాతండు 2478

## తారకుని వధానంతరగాథ

అట తారకుని పత్ని లతిదుఃఖ మెసగ
కటకటా మా కర్మ కాలె నిట్లనుచు 2479
వా పోవుచును పోయి పడియున్ననాధు
దాపునంబడి దుఃఖతప్తులై యుండ 2480

అసురుని వరపుత్రుడా సురేంద్రుండు
వెసదుఃఖమంది తమ విధి దూఱుకొనుచు 2481
అంత తన తండ్రికట అపర సత్కార్య
లంతట సల్పి రాదట నిల్వలేక 2482
తన పెద్ద తండ్రియై తగ శూరపద్మ
ఘన పత్తనము జేరి కాళ్ళపైవ్రాలి 2483
ఎంతయో విలపించి ఎల్లెల్లో తుదకు
అంతయు చెల్పగా నచటి వృత్తాంబు 2484
తన సోదరాత్మజుని తా కౌగిలించి
కొని వారి మరణముల్ కోరి పలుసార్లు 2485
వినుపించుకొని వాని పిన తమ్ముడైన
ఘన సింహ వక్త్రునిం గౌగిలించుకొని 2486
అతడు దానును గూడ యనుజుని దలచి
క్షితిగూలి ఎల్లెల్లో చేతస్కులైన 2487
శూరు డమాత్యులం జూచి యిట్లనియె
నారటింపగనేమి యౌను మనకింక 2488
సేనలం గూర్పుడీ శీఘ్రముగ మీరు
మానక శత్రుల మహిగూల్తు మింక 2489
భువిని నాకసమును బూంచి హస్తముల
అవియ జేతు మనంగ ననె వృద్ధమంత్రి 2490
వినవయ్య యోశూర వినుతునే నొకటి
ఘన నాధుడగు వాడు గనవలె నీతి 2491
ఎఱిగి ముందగుదాని నెంతయును సేయ
మఱియాదగా ధాత్రి మనునట్లుగాక 2492
మొండి పట్టొనరించ మొదటికే చెఱుపు
చండికా తనయుడౌ షడ్వక్త్రుడనగ 2493
ఏమిగా నెంచితివో యిల దివ్యులెల్ల
మీమాయలకునోడి మిము గూల్చశక్తి 2494

నాహాయముగ వేడ నాపె గరుణించి
భాహాంలేయత్వాన బంధురంబుగను 2495
బరగి జన్మించె నీ పరమ గోప్యంబు
నెఱిగించె నారదుం డేకాంతముగను 2496
మనకు పూజార్హుడ మ్మహనీయు గొలువ
ననపాయముగ నింక నఖిల కష్టముల 2497
గొనుచు షణ్ముఖుజేరి కొలువగా నతడు
మనపట్ల నెనరుంచు మనుచును మనల 2498
అనగ నేమేమియో నాతడూహించి
ఘనులైన చారులం గాంచి యిట్లనియె 2499
వెంటనే మీరేగి వివరమంతయును
కంటితో గమనించి కదలి రండిటకు 2500
అని పంపగా వార లప్పుడటోయి
కనుచుండి రెల్ల సంగతుల బూర్ణముగ 2501
ఇక్కడి కథలెల్ల ఇట్లుండ నచట
అక్కడా సేనాని యాంగిరసు గాంచి 2502
శూరాదులై యొప్పు చున్నదైత్యాళి
వీరు వారల జన్మ తీరు దెల్పుమన 2503

## శూరాదుల జన్మ వృత్తాంతము

కలడు మున్నొక దైత్య ఘనుడు సత్వుండు
ఇల సురేంద్రాఖ్యుడై ఎసగు నాతండు 2504
మంగళకేశి నా మగువతో వేడ్క
సంగమించగ మహా సౌందర్య శాలి 2505
సరస బుట్టెను మహా సంతోసమొదవ
మరి కావ్య శిష్యయై మహావిద్యలెల్ల 2506
పొందుటంతయు గాక భూరిశాంబరిని
పొంది ప్రీతాత్మయై పొంగారుచున్న 2507

తన కుమారినిగాంచి దైత్య నాధుండు
వినుపించి కశ్యపుని విధమొక్కనాడు 2508

ఎంతకష్టంబైన యేగి యామునిని
సంతసిల్లగ జేసి సంతానమొంద 2509

దానిచే నిర్జరుపల్ ధాత్రి గూలెదరు
గాన నేగుమటన్న కన్యకయునొప్పి 2510

అరయ గంగా కూల మందొక్కచోట
మఱి తపోనిష్ఠుడై మహనీయుడైన 2511

కశ్యపమునినాథు గాంచి మోదమున
వశ్యంబొనర్చికొన వనితయూహించి 2512

తనమాయచే మహత్తర పుష్పఫలిత
వనమొందు కల్పించి పరగ నద్దాని 2513

అంటి రత్నాన్వితంబై యొప్పునొక్క
మంటపంబున జేరి మాధుర్య మెసగ 2514

శిలలెల్ల కరుగగా శివఘోషమొప్ప
సలలితంబుగ బాడ సంయమీంద్రుండు 2515

కనువిచ్చి యాశ్చర్య కలితుడై యెంచి
చనికాంచి మదిపొంగ సారసేక్షణతొ 2516

యెవ్వరి దానవీ వెందుండి యిటకు
యెవ్విధంబున జేరి యిట్లొప్పినావు 2517

కలరూపమెఱిగించు కలికిరోయన్న
కలకల నవ్వుచాకాంతయిట్లనియె 2512

నేనొకా నొక యోషినెంతయునిటకు
తానమాడగవస్తి దైవతీర్థమున 2519

తపము సల్పెడి మీకు తగునె మాఘోటి
చపలాక్షి నొంటిగా చయ్యన బిలువ 2520

ఆలస్య మాయెనే నరిగెదనంచు
బాలపల్కిన కశ్యపబ్రహ్మ విరహ 2521

తాప ముప్పొంగగా తన్వరో నేను
ఆ పితామహుని వంశాంచితుడ నౌదు 2522
నీ మీద మోహంబు నెలకొన్నకతన
కాము శరముల జిక్కగానయ్యె నాకు 2523
నా తపోశక్తిచే నళినాక్షి నీకు
జేతు సన్నియు నింక చిత్తజునికేళి 2524
తనియింవు మన గాంచి తన తళ్కుబెళ్కు
లను చూపులను మౌని నప్పుడే నిల్పి 2525
అంతలోపల మాయమైన కశ్యపుడు
అంతు దెలియక ధాత్రి యందొత్తగిల్లి 2526
ఏకల చిత్తుండౌచు వీక్షింపుచుండ
నొకయెడ నొప్పుగా యోషియొప్పార 2527
పెన్నిధిం గను పేద పెద్దయో యనగ
యున్న మానిని గాంచి యువిద యిట్లనియె 2528
పాప మీవిక నాదుపైనొప్పు మోహ
తాపమున నున్నావు దగనొండు వినుము 2529
నేనెట్టి రూపంబు నెలమి గాంచెదనొ
మానక నీవు నాపూడ్కిగా నౌచు 2530
నను గూడెదేని యానంద మొనగూర్తు
నన నట్టియనెనా మహర్షిమోదమున 2531
తనమాయ చిత్రంబు తనరగా మొదటి
ఘనయామమున వారు గలియగా శూరు 2532
డనువాడు జన్మించె నంత నవ్వారి
తను ఘర్మముల కోటి దైత్యులొప్పార 2533
అంత రెండవ యామ మందు హర్యక్ష
వంతులుగాగ నా వంటి ముఖుడౌదవె 2534
మరిబుట్ట ఘర్మముల మనుజ భక్షకులు
గరిమ మూడిట మహా గజముల రీతి 2535

సంగమించగ నొప్పె సామజాసురుడు
పొంగ ఘర్మములందు భూరి రాక్షసులు 2536
ఆతీస చాతుర్థిమందు మేఘముల
దాతిరుగానైన నజముఖియయ్యె 2537
అంత ఘర్మంబుల నైరి రాక్షసులు
ఏంతగా నారీతి వెళ్ళ నారాత్రి 2538
మాయ కశ్యపునిదౌ మన్మథప్రేమ
జాయ తొల్లింటి రూపము లందిరపుడు 2539
అంత నాకశ్యపుం డపుడు తెలివొంది
చింతించి తన దుష్టచేష్టకై యపుడు 2540
సుజ్ఞాన వంతుడై శుభ ముహూర్తమున
యజ్ఞ దీక్ష వహించె నభవుని గూర్చి 2541
అంత నాశూరాములైన రాక్షసులు
మంతనంబున సర్వ మంత్రంబు లెఱిగి 2542
అయుత యోజన విశాలాంచితమొప్ప
నియమించి యొకశాల నిర్ణయోక్తముగ 2543
అండా కృతములుగా నాశాలయందు
కుండంబులను వేయు గూడ ఘటియించి 2544
మూలశక్తులనెల్ల మోటించినగ్ని
చాలప్రజ్వలజేసి భాగముంసాదు 2545
లాజ్యంబులో జేర్చి యభవునిగూర్చి
ప్రజ్వరిల్లగ వీరవద యాగములను 2546
ధీపలై యట మూడు దివ్య వర్షములు
మీరి సల్పహరుండు మెచ్చి యగుపించి 2547
కోరుడీయిక మీదు కోర్కుల ననుచు
గారవంబున బల్క గాశ్యపేయులను 2548
అందు శూరుండిట్టు లనియె సద్భక్తి
ఇందుశేఖర యో మహేశ్వరా మాకు 2549

పేయుపై నెన్మిదై వెలయు బ్రహ్మాండ
నాయ కత్వంబిమ్ము నాకులెల్లరును 2550
మాకు సేవకులుగా మముగెల్చువాడ
లేక యుండగ నింక లెస్సగా మాకు 2551
పేయుయుగములు ధాత్రివిలసిల్లునట్లు
ఆయువౌనట్లుగా యభవ చేయుమన 2552
మంచి నడకల మీరు మహినొప్పు నెడల
నంచితంబుగ గోర్కులన్నియునౌను 2553
ఆ విధంబును మీరి యదరిననాడు
నా వంక మృత్యువై నష్టించు మిమ్ము 2554
అనిశంభుడేగగా నావిధంబునకు
మనుజాశనులకొడల్ మత్తెక్కి యంత 2555
కోటానకోటులై కొల్చురాక్షసుల
తోటి సర్వముగెల్చి దొరతనంబంది 2556
కావ్యశిష్యత్వాన ఘనకళల్ బొంది
దివ్యగణములనొంచి దిక్పతుల గెలిచి 2557
వైకుంఠమును గూడ వరుసగా గెల్చి
ఆకతాయుల నెల్ల నందందు నిల్పి 2558
ఘనులౌచు నా విశ్వకర్మ నామయుని
గని పల్కగా వారు కౌశలం బొప్ప 2559
సర్వ సౌభాగ్య విస్తారంబు లౌచు
నిర్వాహకములైన నిగమ త్రియంబు 2560
నిర్మించ వారందు నిలచి లోకముల
దుర్మదాంధత్వమున దోలి సజ్జనుల 2561
గట్టిగా నస్వప్న గణములచేత
వెట్టిగైకొనుచు నా విధి ధివ్యమునుల 2562
బాధించుచును పుణ్యవనితల చెరచి
వేధించు చున్నారు వీక లోకముల 2563

వారి బాధలనెల్ల వరుసగా నెంచ
లేరు బ్రహ్మాదులీ లీలగోలయ్యె 2564
సన కార్తికేయుడీ యంక మట్లుంచి
ముని దెల్పితిరి యజోముఖియనుదాని 2565

విన గుతూహల మయ్యె వినుపించుడనగ
వినుపించ దొడగె నా విధమిట్లు గురుఁడు 2566

అది కామ భోగేచ్ఛ నధికు రాలౌచు
మద మెక్కి తిరుగుచు మగల గూడుచును 2567
అభిసారికల దెచ్చి యన్నిలకు గూర్చి
వ్యభిచార విద్యయం దధికురాలౌచు 2568

తిరుగుచు జగమెల్ల తెరువర్లతోడ
కరము కామోప భోగము లందుచుండ 2569

దుర్వాసు డొకనాడు దోచగా మదన
గర్వియై రమియించగా గోరనతడు 2570
ఓసి దుశ్శీల నేనోప దాపసుడ
ఆసలెల్లను వీడినట్టి వృద్ధుండ 2571

నను వీడు నను వీడు సతి సల్పుదనిన
కనికరత్వములేక కాళ్ళపిని వైచి 2572
యుపరతిం గావించి యొనర సద్యమున
అపజాతులనుగాంచె నతని నిల్వలుడు 2573

వాతాపులను వారి వారట్లు తల్లి
దౌత్రిరులై చాల యసుర కృత్యముల 2574

గడగి బాధలబెట్టి కడకు నగస్త్యు
కడుపులో జీర్ణించి కాలగతి గనిరి 2575
వారి సంగతులివ్వి వాని నట్లుంచి
శూరాదులనుగూడ జూడుమిక జంప 2576

## గుహుండు శూరపద్మునికడకు వీరబాహుని దూతగా పంపుట

అన మహాసేనాని యాశ్చర్యపడుచు
పని బూనెదను శూరు వసుధపై గూల్చ 2577
పని యేమియో ఆత్మయం దూహసల్పి
ఘన వీరబాహునుం గాంచి యిట్లనియె 2578
సురహితార్థంబుగా సురవైరి నగర
మరిగి యాతనితోడ ననుము నాయాజ్ఞ 2579
శూరదైత్యా యింక చూడు నీగతిని
రార పోరికి నీదు రాణువల్ గొనుచు 2580
మిక్కుటం బాయెరా మీదౌష్ట్య మెల్ల
గ్రిక్కింతురా పొగరు గడియ లోపలనె 2581
మీరింక నీధాత్రి మిగులగా ఘోర
క్రూరమార్గము వీడికొనుచు సద్వృత్తి 2582
నీదు కర్మాగార నిలయమౌ బుధుల
నాదరింపుచు నిండ్ల కనుపగా వలయు 2583
ఆవల మీవశం బైన క్షేత్రముల
నెవరివో యవ్వారి కీయగా వలయు 2584
మదము వీడుచు వేద మార్గమే గతిగ
మదినెంచి త్యాజముల్ మానగావలయు 2585
అదిగాక మును సల్పినట్టి కర్మలకు
బదులు శిక్షలుగూడ బడయ గావలయు 2586
శ్రుతి మార్గమే యింక క్షితియందు పరమ
గతియన్న జ్ఞానమును గాంచగావలయు 2587
పెయ్యేల మీకిట్టి విధి నచ్చకున్న
కయ్యంబునకు రండు గణములతోడ 2588
అన వీరుడుప్పొంగి యద్భుతరీతి
గని మహాసేనాని కప్పుడు మ్రొక్కి 2589

అర్ణవంబులు దూల నాకాశమగుల
ఘూర్ణిల్లి గ్రహరాజి గులగులల్గాగ 2590
వేగాతిశయముచే వీరుఁడాకాశ
మా గుబ్బు గొననేగు నప్పుడొకలంక 2591

## అళీక ముఖాదులు వీరబాహునిచే చచ్చుట

పాలించు నా శూరు పాళెగాడైన
నాళీకముఖనాముడైన రాక్షసుడు 2592
ఆరువందల మంది నతనికి గూర్చి
వీరసింహుండనే వీరుని బనుప 2593
అతడు రౌద్రాకారుడై వీరుదాకి
శతతీక్ష్ణ బాణముల్ సంధించియేయ 2594
వెరఖడ్గమున వాని వివిధాయుధముల
నసిజేసి ఖడ్గంబు నుంకించివైవ 2595
వీరసింహుండేగె పితృపతింగనగ
తారు మారయ్యె న త్తటిగణంబెల్ల 2596
అతిమానుడనెడి వా డప్పుడు దాకి
క్షితి గూలె దనుజేంద్రసేనుడు గూలె 2597
వీర బాహుండంత వినువీధికేగి
వీర మాహేంద్రింపు వీటిని జేరి 2598
అరసి యుత్తర పూర్వమైన కోటలను
గరిమ దక్షిణ మందు గాంచెనాగాస్య 2599
అప్పుడా నాగాస్యు డాతని గాంచి
చెప్పు మెవ్వడ వోరి చెనటి నిన్గాంచ 2600
అమరుల వాడవై నట్లు దోచెడిని
కుమతి నిన్నిప్పుడే గూల్చెద చూడు 2601
మని పూని యతనిపై నచలంబు నేయ
గను వీరు మెయినంటి కాళ్యపి బడిన 2602

గదవైవ వీరుండు కరము చేబట్టి
యదిరి రాక్షసు నేయ నాతండు గూలె 2603

## వీరబాహువు సూక్ష్మాకారుడై వీరమాహేంద్ర పట్టణములో దిరుగుట

అంత సూక్ష్మాకారు డౌచు వీరుండు
అంతరిక్షముననే యరిగ దేవేశ 2604
గోపుర ప్రాకార కుడ్యముల్ దాటి
యాపురంబున వీధు లన్నిటిని గాంచి 2605
ఏగ నేగగ నొక్కయెడ జయంతాదు
లాగుబ్బుగా నేడ్చునట్టి చెఱసాల 2606
గని చాల సూక్ష్మంబుగా వారి కగుచు
చనె మీకు కష్టముల్ చాల శుభమౌను 2607
తారకాసుర క్రౌంచ దనుజులు వడిరి
శూర సింహాసనుల్ శూన్యించ గలరు 2608
అని తిరోహితుడైన అమర సంచయము
కనువిచ్చి నటనేమి కనబడకుండె 2609
అంత వీరుడు సూక్ష్మమౌ చేగి యేగి
అంతికంబున గాంచె నప్పుడు రత్న 2610
సింహాసనుడు చీన చీనాంబరుండు
సింహవక్త్రుని తోడ చెలగుచు దైత్య 2611
వర్గముల్ కొలువగా వాద్యముల తోడ
స్వర్గవాసులు సేవ సల్పుచుండంగ 2612
శూరుడుండగ వాని శుంఠగానెంచి
ఆరీతి నటనొప్పు నట్టి వేతొక్క 2613
గద్దెపై తాను ధిక్కార మేపార
హద్దు పద్దును మీరి యతడు గూర్చుండ 2614

అతని తేజముగాంచి యసుర వర్గంబు
ఇతడెవ్వడో యంచు నెంచి గాంచగను 2615
శూరుడాతని వంక చురచుర జూచి
మీరి యీతీరుగా మెలగు చున్నావు 2616
ఎవ్వండ వీవు నీ వేటికిటు రాక
ఎవ్వడంపించె నీకేది దేశంబు 2617
ననుగాంచగా లేరు నలువాదులైన
మొనగాడవా నీవు మొండిధైర్యముగ 2618
జంకు గొంకును లేక సమపీఠమందు
అంకురించితివి నా కాశ్చర్య మొదవ 2619
అని కోప పడుచున్న నసురుని గాంచి
ఘన వీర బాహుడీ కరణి భాషించె 2620
నీ పరాజితులైన నిర్జరుల్ మునులు
ఆ పరాశక్తి దామంత ప్రార్థించి 2621

## వీరబాహుండు శూరునకు తనదూత కృత్యమును తెలుపుట

మనవి సేయగ నాపె మహాదేవునందు
అనువుగా జన్మించి యణతు దైత్యులను 2622
అన్నమాటను శంభునందు జన్మించి
యెన్న సేనానియై హెచ్చి లోకముల 2623
కధినేతయై తారకాదులను జంపి
అధి కృతంబుగనె నన్నంపె నీకడకు 2624
నీవశంబున నున్న నిర్జరాదులను
నీ విప్పుడే విడువు మింతియెగాక 2625
ఎవరి భూములు వారికిచ్చి గుహునాజ్ఞ
భువి వేదమార్గమును బొంది మదముడిగి 2626
మను డట్లు కాదేని మహిని తారకుడు
కనినట్టి గతియె మీకర్మ యందౌను 2627

అని తెల్పుమనె గుహుండని వీరుడన్న
కనకన నేత్రాగ్ని కణములురాల్చి 2628
చూచుచా వీరునింజూచి యిట్లనియె
కూరాత్మ నాముందు కూతువె యిట్లు 2629
నాకు లోబడినట్టి నాకుల నెల్ల
నేకరణి విడిపింతు నిల నాగుహుండ 2630
నగ బాలుడుగ నెంచి యట్లుంచి నాను
పొగరెక్క క్షణములో బోకార్తునన్న 2631
వీఱంపు వేడియై వినర దౌర్భాగ్య
ఈరీతి నాడుని న్నిల గూలనేయ 2632
ఆగుహుని యాజ్ఞ నాకమరియెయున్న
వేగ నీతలపుట్టె విదళించనటర 2633
అన శూరు డటనొప్పు యసురులగాంచి
పని మించె నికవీని బంధింపుడనగ 2634
పరిఘ పట్టిస ప్రాస పాశగదచక్ర
ధరు లాతనిం జుట్ట దలచి యాగుహుడు 2635
తలలు కంఠంబులు తనువులు గూడ
నలినలిగా జేసి నవ్వు చున్నంత 2636
శతముఖుండను వాడు చయ్యన దాకి
శత తీక్ష్ణ బాణములు చయ్యననేసి 2637
పట్ట బోయిన వాని బడవైచి కుతిక
బట్టి పీచిన వాడు పరలోకమరిగె 2638
ఆరీతి బలవంతులైన రాక్షసుల
వీరుండు సమవర్తి వీటి కంపించి 2639
పట్టణం బంతయును పడదన్నియపుడు
అట్టహాసంబుగా నంతరిక్షమున 2640
ఉదధులన్నియు దాటి యుద్ఘాటముగను
పదిలంబుగాజేర బాహు లేయుండు 2641

అతని కౌగిటజేర్చి ఆయాసముడుప
కతనెల్ల నెఱిగించె కార్తికేయునకు 2642

## శూర పద్మాసురుడు మంత్రులతో యోచించుట

ఈగాథ ఇట్లొప్ప అచట శూరుండు
ఆగంతుకంబుగా నసుర నాయకుల 2643
సభజేసి యిటుపల్కె షాణ్మాతురుండు
ఇభరాక్షసుని క్రౌంచు నిల గూలనేసి 2614
సుర పక్షమున జేరి శూరత్వ మెసగ
మరి సంధి నగరిలో మండితుండౌచు 2645
దూత పంపగ వాడు దుండగం బొప్ప
నేతీరు సల్పెనో ఈ రెఱుంగుదురు 5646
ఇప్పుడే మీరెల్ల యెంచి మీమదుల
కొప్ప రీతిగ దెల్పు డొక్కవాక్యమున 2647
కాలచిత్తుడు మహా కంఠమాయూర
శూలాతి ఘోరులు శుంభాదులెల్ల 2648
నేమేమొ యోచించి ఈ రీతి ననిరి
ఈమాత్రమునకు నీకేల యీ చింత 2649
అంతగా యుద్ధమే యైన నొక్కకరి
అంతమందింపగా నమరి యున్నారు 2650
అదిగాక మనకోడి నట్టి నిర్జరుల
గదిసి వచ్చిన వాని గణుతింపనేల 2651
సురలోక మొక్కొకరి చూక్కిలో మేము
హరియించగా సిద్ధమై యొప్పినాము 2652
అనుచుండ హరివక్త్రుడనె నన్నతోడ
కనుము నీవికనైన కాల బాధితము 2653
హరునితేజమును నీవల్పముగ నెంచి
పర మార్గమును బట్టి పాత్రికనెంచితివి 2654

ఈ యమాత్యుల మాట లెంతయునమ్మి
చేయ సంగ్రామంబు చేయి నిశ్చయము 2655
మన మూలమునగదా మఘవాదు లెల్ల
గనిరి కష్టము లట్లు ఘనవేద విధులు 2656
మన మూలమున గదా మహిని లుప్తించె
మన మూలమునగదా మహహానీయ తతికి 2657
కనరాని యిక్కట్టు గల్గె నీనాడు
మనకిట్టి చెడుపేరు మహియందు గలుగ 2658
అందుకై దేవాదు లందరును గూడి
పొందుగా జిచ్ఛక్తి బోర్రివ పార్థించ 2659
ఈతీప గుహుడుగా యెసగెనేగాని
ఆతడల్పుండుగా డదియును గాక 2660
హరునిచే మనమంది నట్టివరములను
ధర నూట ఎన్మిదై తగు యుగంబులుగ 2661
నైయొప్పు నాయుష్య మది క్షీణమయ్యె
ఆయత్త మాయె మన కంత్యంబు గూడ 2662
మరచియే మనలోడ మహదేవుడనియె
మరణంబు దన కృతంబౌను మన కనుచు 2663
అదియెల్ల బరికించ నగ్రజా మనకు
తుది కాలమయ్యెనా దోచె రూఢిగను 2664
కనుక సందియమేల కార్తికేయునకు
మనము మ్రొక్కినచాలు మహనీయుడౌట 2665
మనల సత్కృప తోడ మనుచునుగాన
గనుమింక నట్టి మార్గము మంచిదనగ 2666

## శూర పద్మాసురుడు తమ్మునకు జవాబిచ్చుట

శూరు డనుజునివంక చుఱచుఱ జూచి
యోరి దౌర్భాగ్యుడా యోసింహవక్త్ర 2667

ధర జన్మలకు మృత్యు తానమె మొదల
మరణముఁ గెలువగా మహినోపగలరె 2668

మరణ జన్మలు జీవి మరచుట్టు లౌను
కరము మరణంబన్న కాలాను సరణి 2669

ఈ దేహమును వీడి ఇంకొక్క ప్రాప్త
మౌ దేహమందుంటె యౌనురా ధాత్రి 2670

జ్ఞానవంతులు చుల్కనగ నెంతురీని
గాన మరణ భయంబు గట్టి పెట్టింక 2671

అసుర జాతిని బుట్టి యబ్జజాండముల
వెతనేలి దీక్షతో వీరయాగముల 2672

ఎన్నియో సల్పి యీ హీన మృత్యువున
కెన్న భీతిల్లగా నెంత వారమురి 2673

క్రౌంచతారకు లట్లుగాగ మూకుండు
ఎంచ నిట్లయ్యెనం చెంచరే సురలు 2674

మనకర్మ ఫలమెల్ల మనము గాకుండ
అనుభవింతురె యన్యు లట్టి వికనేల 2675

వినుము నిశ్చయమింక వీరచిచ్ఛక్తి
మనల జంపగనెంచి మహాదేవు కొదవ 2676

చంప కెట్టులబోవు చచ్చు కాలమున
కంపించ తొలగునె కాల బాధితము 2677

మనమాయువై పోవ మనమెట్లు ధాత్రి
మన జాలుదుము రోరి మనగోరుటెల్ల 2678

కష్టముల్ జెందగా గాదొక్కొ నీదు
యిష్టమౌ నట్లుగా యిలనుండు మేను 2679

జన్య యాగమొనర్చి జగములమెచ్చ
అన్యధాత్వము మాని యాపరంజ్యోతి 2680

యందు లీనింతు నే నంత్య కాలమున
నందంబుగా నని హర్యక్ష ముఖుడు 2681

అననోడి తనయన్న నాతడు మెచ్చి
అనికి సద్ధంబయ్యె నాతడుగూడ 2682

## షడానన శూర పద్మాసురులు యుద్ధమునకు తారసిల్లుట

ఈరీతి వారంత సచట సేనాని
భూరి కోట్లకు మీరు భూతవాహినులు 2683
మఱి గణాధిపులును మహిత విగ్రహులు
కరమొప్పు నవలక్ష గణములు రత్న 2684
సుతులైన సోదరుల్ చుట్టు బలియంగ
అతి మాత్రముగ సేన లన్నింటియందు 2685
తగిన వారిని గణాధ్యక్షులుగ జేసి
అగణితంబుగ దోగ నంత నారదుడు 2686
శూర నిగమము జేరి శూరా యుదేమి
కోరి యాహవమునకు గుహుడు నీదెసకు 2687
చేర నీవిట్లుండ క్షేమమా లెమ్ము
వారలను ఢీకొంట వశ్యకంబనగ 2689
ఆతడుం గూడ సైన్యాధినాయకుల
నాతిరుగా చేసి యఖిల సేనలకు 2689
వాని వరపుత్రుడై వరలు ధీరుడగు
భాను కోపుని మహా పతినిగా జేయ 2690
సన్నద్ధులై యసుర సైన్యముల్ వెడల
గ్రన్నన తత్పతుల్ ఖడ్గఖేటాది 2691
ఆయుధంబులతోడ నంట రౌద్రమున
నాయత్తుడై యప్పుడాతడు వెడలె 2692
తారకాసుర జిత్తు తన మహారథుని
వీర బాహునిగాంచి వీక నవలక్ష 2693
సేనలఁ మరి భూత సేనలఁ గొనుచు
భానుకోపుని దాకు పనికి బొమ్మనగ 2694

అతీరు సైన్యంబు లట్టహాసమున
భూత లాంబరములు ఘోరు కొనంగ 2695
దాకె నవాంపతుల్ దొర్కొన్నయట్లు
ఆకసానంతంబు లట దాకినట్లు 2696
సంకులం బడరంగ సైనికుల్ బెనగి
రంకూరితంబులౌ నట్టి రోసముల 2697
నొకని నొక్కడు బట్టి యుర్విపైకేయ
పరికటితంబుగ వానిపైదుముక నొకడు 2698
ఒకనితో పదిమంది యొకడు పదిమంది
నకలంకముగ దాకు చట్టహాసముల 2699
తొడల గొట్టుచు పైకిదుమికి శాత్రవుల
మెడల బట్టునొకండు మీదిరి రోసమున 2700
మీసంబులను ద్రిప్పి మీపై కుతికి
రోసంబులను దాకి రొప్పులతోడ 2701
అట్టిట్టు పోరాడ నందైన పాద
ఘట్టనంబుల ధాత్రి కంపించుచుండ 2702
ముక్కలౌ రథ్యముల్ మొగ్గు ఏనుగులు
చక్కలౌ రథములుఞ చక్రముల్గాగ 2703
వడిగూలు పెక్కముల్ బాహుశాస్త్రతతులు
నడయాడు పేరువులు న్నరములు గాగ 2704
రక్త వాహినులలో రహిభూత పేరిత
శక్తులాటల వేడ్క సల్పుచుండంగ 2705
అనిలాసురుని దాకెనపుడు సింహుండు
ఆని మయూరుని దాకెనపుడు నీలుండు 2706
గజముఖాసురునిపై గవిసె నామధుడు
విజయ సేనుని దాకె వీరరుక్షుండు 2707
మాననీయుడు దాకె మహిష రాక్షసుని
భాను కోపుని దాకె వడి దండకుండు 2708

అనిలాసురుని దాకె నాపుష్పముఖుడు
ఘన చిత్రసేనుండు ఖరముఖుం దాకె 2709
నీరీతి వారెల్ల రెసగి యొక్కొక్క
తీరుగా నొక్కొక్క ధీరు మార్కొంచు 2710
శరములం బరగించి చక్రముల్ రువ్వి
పరశువుల్ ఖడ్గముల్ ప్రాసముల్ వైచి 2711
గుంతలంబులు గుప్పి కూర్చి శక్తులను
పంతగింపుచు వైచి ప్రాణానలుడిగి 2712
పరవీర శవములఁ బరపి కుప్పలుగ
మరి ధ్వజంబుల గొట్టి మావులను గూల్చి 2713
అరదాళి ధరరాచి హస్తులను గూల్చి
విరుదులఁ బ్రకటించి భీభత్సనర్చి 2714
రక్త ప్రవాహముల్ రణధాత్రి బరపి
దిక్తటంబులుగూడ ధిమిధిమిలాడ 2715
బ్రహ్మాండ భాండముల్ బ్రద్దలైకూల
బ్రహాదులెల్ల దిగ్భ్రమల గూరంగ 2716
రణభేరు లటధాత్రి రణగణ మ్రోయ
తన శాత్రవు డెవండొ తన వాడెవండొ 2717
నేర్పరించగ రాక నిఖిల యోధులను
దర్పంబు లొప్పగా దాకి పోరంగ 2718

## భూతరాక్షస నాయకుల సంగ్రామము

అనిలాసురుని వైచె నపుడు శుంభుండు
అనిమయూరుని నొంచె నపుడు నీలుండు 2719
గజముఖాసురువైచె ఘనుడు మధుండు
విజయ రాక్షసు మించె వీక రుషుండు 2720
మానసీయుడు గెల్చె మహిషరాక్షసుని
ఖాను కోపుండును వడి ధండకుంగు 2721

అట్టి హాసములతో నంప వర్షముల
దిట్టంబుగా గురిసి తీవ్రకోపములు 2722
గూరి పోరగ భానుకోపుండు హెచ్చి
ధీరత్వమున నేయ ద్రుంచె దంష్ట్రకుడు 2723
దండ మేయగ బట్టి దంష్ట్రకుండధిము
ఖండించి రథమ్ము జెక్కలు సల్పిమాతు 2724
ధాత్రి పైపడగ వాడు ధద్దరిల్లుచును
ఆత్రంబు తోడ సౌందర్యదమ్ము వహించి 2725
వేల బాణము వేయ విట్ట తాట్టనముగ
పాల దంష్ట్రకుడును స్యందనం బట్టి 2726
పట్టి గిరగిర ద్రిప్పి పైకి విసరంగ
నట్టి ధాత్రిని గూలి యది చూర్ణమైన 2727

## భానుకోపుని విజృంభణము

భానుకోపుడు మహా భయదమౌ శక్తి
పూని యేయ నతండు భువి మూర్ఛవ్రాల 2728
అంత భానుడు దండినట్లై యొనర్చి
పంతగా బాణముల్ వేలు గురియించి 2729
భూత గణములనెల్ల పోరి పుచ్చుచుండు
రీతిగన్గొని ఘోరదీప్తి నవలక్ష 2730
వీర లాతని నొగి వివిధాస్త్రములను
ధారగా గురియించ దప్పించికొనుచు 2731
నేను కోట్ల శరంబు లెక్కించి వారి
బాణాసనము లెల్ల ఖండనేయ ధాత్రి 2732
వీరసింహుడు ధాకి వివిధాస్త్రములను
ధారగా గురియగా దర్పించి యతడు 2733
నారాయణాస్త్రమును నారించి వైవ
వీరసింహుడు ధాత్రి వెసమూర్ఛగూలె 2734

ర మావీర్తాండుండు వేల బాణముల
ధీర తన్గురిసియా ధీరు రథ్యముల 2735
ధరగొట్ట భానుండు దద్దరిల్లుచును
మరి యొక్కరథమెక్కి మార్కొని యేయ 2736
వీరమాహేంద్రి డవ్వీరుని దాకి
ధీరత్వమున నేయ దిర్దిర దిరిగి 2737
పలలాశి ఖడ్గంబు పరప మాహేంద్రి
నిలమూర్ఛ బఱుపగా హెచ్చి యావీర 2738
రాక్షసుండెదిరి యారాక్షసుదాకి
యాక్షణం బందు ఘోరాస్త్రముల్ వైచి 2739
కోటింమునురాల్చి గూల్చి టెక్కెంబు
మీటి సారధి నొక్క మేటి భల్లమున 2740
నేయగా భానుండు హెచ్చి వాహినుల
పాయ గొట్టగ వాని భవ్యరథ్యములు 2741
నంత నీశాత్మజుండద్భుత రీతి
అంతరిక్షంబుపై కపుడు జిమ్మంగ 2742
భానుకోపుడు రాత్రి బడిలేచి యతని
క్షోణి దూల్చెను నొక్క శూలముఁబైచి 2743
వీర మాహేశ్వరుడు వీరకాలుడును
వీరకేసరియును వీరనేత్రుకును 2744
అంతట నాదైత్యు నద్భుతరీతి
పంత గింపుచు దాకి భవ్యాస్త్రములను 2745
దనుజ నాయకులను ధరణీ పాల్జేసి
తనువులు జించి చిత్రిపు పథంగూర్చ 2746
భానుకోపుడు వారిపై నసంఖ్యాక
బాణముల్ గుప్పించ వారును నేయ 2747
అంధకారము గప్పియసుర శూరుండు
సంధించి బాణముల్ చాలయేయంగ 2748

## భానుకోపుడు వీరబాహువుని దాకుట

వీరబాహువు గాంచి వెసనారి గీటి
భోపన లోకముల్ బొబ్బరిల్లంగ 2749
తేరితాగున్న లేకమై దివిరిన రీతి
భూతేప నేత్రాగ్ని పొంగారు నట్లు 2750
భానుకోపుని దాకి భళిర యోదైత్య
ఆనందమాయెనీ అట్టహాసమున 2751
చలమున నను దాక నై యింకరార
తెలియు నీకో నాకొ తిక్కయిక ననగ 2752
భానుకోపుడు తేరి పారగాగాంచి
పూని నాముందు నీ పొగరేల వీర 2753
ఆనాడు దూతవై యార్భటిల్లితివి
యీనాడు యోధవై హెచ్చుచున్నావు 2754
కనుమింక నిను ధాత్రి గడియలో గూల్తు
నన దుష్టుడా దూతనై నేనురాగ 2755
ఏమూల నుంటివో యెఱుకయేలేదు
ఆమాట లట్లుంచి అనికి రమ్మనగ 2756

## వీరబాహు భానుకోపులు ఘోరముగాబోరుట

కనిదైత్యుడా రంబకముల నేయంగ
ఘన వీరబాహుడును ఖండించి మించ 2757
అని దైత్యుడుగ్రుడై యర్వదేయంగ
అనవర్గళంబుగా నవిగూఢ దుగ్రించె 2758
భానుకోపుడు హెచ్చి పదివేలనేయ
తోనవీరుడు వాని దూల్చు నిర్భరను 2759
ప్రళయ కాలాభ్రముల పగిది గర్జిలుచు
తలప విండ్లను రోహితంబులై యొప్ప 2760

శరరోచులెల్ల చంచలలుగానైన
మరిబాణవర్షముల్ మస్తుగాగురియు 2761
ఘనులైనవారి సంగర నైపుణంబు
ఘనదివ్య లనిమిష కట్టరుల్ గాగ 2762
వీరబాహుప్రు వాని విలుదుత్రించి యార్చ
మీరి భానుండొండు పేటి విల్లంది 2763
వీర బాహుని పైవ వీర రౌద్రమున
క్రూరాస్త్రమున దైత్య కోదండ మేసి 2764
కవచమున్నుకగా గడగి భానుండు
అవగుణింపకనేసె నయుతాంబకములు 2765
వీరు డట్లేయనా వీరు లిర్వురును
ఆరటింపుచు ఘోర నసురనాయకులు 2766
వీరబాహునుజుట్టి వివిధాంబకములు
క్రూరంబుగానేయ గుహుని ధ్యానించి 2767
అట్టహాసమొనర్చి అసుర నాయకుల
దిట్టంబుగా దిమ్మదిరుగ నేయంగ 2768
వీరబాహూ నిన్ను విడువ నేననగ
శూరపుత్రి యింక చూడరాయనుచు 2769
సవ్యాప సవ్య విస్తార రీతులను
సవ్యపక్కిని వారు నడపి తేరులను 2770
తీయుటల్ వేయుటల్ తెలియరాకుండ
పాయుటల్ దాకుటల్ భావింపరాక 2771
కొట్ల కుక్కలరీతి కవ్వించి కొనుచు
యేట్లాటలాడగా హెచ్చి వీరుండు 2772
భానుకోపుని మూర్ఛ బఱపి సైన్యముల
నోనేయ దైత్యుడును నూల్కొనియపుడు 2773
తనలోనెనెంచె నీతని నొంచు నట్టి
మొనగాడు లేడింక మూడు లోకముల 2774

గడియలోపల వీని గడతేర్చుకున్న
మడియ జేయడె నన్ను మచ్చరిక ననుచు 2775
పెల్లేయ నతడేయ పెనుమంట లెగసె
తల్లడిల్లెను లోక తండ మాపైని 2776
ఇరువురు విరథులై హెచ్చి వేర్వేరు
అరదంబులను నిల్చి యపుడు బోరంగ 2777
రాక్షసాధిపుని సారధిని బోకార్చి
పక్షస్థలిని జొన్పె ఘవ్యాస్త్రమొకటి 2778
అరదమొండెక్కి బోనంతలోనతని
తరక సంబును గొట్టి తనువునోనేయ 2779
ఔర వీడింక నా కలవిగాడనుచు
నారటింపుచు మోహనాస్త్ర మేయంగ 2780
మూర్ఛ నందిన వీరు మూర్ఖ రాక్షసుడు
ఆర్చి శిరమును గోయ నపుడెంచుచుండ 2781
శిఖి వాహనుడు రాజశేఖరాస్త్రంపు
ముఖ మహాస్త్రంబేయ మోహనాస్త్రమును 2782
భానుండు చీకటిం భంజించునట్లు
పోనార్చె తనవారు పొంగగా నపుడు 2783
అతిశయిల్లుచు వీరు డమిత కోపమున
క్షితిగూల్తునింక నీ చెనటి నటంచు 2784
పశుపతాస్త్రం బెత్తు ఫక్కి గమనించి
వశముగా దనియెంచి భానుడని వీడి 2785
పురము జేరెను బుధుల్ పొంగగానపుడు
కరము నాతీరు నాకర్ణించి శూరు 2786

## అతిశూర సురేంద్రులు యుద్ధమున కేతెంచుట

దారాత్రి వేగించి యరుణోదయమున
వారలన్ బనిచి తత్సర్వ లోకముల 2787

గల రాక్షసులను వేగమున రప్పించి
అల తారకుని పుత్రు హరివక్త్ర తనయు 2788
లతిశూరు డసురేంద్రులను వారిసైన్య
పతులుగా జేసి యొప్పుగ నంప వారు 2789
పటహ కాహళ ఢక్కా పణవాదులొప్ప
పటు వాజి రథహస్తి భటవీరు లెసగ 2790
సమయోద్ధితాద్ధ విస్తార ఘోషమున
భ్రమజెంద లోకముల్ ప్రళయమో యనగ 2791
పఱతెంచె శరజన్ము బలములు రాగ
నిరువాగు సైన్యంబు లెసిగి దార్కొనగ 2792
చరణ ఘట్టన రజచ్ఛయమెల్ల రేగి
తరణిని గప్పరక్తము దాని నణచ 2793
భూత సేనలు వీక పొంగి బడబాగ్ని
రీతి తరుగిరులెల్ల రెచ్చియేయంగ 2794
అసురులు నిజసాధ నాదు లేయంగ
వెస భూతసైన్యముల్ వెనుకంజలిడగ 2795
నాయకుల్ చెలరేగి నాకారి తతుల
నేయగ రుధిరముల్ హెచ్చగా దుష్ట 2796
ఖగ పిశాచాదు లాకలి దీర మెసవి
మిగులుగా శూరుండు మించి యదిగాంచి 2797
దశసహస్ర తురంగ దర్పితం బౌచు
ఆశని కల్పితమైన యరదమున్ బరపి 2798

## అతిశూరు డుగ్రునిచే జచ్చుట

కాలాభ్రమమురీతి గర్జించి బాణ
జాలమున్ వర్షింప నరగ నాభూత 2799
పతులలో నుగ్రుండు పగరపైనడరి
అతి చిత్రముగ శూరునంటి వర్మంబు 2800

చించి యరదము సేయ చెలగి శూరుండు
యెంచి వానిని రక్త మెసగగా జేయ 2801
రథరథ్యములగూల్చి రథసించి యతడు
ప్రధన మందతిఖురుపైకి లంఘించ 2802
మరియొక్క రథమెక్కి మారొక్కనియుగ్రు
సురము నేయగ హెచ్చి హుమ్మనిదైత్యు 2803
రథ సూతుకేతు రథ్యములను గూల్చి
యథమస్తునిగ జేయ నన్య రథమెక్కి 2804
అనలాస్త్ర మేయగా నయ్యుగ్రు డగ్రు
డసి దాని మ్రింగగా నసి శూరుడంత 2805
వారుణాస్త్రము నేయ వాడట్లు మ్రింగె
కోరి బ్రహ్మాస్త్ర మా క్రోశించిపైవ 2806
ఉగ్రుండు గుహునెంచి యుగ్రుడై దాని
నిగ్రహించిన వాడు నిశిత రోసమున 2807
నారాయణాస్త్రమును నాటనేయంగ
కోరియుగ్రుడు దాని గూడ భక్షించె 2808
ఆశ్చర్యమంది యా యతిశూరు డుగ్రు
నిశ్చయింపగ లేక నివ్వెర పడుచు 2809
పశుపతాస్త్రము నేయ పరికించి దాని
నిశితరూపము గాంచి నిలచి యుగ్రుండు 2810
బాణాసనంబు లప్పట్టున వదలి
స్థాణునెంచుచు మన స్థాణుడై యుంత 2811
అతని నంటక చేరె నాకసంబునకు
అతిరేకముగ నన్న నపుడు శౌనకుడు 2812
అనియె సూతుని తోడ నాయస్త్రమెట్లు
అనుపయుక్తంబయ్యె నాయుగ్రుపట్ల 2813
నన సూతుడనియె మున్నతిశూరునకును
ఘన మహేశ్వరుడిచ్చు కాలంబునందు 2814

ఆయత్త హీనుడై యదరి యేయంగ
చేయజాలదు దీని చేష్ట యేమియును 2815
అనె గాన దీని విధ మట్లయ్యె నింక
వినరయ్య నద్దాని విధమట్లుగాగ 2816
అతిశూరు డతి శూరుడౌచు నాభూత
పతి దండమున నేయ బట్టి తనచేత 2817
దాని చేతనె గొట్టి దైత్యుడీల్గంగ
పూని దివ్య గణంబు పొంగగా నచట 2818
సుమవృష్టి గురియగ చూచిహర్షమున
కొమరు సామియు మెచ్చె కోరి నాయుగ్రు 2819

## అసురేంద్రుని యుద్ధము

అదిగాంచి యసురేంద్రు డాగ్రహాండగుచు
పదులు వందలు వేలు బాణముల్ గుప్పి 2820
భూతగణములనెల్ల బోకార్చి హెచ్చు
రీతి గణ్గానియట్టె రేగి కనకుండు 2821
అతని రథమున వ్రాలి యతని గార్ముకము
క్షితిపైచి మించి యేసెను దేహమవియ 2822
ఒండు తేరత డెక్కి యేయ జిక్కకయె
మండి రివ్వున బంతి మాడ్కిగా నెగసె 2823
మత్తుండు దాని యా మనుజాళి యెడల
నెత్తుటం జొత్తిల్ల నెరవ బాణముల 2824
పడనేయ సింహుండా పట్ట జృంభించి
పడి రథ్యముల గూల్చ వాడుగ్రుడౌచు 2825
కుంతలంబున గొట్టి కుధరపై నేయ
అంతలో దండకుం డాతనిదాకి 2826
వాని రథమును పీచివైవ నొండెక్కి
పూవి దండకునేయ భూమిపై బడియె 2827

సోమకుం డడరి యాసురపై రిదాక
భీమాస్త్రముల వాని పృథ్వీపై నేసె 2828
విజయు డంతటదాకి వివిధాయుధముల
అజయుడై పోర దానతనిని దూల్చి 2829
దంచంబు దాల్చి యాదైత్యు డుగ్రముగ
గండడంచగ భూత గణములనెల్ల 2830
వీరబాహువు దాకి వివిధాస్త్ర సమితి
గూరిచి రువ్వగా గూలి యొక్కింత 2831
వీరబాహుని వేసి వీర రౌద్రమున
ధారకుంగొట్టి కోదండంబు దునుమ 2832
అతిడొక్క బలువింట నసురుని నేయ
నతడు ఖడ్గము బట్టి నాదైత్యురథము 2833
పైకెగసి తలబట్టి పడపైచి యతని
ప్రకటితంబుగ పీక పరపర కోసె 2834
అసురసేనలు దాని కావురు మనగ
వెస భూత పక్షంబు వీక్షించి వెచ్చ 2835

## శూరపద్మాసురుడు యుద్ధమునకు వచ్చుట

పతులీవిధంబుగా పడుటకు నోడి
దితిజు లెల్లను బాఱదిక్కులుపట్టి 2836
శూరపద్మాసురుడు చూచి కోపించి
ఘోరంబుగా నార్చి గుణము మ్రోగించె 2837
సుర తండములు వాని జూడ హడలెత్త
మరియు లోకములెల్ల మారు మ్రోయంగ 2838
సేనాధిపతులెల్ల చుట్టుక్రమ్ముకొని
పూనియేయుచు నుండ పొంగలించుచును 2839
పదులు వందలు వేలు పదివేలు లక్ష

గుదులు గుదులుగ పీక గ్రుమ్మరించుచును 2840
కాయముల్ తూట్లుగా గాయములజేసి
ఆయాస మొనరించ నరి నవలక్ష 2841
వీరులాతని దాక వేగంబ యతడు
వారినందరనేయ వాడి తనపేరు 2842
వీరమార్తాండుండు వీకదనుదాక
శూరుడాతని వైచె చోద్యంబుగాను 2843
వీరరాక్షసుడంత వేగ దాకొనుచు
శూరుకరమున నొప్పుచున్న కార్ముకము 2844
ధారుణిం బడగొట్టి దైత్యుడుగ్రముగ
వీరరాక్షసునెత్తి వినువీధి విసరె 2845
వీరమాహేంద్రుడు విల్లు మ్రోయించి
శూరుని పెల్లేయ చొక్కియొక్కింత 2846
వీరమాహేంద్రుని విసరి వేయంగ
వీరవరుండేసె వివిధాంబకములు 2847
శూరుడాతని వైచె శూలాకృతమున
వీరమాహేశుండు విశిఖంబులేయ 2848
శూరు డాతనిగూడ చొక్కించి మించె
వీరకేసరి హెచ్చి వీకనేయంగ 2849
శూరుడేయ నతండు చొక్కిధరవ్రాలె
వీరసింహుడు మహా వీరాంతకారి 2850
శూరాదులను గూడ చొక్కగానేయ
వీరబాహుడు రాగ వీక్షించి యనియె 2851
వారక దూతవై వచ్చి కొందరిని
గారించి యేగిన ఘనుడవా నీవు 2852
పోరు మిచ్చట నీదు పొగరడగింతు
మీరి నిన్ననిపిన మేటితో గూడ 2853

వన నంత మొనగాడ వొటచే నాడు
మని యెట్లొ నాచేత మహినిల్చి నావు 2854
అని శూరుడేయ నత్యంత శీఘ్రముగ
ఘన వీరబాహు జుల్కనగ నవిదుంచి 2855
శూరపద్మ నంతడు చుఱచుఱ జూచి
కూ్రరాంబకములచే గుర్చియని హెచ్చి 2856
కొటి బాణంబుల స్రూర్చి సారథిని
మీట శూరుడు వానిమెచ్చి యరదంబు 2857
తెర్శనేయగనొండు తేరతండెక్కి
పెల్లార్చి యాగ్నేయ వృషదశ్వ వరుణ 2858
యామ్య సుతార్మ సప్తాశ్వ శుభ్రాంశు
సౌమ్య కవ్యాద వైశ్రవణ పరమేష్ఠి 2859
దామోదరాస్త్రముల దైత్యునేయంగ
భూమిపై గూలె నప్పుడు వానిదాకి 2860
వీరబాహువుచాల విస్మయంబంది
యూరకాతని గాంచు చుండు శూరుండు 2861
అగుదువు రోరి సాహసుడ వీవనుచు
ఎగతాళిసేయగా హెచ్చి వీరుండు 2862
పాశుపతమున నేయ పలలాశిగూడ
ఆశరమె యేయగా నవిరెండు గూడ 2863
అవనిపై గూల నత్యధిక బాణముల
నవగుణింపక నేయ నధికరోషమున 2864
శూరుడేయ నతండు చొక్కిధరవ్రాల
పూరించి శంఖంబు బొబ్బరిల్లుచును 2865
దివిజసేనల నేసి దీప్తించు చుండ
గవిసె సేనాని యదిగాంచి తీవ్రమున 2866
రణభేర్లు మోర్యగా రాక్షసుండతని
గని పల్కెనిట్లు నీ గణనాధు లెల్ల 2867

పడుచైన గని నీదు బాల్య చాపలము
విడువుమికనైన నీ విష్ణ్వాదిసురల 2868
చందమౌదువన నా షాణ్మాతురుండు
మందస్మితుండౌచు మనిజాశి కనియె 2869
భేషభేషిక నట్టి బింకమేపార
రోషమెల్లను నాకు రూపించు మిచట 2870
అనగ శూరుం దప్పు డట్టహాసమున
గుణనాద మొనరించ ఘూర్ణిల్లె ధాత్రి 2871
కార్తికేయుడొనర్చు కార్ముక ధ్వనికి
ఆర్తత్వమొందె నీ యబ్జ జాండంబు 2872
శూరుండు రోషమున సునిశితాంబకము
లారూఢముగనేయ నాగుణుండేయ 2873
నొకని నొప్పక నొక్క డొకనిపై గవిసి
ప్రకటితంబుగ బోర బాహులేయుండు 2874
సరగ సూతుని రథాశ్వములతో గూల్చి
మరియూర్చ శూరుండు మహిత శూలమును 2875
అడరించగా దున్ర్రించి యాంబికేయుండు
వడికిరీటంబేసి వర్మ మవియించ 2876
అంతలో రాత్రించరాధి పతులెల్ల
పంతగించుచు క్రమ్మి బహుళాయుధముల 2877
పరుప శక్తిధరుండు పరికించి వీక
తరణికోటి ప్రభల తనరుచక్రమును 2878
కరమున వీక నాకర్షించిపైవ
పరగి దెసలెల్లెడల భగభగమనుచు 2879
లాఘవంబున పైకి లఘించ గాంచి
యాఘనుండరిగె గేహపు జాడబట్టి 2880
సురమహాసేనాని చూచి దన వారి
పురలుంఠనము సేయ బోవుదీ యనగ 2881

సందడింపుచు బోయి సాలముల్ వైచి
అందందు మార్గంబు లరికట్టుచుంత 2882

## అతిఘోరుని మేఘుడు వధించుట

అదిగాంచి పురరక్షకతిఘోరదైత్యు
డెదిరించ సేవతోనెనగె సంగరము 2883

అతిఘోరు డతిఘోరుడౌచు ముసలంబు
నతిఘోరముగ బట్టి యార్చుచెల్లంగ 2884

భూతసైన్యములెల్ల బొంద దైన్యంబు
భూతనాయకులలో భూరి మేఘుండు 2885

పర్వతంబేయ నా పలలాశి గూల్చ
పర్వున మేఘుడప్పలలాశి వీవ 2886

నసురుడా విసురుచే నవనిపై గూలి
వెసదన్నుకొని వేగ విడచె బ్రాణంబు 2887

భూత సంఘంబెల్ల బురుజులు బీకి
ఆతీరుగా గోపురాదులవైవ 2888

బృందారకులుగాంచి బిక్కటిల్లుచును
సందడింపుచు హెచ్చ నర్వనగరంబు. 2889

ఆభీలగతి నాశ మౌనట్లొనర్చి
భీభత్సుగా జేసి పేర్చి యార్వంగ 2890

భానుకోపుడు తండ్రి పదముల కెఱగి
దీనుడై యపుడైన తెలగెటిగించ 2891

## భానుకోపుని రెండవ యుద్ధము

ఆతడుల్కుచు వానికప్పు డిట్లనియె
నేతీరుగానైన నణతునె గుహుని 7892

వీరబాహుని జంపు విధమెట్టులైన
నారయు మీవంచు నాతని బనిపి 2893
దనుజ శిల్పికి దెల్ప తక్షణ మతడు
ఘనముగా పూర్వపై ఖరి తీర్చె పృధివి 2894
అంత మహాకాయుడనువాని వీటి
కెంతయు గాపుగా నేర్పాటుజేసి 2895
భానుకోపుడు మహాభక్తి చేకూర
వాని యవ్వను మహాభక్తితోదలచ 2896
అరుదెంచగా మ్రొక్కి యవ్వనాచేత
దురమునందున వీరు దున్మించగా జేయు 2897
మన సంతసించి యూయమ్మ మాయాస్త్ర
మునునిచ్చి దీననేపున గల్గుశక్తి 2898
ఒకదినంబున శత్రు నొంచి యొప్పారు
ప్రకటితంబుగ నంతపైన గాదనుచు 2899
నాపె యేగగ నాత డతిశయంబంది
చాపతూణీరాది సర్వసాధనల 2900
నొప్పి యసురులు గొల్వ హోయలుగావెడలి
తప్పెటల్ మురజాది ధ్వనులుల్ల సిల్ల 2901
అనిధాత్రిజేరి తురగాస్యునిజూచి
చని వీరబాహుతో సరగ నిట్లనుము 2902
మొనగాడవైన నిక మొనలతోరమ్మ
మన నాతడప్పుడే యరిగి యా గుహుని 2903
సభనున్న తద్వీరు జయ్యన బిలిచి
అభియాతి పేరుతో నంతయు దులుప 2904
భగ్గునమండి యాబాహులేయునకు
అగ్గలికతో మ్రొక్కి యడుగ తదాజ్ఞ 2905
ఆనతియ్యగ నాత డద్భుత రీతి
పూనిసేనల తోడ భువనంబులదర 2906

అరదమారోహించి యార్పుటిల్లుచును
మురజాది వాద్యముల్ మోృయుచుండంగ 2907

## వీరబాహు భానుకోపులు ఘోరముగా బోరుట

సర్వసన్నాహుడై శరజన్ము దలచి
గర్వించుచున్న రాక్షస సేనదాకె 2908
రణ వాద్యముల ఘోర రవముప్పతిల్ల
గుణరణ ధ్వనులను ఘోరంబుగాగ 2909
ఒండొరుల బాణాదు లొండొరులు దునుమ
పిండి పిండిగరాలి భీభత్సగాగ 2910
కరములు చరణాక్షికములును ధాత్రి
బరగ యోధుల యందు భటుడొక్కభటుని 2911
నేలగొట్ట నొకంపు నింగి విసరంగ
చాల గెల్చిన యప్డు సంతసంపుచును 2912
కొంద రద్భుతముగా కొందఱన్నూల్చి
చిందములూర్పించి చిందులేయంగ 2913
రక్తంపు వాహినుల్ రణధాత్రిహెచ్చ
శక్తితో బోరాడె సర్వసైన్యములు 2914
భానుకోపుం డంత్య భానుండె ననగ
పూని భూతంబులఁ బొరిబుచ్చుచుండ 2915
వీరబాహువుగాంచి విలయ రుదుృడన
కోరి యాతని దాకె గోపురుండౌచు 2916
పంచాస్యములు మహా భల్లూకములును
యెంచ శార్దూలంబు లిభరాజములును 2917
దారుకొన్నట్లుగా దాకి వారంత
పీపులై యేట్లాడ విశిఖంబు లెల్ల 2918

తారా పథంబున న్దారి సర్పముల
తిరుగా బోరి ధాత్రిని రాలుచుండ 2919
సవ్యాపసవ్య విస్తార మార్గముల
నవ్యవై ఖరులలో నలువాదులెన్న 2920
రథరథ్యముల తోడ రహిని నాకంపు
పథమున న్విహరించి బ్రిహ్మలోకంబు 2921
నందు నొప్పుచు నెందు నరయ దారొచు
సందులేకుండ దీక్షణముగా బోరు 2922
చుండి దైత్యుడు నీయ సునిశితాస్త్రముల
దండిగానేయ నాతండును హెచ్చి 2923
ధర గూల్చె సూతు కేతనముల తోడ
అరదంబు మరియొక్క నరదంబునెక్కి 2924
కరము వీరుని నేయ కంపించి యతడు
కరలాఘవం బొప్పగా నతనినేయ 2925
వారుణాస్త్రము నేయ భానుకోపుండు
వీరు డబ్బ్యమునను వెడలించె దాని 2926
అసురుండు కోపించి యనిలాస్త్ర మేయ
వెస బన్నగాస్త్రమున పృథ్వీపై గూల్చె 2927
గరుడాస్త్ర మేయగా కలుషించి యతడు
ధరగూల్చె వృషభాస్త్ర త త్తంబొనర్చి 2.28
నారాయణాస్త్రమును నాకారివైవ
వీరభద్రాస్త్రమున వీరుండు గూల్చె 2929
పశుపతాస్త్రంబేయ భవుని సుతుండు
పశుపతాస్త్రిముననే బడనేసె దాని 2930
నిపుణులై వారిట్లు నిగిడి పోరంగ
అపుడు భాస్కర బింబ మస్తాద్రి జేరె 2931
తఱియందు మదినెంచి దైత్యాత్మజుండు
మఱి యదృశ్యం బయ్యె మాయ రోదసిని 2932

అప్పుడు దైత్యుండేగి యనివీడి యనుచు
సపచితి భయము లేదనుచు వారుండ 2933

అతడు పొంచుండి యా యర్ధరాత్రిమున
అతిసూన మైన మాయాస్త్రంబునేయ 2934

అది మహాఘోరమై యరి పక్షమెల్ల
నడిమి వీరుండాది యైన నాయకుల 2935

అంబుధిని పైవ నా యసురాత్మజుండు
సంబరంబున నేగి జనకుని గాంచి 2936

పరిపంధి బలమెల్ల వధియింప బడియె
మరి వీరబాహుడును మరణించె ననగ 2937

తనకుమారుని మెచ్చి దైత్యుడానంద
వనధిలో దేలాడి వాని గీర్తించె 2938

ఇక్కడి కథలెల్ల నిట్లుండ గుహుడు
అక్కడగని యెల్ల నతనిదౌశక్తి 2939
గని మాయ బాణముగా గాంచి కూల్చు
మని పంప నది కోటి యాదిత్య తేజ 2940

మెసగి రోదసిభాగ మెంతయు బర్వి
యసమ కాలాభీల మౌచు గర్జిలుచు 2941

వచ్చి మాయాస్త్రముకు వ్రచ్చి రూపరచ
చెచ్చెరగ సుఖశక్తి జెందిమరి లేచి 2942

వీరబాహుండాది వీరులెల్లరును
తారకాంతకుని సత్పదముల కెరిగి 2943

## భూతసేనలు పురమును దహించుట

అధిక రోసములతో నరుల గూల్చంగ
పథము నన్వేషించు పట్టు యోచించి 2944

వీరబాహుడు దనుజ వీరులను భూత
వీరులను దిలకించి వేల్లెత్తి చూపి 2945

మాయాస్త్రమున నట్లు మనల వంచించి
పోయిన దుష్టుడీ పురమున నుండు 2946
కాన సైన్యముతోడ కదలి మీరెల్ల
దానిని దహియించ దైత్యాధముండు 2947
వడి బయల్పడ దాకి వదలక పట్టి
మడియింతు నింక షాణ్మాతురు నాన 2948
యనపొంగి వారెల్ల రప్పుడే కదలి
ఘన పశ్చిమపు కోట కగ్నిమ్మగానచట 2949
అగు వ్యాఘ్రిదత్తుడా యార్పాట మెఱిగి
పగతురందాకె నొప్పగు సేనతోడ 2950
కరశూలమున వాడు కడు విజృంభించ
హరియను భూత నాయకు డంత దాక 2951
వీరులై యొండొరుల విదళించి కొనుచు
తారు మారాచు నిద్దరు పోరపోర 2952
వ్యాఘ్రిదత్తునికైనెత్తి వైచి మెడనొక్కి
శిక్షించె బలిమిచే చిదిపి బోకార్చె 2953
అంతభూతబలంబు లార్చి ప్రాసాద
సంతతుల్ బడవైచి శాలలం గూల్చి 2954
మూకలం బోకార్చి ముట్టించి పురము
నాకీలి కర్పితం బంత సేయంగ 2955
దనుజాలయములెల్ల దహియింప బడగ
దనుజు లేద్వగ కాపుదమజులం దొకడు 2956
శూరపద్ముని తోడ చొప్పెల్ల దెలుప
మీరి యాశ్చర్యమున మేను భగ్గుమన 2957
చిందువందొచు నటచేరి సారథిని
స్యందనంబును దెమ్ము షణ్ముఖుండాది 2958
శాత్రవుల బలియిత్తు క్ష్మాస్థలి కటంచు
నాత్రంబుగా పల్కి నసురునిగాంచి 2959

సుతుడౌ హిరణ్యకాసురు డిట్లు పల్కె
మతినెంచు మాతండ్రి మంచి చెడ్డలను 2960

## హిరణ్యకాసుర శూరపద్మాసురుల సంవాదము

తెల్పుచుంటిని మహాధీమతుల తెలుగు
అల్పబుద్ధుల కౌనె యవని లాభంబు 2961
ఆసక్తి నను మితంబైననే మేలు
ఈసుకూడదు ధాత్రి నెంతవారికిని 2962
కశ్యపబ్రహ్మకా ఘనమాయ యందు
దృశ్యమైతిరి మీరు తేజముల్ వెలగ 2963
అసురలోకముకెల్ల నధిపతులౌచు
ఎసగి వారిలయందు నీశ్వరు కరుణ 2964
ఘన వీరయాగ సంఘటనల చేత
యనలాక్షు మెప్పించి యధికులైనారు 2965
దానితో బరితృప్తి దారి గాంచకయె
మానవాదులనింక మౌని సంతతుల 2966
గారించ మీకెట్లు గలుగును సుఖము
ఆరీతిగా భవత్కారా గృహముల 2967
ఇల్లాండ్రు బిడ్డలను యెడబాసి సురలు
అల్లాడు చుండిరే యదియెల్ల మనల 2968
కట్టి వేధించదే క్రౌంచమ్ముడనగ
ఎటివాడంచు నీవెంచు చున్నావొ 2969
మనచేతలకు నోడి మహిత మౌనిష్ఠ
ననిమిషాదులు శక్తి నాహూతుజేయ 2970
ఆపె మహాసేను డై మనల గూల్చ
నీపగిది జూపట్టి నీకు తేజమున 2971

వీరహృవుగూడ వీక నాశక్తి
ధీరాంశయే యౌను తెలియుమో తండ్రి 2972
కనుక వారల దాకి కంన నేగెల్తు
వను మాటలను మాని యమరుట విడచి 2973
ఇప్పడైనను వాని నెంతయు జేరి
తప్పొప్పుకొని మొ్రిక్కదయనేలుననగ 2974
శూరపద్ముడు దండశూకమై ననగ
ఓరి యేమంటివీ వూహించినావొ 2975
బోధించిరో యొండ్లు పొరదారి నీకు
ఆధార మేది నీవనిన మాటలకు 2976
లోకు లెవ్వరో చాల లోభులై కూయు
కాకి కూతల నెంచగా నౌనె నీకు 2977
తారకాసురకౌ్రించ దనుజులమైన
ధారుణి నేనిల్వదగునె హీనముగ 2978
ఎట్లైన మనమట్టి హీనమౌ బ్రిదుకు
కెట్లోర్వగల ముర్వి నికనుండుకన్న 2979
పోవుటేమేలు నా బుత్రిద నోడి
దైవ నిర్ణయమంచు దలచి యిట్లనియె 2980
అయ్యారో తెలియకట్లంటి క్షమియించి
కయ్యంబునకు బంపు కరుణతో ననిన 2981
శూరుండు తలయూచి సుతుని బొమ్మనగ
నారటింపుచు నాతడప్పుడు వెడలె 2982

## హిరణ్యాసురుడు యుద్ధమునకు వెడలుట

పటహ కాహళ ఢక్కా వాద్యాదులెసగ
పటుతర వాహినుల్ బలియ మాతంగ 2983

తురగ రథాళితో తూర్ణంబ యరిగి
పరగ గాంచెను భూత సైన్యవాహినుల 2984
తనసేన నాల్గుగా తనర భాగించి
అనవరోధకముగా నతడు జృంభించ 2985
అది వీరుడూహించి యతని వాహినుల
పదిలంబుగా నల్లె పాయ లొనరించి 2986
పరగు ముద్గర భిండివాల చక్రిముల
మరియు తోమరముల మార్గణంబులను 2987
పోరాడ నవియెల్ల పొడిపొడిగాగ
భూరి రాక్షసులును భూతసైన్యములు 2988
కరనాసికాంగుళీ గళశిరః కర్ణ
చరణాక్షికటిదంత జంఘాది మాంస 2989
భగ్నులై రక్తప్రవాహ సంకీర్ణ
మగ్నులై యాయుద్ధ మహినెల్ల నొప్ప 990
ఆతురంబుగ దాకి యా హిరణ్యకుడు
భూత గణములనెల్ల బోకార్చుచుండ 2991
నీలుండెదిర్చి నిలు నిలు మంచు దాకి
చాల భూధరమేయ చలియించి యతడు 2992
శితశరంబులు గుప్ప జృంభించి నీలు
డతని రథంబుతో నంతబై కెత్తి 2993
దిరదిర పదిసార్లు దిప్పి యుప్పరము
కరము జిమ్మ రథంబు కాళ్యాపిస్నూల 2994
లేచినీలుని నేయ లెక్కింపకతడు
ఊచిగదనేయగా నొచ్చి దైత్యుడును 2995
మాయస్త్రమేయగా మహిత నీలుండు
నాయెడ ధరగూల నదిగాంచి యటకు 2996
వీరబాహుండేగి విజ్ఞాన మనెడి
ధీరాస్త్రమునునేసి ద్రోళ్ళించి దాని 2997

వీరుండు రథరథ్య వితతి నోనేయ
ధీరత్వముడిగి సుస్థిర మనోవర్తి 2998
దారిగానగ లేక దైవాజ్ఞనెంచి
పారి యర్ణవములో బడి మత్స్యమయ్యె 2999

## అగ్నిముఖుడు యుద్ధమున కేతెంచుట

అదివిని శూరుం డహంకరింపుచును
బదులాడగా నోటుబడి యుండ గాంచి 3000
ఆ హిరణ్యుని తమ్ముడౌ నగ్నిముఖుడు
ఊహించి తనతండ్రి కొప్ప నిట్లనియె 3001
కష్టముల్ రావొక్కొ కాలానుసరణి
భ్రష్టవైఖరి గూరి భ్రమచెందనేల 3002
ఏ కొందరో బోవ నింతగానీవు
చీకాకు జెందగా చెలగునేతండ్రి 3003
మన బలం బావంత మడియనే లేదు
నను బంపు మీరెల్ల నన్ను మెచ్చంగ 3004
వీరబాహును పట్టి వేగ దెచ్చెదను
ధీరత్వమున నన్న దేవారి మెచ్చి 3005
అతని బొమ్మనగ వా డఖిల శస్త్రాస్త్ర
వితతి నొప్పుచు మహా వీరుల తోడ 3006
భేరీ మృదంగాది భీషణార్భటుల
నారడంబుననేగి అరిసేనదాకె 3007
ఈ రీతి సైన్యంబు నెంతయు దాకి
పోరాడు చుండనా స్ఫోటించి ఖాత 3008
వీరు లెల్లెడ దాకి విశిఖాళినేయ
క్రూర రాక్షసులందు కుంభ ప్రచండ 3009
సోమ కంటక మహా శూలవు జంఘ
భీమ ముఖాదు లుప్పెన క్రమ్మ రీతి 3010

జృంభించి భూతాళి జీకాకొనర్చి
గంభీరముగ నార్చి గారింపుచుండ 3011
వీర పురందరుడు వీకతో దాకి
వారి రథములనెల్ల వ్రక్కలుగ జేసి 3012
వారి నందరనేస వారిలో కుంభు
ధారుణింగూల్చ నత్తరి నగ్నిముఖుడు 3013
శరవేగమున దాకి శక్తి యడరించ
ధర మూర్ఛవాఱె నత్తరి దానిగాంచి 3014
వీర బాహువు రాగ వెసనగ్నిముఖుడు
ధీరత్వమున పల్కె తెలియరా వీర 3015
విని యుంటి మున్నె నీవృత్తాంతమెల్ల
క్షణములో నిన్ను కాశ్యపి గూల్చకున్న 3016
నామీసమును దీసి నాతి వేసమున
నామెను బొరిగొందు నాఖడ్గముననె 3017
యన వీరబాహు నా యగ్నిముఖు చూచి
చనిన వారెల్ల నీ చక్కి మొనగాండ్లె 3018
కుడువ బోవుచు నేల కూరాకు రుచిని
అడుగ బోయెదవుర మ్మనికింక ననగ 3019
వీర బాహువు దైత్య వీరులు ద్దండ
ఘోరులై యొండొరుల గూల్చ నెంచుచును 3020
కడవ పోతల రీతి కఱకు బాణముల
కడు వడి గుఱియ రాక్షసుడొక్కపెట్ట 3021
పవన యామ్యాదిత్య పావకాస్త్రముల
అవ గుణింపక నేయ నావీరుడడచి 3022
వక్షస్థలము నేయ వాడు ధర వ్రాలి
యాక్షణంబున లేచి యతడొక్కశక్తి 3023
ఆహూతుగాజేసి యద్దాని బనుప
నాహవంబున శక్తి యద్భుత రీతి 3024

భూత గణముల నెల్ల భూమి పాల్జేసి
భూత నప్పెడి రీతి గని వీరబాహు 3025
తన శక్తి నస్త్రముల్ దగ నేయ వాని
గొనక నాతనిపైకి కుప్పించ నతడు 3026
వడి నొక్క తన్నుచే వసుధపై గూల్చి
పిడికిటి కొలదిగా బేర్చి యేయంగ 3027
హడలి రక్తము గ్రక్కు చాశక్తి వడిన
కడు నవ్వి రా సురల్ గగన మార్గమున 3028
అగ్నిముఖుండేయ నా వీరబాహు
అగ్నిహోత్రుని లీల నతనిపై కుటికి 3029
పడవైచి హస్తముల బాదముల బొడవ
విడచెను బ్రాణముల్ వెస నగ్నిముఖుడు 3030

## శూరపద్మాసురుని కుమాళ్లు వేయిమంది యుద్ధమునకు వచ్చుట

చారులంతట నేగి సరగున పురికి
శూరపద్మాసురుని జూచి విలపించి 3031
యగ్ని వక్త్రుండీల్గె నాహవం బందు
భగ్నమయ్యెను దైత్య బలము లన్నియును 3032
అని తెల్పగా శూరు డవనిపై గూలి
తన మనంబున దుఃఖ తప్తుడై యుండ 3033
అతని పుత్రులు వేయు లతనితో సములు
అతిరథుల్ సకల శస్త్రాస్త్ర కోవిదులు 3034
అరుదెంచి తండ్రితో ననిరిట్లు జనక
కరమిట్లు విలపించగాదు నీవంటి 3035
ఘనుడు శాత్రవ పట్ల గనునె సందియము
వినుము మేమిక నేగి వీరు సైన్యముల 3036

బోకార్చి యతనితో భూత నాయకుల
నీకు సమర్పింతు మికనన మెచ్చి 3037
యత డట్లు బొమ్మనగ నంతట వారు
మితిలేని సేనతో మించు వాద్యముల 3038
మాతంగ తురగోష్ట్రి వాహిత యానముల
ఆత పత్రాదులౌ నట్టి చిహ్నముల 3039
వాహినుల్ మితిలేని వాహి నులట్లు
ఆహవధాత్రిపై కరుదేర నెదుట 3040
క్షారమేఘము లొప్పి కురిసె రక్తంబు
మీరి నక్కలు సారమేయ ముల్బూసె 3041
ఈవిధంబైన దామెంతయు గొనక
నావీరు లపుడేగి యార్భటిల్లంగ 3042
సైన్యముల్ దాకి భీషణ భాషణముల
విన్యస్త రోషులై వీక మార్కొనగ 3043
శూరపుత్రులు చాల చోద్యమానముగ
వీరు భూత బలాళి విశిఖాళినేయ 3044
విల్వజాలక భూత నివహముల్ భీతి
వెల్వెల బారగా వీరు నాయకులు 3045
శైల భూరుహ శిలా సార గద ఖడ్గ
జాల ఘాతములచే జంప రాక్షసుల 3046
నంత శూరుని పుత్రు లార్భటిల్లుచును
పంతగింపుల భూత పతుల నేయంగ 3047
భూతాది పతులందు భూరి మణిఘోష
పీత రుద్రాదు లుప్పెనరీతి రేగి 3048
బాణాదికములెల్ల బరగించనసుర
సేనాధిపతులపై చెలరేగి యేయ 3049
ఘోరు ఘోరంబైన భూతనాయకులు
వీరాస్త్రములనేయ విచ్చి రాక్షసులు 3050

మాయ గప్పుచు భూత మండలంబులను
పాయ గొట్టుగ వారి పారుటను గాంచి 3051
భూత నాయకులందు భూరి విజయుండు
భూతేశు మదనెంచి పొంగి తూణీర 3052
చాప ధారుండౌచు శరముల జిమ్మి
యాపూర్వదేవతల నవనిపై గూల్చి 3053
ఘోరాత్మజులనేసి చొక్కించి వారి
ధారుణిం గూల్చగా తక్షణమెవారు 3054
జనియించి మరియేయ జనియించుచుండ
కని విస్మయంబంది కార్తికేయునకు 3055
పరిణుతించ క్షణములో బాహులేయుండు
కనుపించి లీలగా ఘన మంత్రమొండు 3056
ఎఱిగించ దానిచే హెచ్చి విజయుండు
మఱి మాహాసేను దన మదియందు నిలిపి 3057
భైరవాస్త్రం బేయ ప్రళయకాలంపు
భైరవాకృతముగా బర్వి ఘోరముగ 3058
చిటపట ధ్వని తోడ చెలగి యాదైత్య
పటలి నాక్షణమందె భస్మం బొనర్చె 3059
విజయుని మెచ్చిరా విబుధులెల్లరును
విజయుండవే యనియె విబుధ సేనాని 3060
సుమవర్ష మొన గూరె సుర వీధినుండి
ధిమిధిమి మొరయగా దివ్యవాద్యములు 3061

## ధర్మకోపుడు యుద్ధమునకువచ్చుట

చారులంతటనేగి సమరచరిత్రి
నీరీతి వినిచిరి హెచ్చి విజయుండ 3062

అనియందు నీ పుత్రులందఱ నొకడె
అనిచె బరలోకమున కన గుండె లవియ 3063
తగిలిన దుఃఖాబ్ధి దరిగాన కుండ
వగచు తాతనుగాంచి వానిపౌత్రుండు 3064
ధర్మకోపుడు పల్కె తాతాయిదేమి
కర్మమయ్యెను నీకు కంగారి పైతి 3065
నీవిట్లు తపియించ నిర్జరాదులట
గావింతు రెగతాళి గాన ధైర్యమున 3066
ననుబంపు శాత్రవుల నలినులిచేసి
కని వీరబాహువు గట్టితెత్తునన 3067
తనపౌత్రు ననుప నాతడును దివ్యాస్త్ర
ఘనుడౌచు సేనతో దరలిపోవంగ 3068
అదిగాంచి భూతంబు లార్పుటిల్లుచును
గదిసి రాక్షససేన ఖంగాగొనర్చ 3069
ధర్మకోపుడు హెచ్చి ధర్మంబు గీటి
మర్మంబులను జించి మందరంబనగ 3070
తిరిగి భూతగణంబు దిమ్మరవోవ
ధరనేయ వీరుండు తనహస్తమెత్తి 3071
పిలిచి యీతనిగూల్తు భీతిల్లనేల
సలలితంబుగ నంచు చాపంబు గీటి 3072
ధర్మకోపుని దాకి ధైర్యమేపార
మర్మంబు లంటగా మార్గణములేయ 3073
నొచ్చియూప్పుచు వీరు నూరు బాణముల
గుచ్చ వానిని లెక్కగొనక వీరుంతు 3074
తగు శరంబులనేయ ధర్మకోపునకు
పగుల వక్షము మూర్ఛబడి వేగలేచి 3075
శాతశిలీ ముఖాస్త్రంబులనేయ
నాతండు రోషించి యతనిపై దుమికి 3076

వానిరథమును బట్టి పైకి విసరంగ
పూని యాతండొక్క ఘూరిగదనేయ 3077

కరమునబట్టి యాగద నేలపైచె
మరిశూల మేయగా మడమచే ద్రొక్కి 3078

ధర్మకోపునినెత్తి ధరవీచి వీచి
మర్మముల్ బ్రద్దలై మఱిగూలనేసె 3079

## భానుకోపుడు తండ్రితో యుద్ధమాపెద మనుట

హత శేషులేగి యాహవ వార్తదెలుప
క్షితిగూలి మఱివేచి చిందువందొచు 3080

తపియించు తండ్రి నత్తఱి భానుకోపు
డుపశమింపగజేసి యొనర నిట్లనియె 3081

తండ్రీ యికేమందు తగభూత పతులు
గాండ్రించుచున్నారు కాలాను సరణి 3082

నగర లుంఠనమాయె నాకారులెల్ల
పగరచే హతులైరి స్రిధనంబునందు 3083

జయము వైరుల కంచు సరగ నామదికి
భయము తోచెనుగాన బాహులేయునకు 3084

పూని మనమికనైన బోయి ప్రణమిల్లి
సేనాని దయను నార్జింత మాయనగ 3085

నాజ్య సంవేగమౌ అగ్నిచందమున
ప్రజ్వరిల్లుచు పండ్లు పటపట కొరికి 3086

గెల్చిన నాడెల్ల గేరి యీనాడు
పల్చనైతి మటంచు ప్రణుతిసేయంగ 3087

నుమియరే ముఖమునం దువిదలు గూడ
సమయంబు దప్ప నీశ్వరుడైన సేయ 3088

గలదె యాప్తులనెల్ల కదన రంగమున
బలివెట్టి మనమెట్లు బ్రతికి యుండెదము 3089
నీవు భీతుడవైన నిలువు మీయింట
నావంతు నేజేతు నలుగురు మెచ్చ 3090
అనగ భానుండోడి యనియె జనకునకు
జనకా యిదేపోదు సమరంబొనర్ప 3091
ఈతేప వీరుడో యేనో ప్రాణముల
భూతలంబున నుండ బోలును గాక 3092
ఇరుపురమును గూడ నిల నుండమనుచు
మరిమరి రోషించి మచ్చరించంగ 3093
కనిశూరుడింక వేగమున బొమ్మనగ
తనమందిరముజేరి తగిన వేసమున 3094

## భానుకోపుని మూడవసారి యుద్ధము

భానుకోపుడు చిత్రభానుడోయనగ
ఆనీతమౌ దివ్యమైన రథమెక్కి 3095
వివిధాస్త్ర శస్త్రములు వెలుగ మాతంగ
అవిరళాశ్వరథాదు లంట తనవెంట 3096
వాహినీ వివహుడై వాద్యాళి లొప్ప
ఆహవస్థలి జేరి యార్భాట మొప్ప 3097
అరిసైన్యముల దాకి యంప వర్షంబు
గురియించ భూతముల్ ఘోరముగదాకి 3098
తరుగిరిపాషాణతతుల బాణముల
మరి ఖడ్గగదచక్ర మహిత బాణములు 3099
సాధనంబుల బోర శవముల వల్లు
గాధరాస్థలి గాగ కాకఘూకాదు 3100
లెసగగా భీభత్స మేపారుచుండ
నసుర సైన్యము లెల్ల నట్టిట్టు బర్వె 3101

భానుకోపుడు దాకి బడబాగ్నిరీతి
బూని యేయగ నొచ్చు భూతవాహినులు 3102

వీరబాహువుగాంచి విలయ కాలుడన
ధీరత్వమున నాపి ధిక్కార మొదవ 3103

ఆనాడు పారి నాపై ననేమయ్యె
ఈనాడు నాచేత నీల్గవే యనుచు 3104

పైవగా దనుజ నాయకుడు మూర్ఛిల్లి
ఆ వెంటనే లేచి యదర వీరుండు 3105

పావకాస్త్రం బేయ భానుకోపుండు
పావకాస్త్రముననే పరిమార్ప నతడు 3106

ఆరీతి హెచ్చగా నసురుడు మాయ
ధారియై సుడివోవు ధరనెల్ల దిరుగ 3107

వీరుండు గుర్తించి వీక రక్తంపు
ధారలం గ్రక్కగా దైత్యునేయంగ 3108

ఆతండు పూని మాయాస్త్ర మేయంగ
భూతసైన్యములెల్ల బొబ్బలువెట్ట 3109

వీరుండు విజ్ఞాన విశిఖముల్ వైచి
క్రూరమాయాస్త్రముల్ గుదురపై నేయ 3110

ఆరథస్థుడై మింట నగుపించనతడు
అరదంబుతో నేగి యసురుని దాక 3111

యుద్ధముద్ధృతమైన యోధద్వయంబు
యుద్ధ పద్ధతుల దామేయు చొంపొలి 3112

అభ్రిమెల్లను దూల నంప వర్షంబు
విభ్రమం బొప్ప గావించి మించుచును 3113

పంతంబు లొప్పగా పాద ఘట్టనల
నంతకంతకు హెచ్చి యార్భటిల్లుచును 3114

తమ తొడల్ ధట్టించి తాకుచొండొరులు
సమయింతు నిన్ననుచు చంగున నెగసి 3115

సింహనాద ధ్వనుల్ చెలగ సల్పుచును
సింహంబులన దాకి జీవాశ లుడిగి 3116
పోరుచుండగ వారి భూరి వేగములు
తీరు.గా మరి బర్వి దిక్కులఁ జించె 3117
పాదఘట్టనల సంబంధ మౌధూళి
రోదసిం బర్వగా రోసముల్ హెచ్చె 3118
భానుకోపుడు వేయు భల్లంబులేసి
పూని వీరురథంబును ధాత్రి నేయ 3119
వీరుడట్లే భాను విరథుని జేయ
వారు ఢీకొని రక్తప్లుతులై యంత 3120
పాయుచు డాయుచు బడుచు లేచుచును
కాయములౌ దూట్లుగా గాయముల్ గాగ 3121
ధ్వంసమై శల్యముల్ ధరరాలుచుండ
మాంసపుఁ ముద్దపై మహిగూల కూల 8122
భానుకోపుడు వీరు బరిఘతో నేయ
బూని వీరుడుబట్టి పొడువ వక్షమున 3123
పరమేష్ఠి దత్తమై పరగు నొకశక్తి
బరగించ నది వీరబాహుండు గాంచి 3124
రెవరగి షాణ్మాటుటు నేయ నొకశక్తి
తురుమాచు ధాత్రిపై తొరగుటగాంచి 3125
భానుకోపుడు గూడ బట్టి ఖడ్గమును
పూని పెనగిరి మహాద్భుతముగా వారు 3126
దేవతాసురవీరధీయు లాతీయ
గావించునట్టి యా ఖడ్గయుద్ధమున 3127
మండలాకృతులౌచు మలయు చొందొరుల
ఖండనం బొనరించు పట్ల వీరుండు 3128
అతని దక్షిణ భుజం బటె తెగనేయ
నతడు రెండవ హస్తమందు ఖడ్గమును 3129

పూనబోవగ బట్టి భూరినై పృణిని
వానిగూడను గొట్టి ధరణిసేయంగ
పక్షిరీతి నతండు బడ ధాత్రి దొక్క
యాక్షణంబున వీరు దట్టతో నఱకె
పూని గురిసెను దివ్య పుష్పవర్షంబు
లోన నాకసమందు దుందుభుల్ మ్రోగె
ఆరీతిగా దైత్యునట దున్మించి మించి
వీరబాహుడు భక్తి పిలసిల్ల గుహుని
పాదములపై వ్రాలి ప్రణమిల్లినంత
ఆదరింపుచు వాని నాంబికేయుండు
యొడలెల్ల నిమురగా నొప్పె తేజంబు
వడి బాహులేయుడా భక్తికి మెచ్చి
సంతసంబొప్పగా సాధు నీకోర్కె
లెంత యుందీర్తు నా కెఱిగింపుమనిన
నీపాదముల భక్తి హెచ్చు భాగ్యంబు
ఆపాదితము సేయు మన సంతసించి
యొసగి సుబ్రహ్మణ్యు డొప్పుగా వీడు
అసదృశుంగా జేసె నఖిలలోకముల
ధాత్రియందెవరేని తగ దీని నెన్న
శత్రుసంహారంబు సాధ్యమై తీరు
సిరి సంపదల ధాత్రి చెలగి యాగుహుని
కరుణచే శక్తిలోకంబు నందెదరు
పరశురాముడు దీని పఠియించి వేడ్క
అరికోట్ల విదళించె హనుమానుడల్లె
అసుర కోటులనెల్ల హతము గావించె
వెసబాండవులు దీని విన్న మాత్రమున
కౌరవ్యులనుగెల్చి ఘనత జేకొనిరి
వీరబాహుండట్లు విలసిల్లెనంచు

పగమూడు చెలంగించి ధన్యాత్ములార
ఆగణింతముగ విన్తు నావలి గాథ 3144

## భానుకోపుని మరణవార్తవిని శూరపద్మాసురుడు విలాపించుట

అనుచు నప్పుడునుంచి హతశేషు లేగి
వినిచిరా శూరునకు విపరీతరీతి 3145
కనకన మసిమెల్లగ్రీల ధరవ్రాలి
కినుచు దిక్కులనెల్ల కళవళింపుచును 3146
మినము రాయిగ మూర మహినుండి లేచి
తనవాడు దను జుట్ట తనయుని నెంచి 3147
పిలపించె నా నొసట విధియెంతవ్రాసె
నిలనిర్జరావళుల కెగతాళిగాగ 3148
నని కుమారుని రూప మాత్మ యందొప్ప
తనమహా దుఃఖాబ్ధి దవిలి యుండంగ 3149
అతని పట్టపు దేవియౌ పద్మకోమ
లతియేడ్చుచును వచ్చె లలనలతోడ 3150
హాపుత్రికా పోతివా నాదుతండ్రి
ఏపగిది జీవింతు మెవరురా దిక్కు 3151
ఎంతపాప మొనర్చి తేను నీధాత్రి
నింతయై తీరె నాకిట్లు విధి వ్రాసె 3152
ఆశలెల్లను దీరెరా తుట్టతుదకు
వంశమారగ మాకు వంచనయుగల్గె 3153
అని పుత్రనిర్యాణ మైన శోకమున
తనువు ధూళినిదోగ ధాత్రిపై బడుచు 3154
తన శిరోజము లెల్ల ధాత్రి వ్రేలంగ
తనము హారాదులత్తరి చూర్ణమంద 3155

ఎలుగెత్తి నాతండ్రి ఎటుబోతి వనుచు
తలను హస్తములతో తగ గొట్టుకొనుచు 3156

పలువిధంబుల నేడ్చి పడతి నెట్టెట్లొ
అలుక మానిచి పంచి యావలింపుచును 3157

తన దుఃఖ తీవ్రి మంతట కోపవహ్ని
గన సహోదరుడైన ఘనసింహ వక్త్రి 3158

పిలిపించి ఎఱిగించి వృత్తాంత మెల్ల
కలచి శత్రుల గూల్చగా బోదమనిన 3159

అనె సింహ వక్త్రుడా యన్నతో నిట్లు
మును నెంచి నట్లుగా మూడెమనకిట్లు 3160

ఇంతమందియు బోయి నెంతాయె నేడు
పంతగించితి మట్లు బాహులేయుండు 3161

డింభకుండంచు నాడిన ఫలంబబ్బె
శంభు నపత్యంబు సత్య సత్వుండు 3162

అని చెప్పగా హలా హల మయ్యె గాడె
చెనటి మాటలె నీకు చెవులలో జొచ్చె 3163

ఐన నేమాయె నీయాజ్ఞచే నేను
హూని నెల్లిట జన్యభూమిపై శత్రి 3164

వులగెల్తునని రాత్రిబుచ్చి యుదయమున
మిళితచందన దీప్త మేనితో గళిత 3165

కుసుమ ధామాంచిత కోవిదుండౌచు
అసదృశుండుగ నొప్పు చట్ట హాసమున 3166

## సింహవక్త్రుడు యుద్ధమునకు వెడలుట

ప్రాసాదికంబు లొప్పగ నశ్వతతుల
భాసిల్లురథ మెక్కి వాహినుల్ గొలువ 3167

రథహస్తి తురగ మారణ సాధనాది
విధుల వాద్యములొప్ప విపులాతపత్రి 3168

యుతుడౌచు వెడలగా నుగ్ర గృధ్రముల
తతులు గూబలును కేతనమందు వ్రాల 3169

బల్లమెల్లనుల్కా విపాతంబు సాగ
నిలచి గోమాయువుల్ నెటి గూయకూయ 3170

ఈతీరు శకునంబు లెంతగానైన
నాత డాహవధాత్రి కరుదెంచుచుండ 3171

పరమేష్ఠిలోనైన బిత్తిర్మ్మఖాళి
పరుగులెత్తుచు నేగి పార్వతీసుతుని 3172

కాంచి విలపించగా గద్గదికు లౌచు
నెంచి యాతడు రథంబిక దెమ్మనంగ 3173

వీరబాహుడు పల్కె వినయ మేపార
ఆరాక్షసుని తాక నన్నంపు మనగ 3174

చిరునవ్వు దళుకొత్త సెలవిచ్చె గుహుడు
భరిత శస్త్రాస్త్ర సంబంధమౌ రథము 3175

నందు సన్నద్ధుడై యంబరాభరణ
చందనాదులనొప్పి సరగ గోటీర 3176

మును దాల్చి సుమధామములనొప్పిఛత్రి
మును చామరాది సమ్మోహితుండౌచు 3177

సర్వవాద్య విశేష సహితుడై భూత
ధూర్వహుల్ గొలువగా దోగయుగ్రముగ 3178

ఇరువాగు సైన్యముల్ హెచ్చ తురగోష్ట్రి
యరదాది ధ్వనులెల్ల యలమసైన్యముల 3179

గర్జనల్ సెలగ నాకసమెల్ల బగుల
గర్జించి భూత సంఘములు జృంభించి 3180

తరుగిరి పాషాణ తతుల మహోగ్ర
శరగదా చక్రాది సాధనంబులను 3181
పోర బోరగ హెచ్చుఘాత సంఘముల
ధీరుడౌ సింహంబు ద్రెంకించి యసుర 3182
తండంబులను దాకి తన కరంబైన
దండంబుతో నేసి ధర గూల్చుచుండ 3183
అసురు సేనాధ్యక్షుడౌ దశాస్యుండు
అసమకీలి యనంగ నాసింహు నాగి 3184
శిత శరంబుల నేయ సింహుండు గినిసి
యతని నేయగ దండ మది దైత్యు దాకి 3185
ధరగూల దైత్యుడాతని శక్తినేయ
పరిమార్చె నరచేత బట్టి సింహుండు 3186
అసుర దేయగ శూలమదిబట్టి సింహు
డసమ రుద్రుడనంగ నసురునిదాకి 3187
వక్షముల్ గ్రుమ్మగా వడినెత్తు గక్కి
యాక్షణంబున నేగె నంతకుని గాంచ 3188

అసుర నాయకులంత నాసింహుచుట్టు
ముసురు కొనంగ నా మూకపై రుద్రు 3189
డెదుర వాని నెదిర్చి హెచ్చి దుర్ముఖుడు
పదులు వందలు వేలు పదివేలు లక్ష 3190
ఘన శరంబులనేయగా రుద్రుడంత
దునిమి దుర్ముఖునేయ ధూర్త బాణముల
మర్మముల్ బ్రద్దలై మరి బోరనోడి
దుర్ముఖుండెడ దారె దురమంత వీడి 3192
అప్పుడు మహాకాయు డయుత శీర్షుడును
అపకర్తలౌచు సింహాననుని గూడి 3193
శరముల దొరగించ సరగ ఘాతములు
తరుగిరి పాషాణ తతుల వర్షింప 3194

అవియెల్లఁజూర్ణించి యధికులై వారు
అపగణింపక నెత్తి యఖిల భూతముల 3195
జలధిలో వైచుచును చదల వీచుచును
పలుపుర ధాత్రిపై బడవైచి పట్టి 3196
పదముల నలుపుచు మఱి ముష్టి బొడిచి
అడిదాములను గూల్చి హుంకరింపుచును 3197
అట్టిల్లొనర్చగా నపుడు రుద్రుండు
పట్టి శూలం బొంటు బాహు దండమున 3198
అటనె మహాకాయుడనువాని నేయ
నటనె యారుద్రి సిహాసనుండేయ 3199
అతనిపై గిరవైచె నారుద్రి దంత
అతని దెబ్బకు మూర్ఛనయ్యె నరదంబు 3200
పదరి సింహాననుడు బాహువుల కొలది
గదలెత్తిపైవ నాఘనరుద్రిడోడె 3201
దండి సింహాననుని దాకి ఘోరముగ
దండమున విసర నాతని దాకి పడిన 3202
వడిగ దండిని సింహవక్త్రిుండు బట్టి
కడలి వైపున వేయగా లక్ష వీరు 3203
లటని మార్కొని మహా హుంకారములను
శిత శరంబుల నేయ సింహవక్త్రిుండు 3204
వేగ రీతిగ లేచి ఢీకొంచు వారి
వేగ దన శక్తిమై విసరి పాదముల 3205
నలిపి త్రొక్కుచు నింక నలినలి సేసి
బలివెట్ట గని వీర బాహుండు దాకి 3206
తూపులఁగా బఱపి నిర్ధూమ ధామముగ
ఆ పలాసులలనెల్ల నంత మొందింప 3207
రకంపు చేరులై రహి కబంధాది
యుక్తమౌ ఘాకాదులొప్ప మోదించె 3208

నప్పుడా తనిపుత్రు లౌశతాధికులు
కుప్పించిరా గాంచి కుప్పెకోలలను 3209
వారెనంతరనేసి వాక్రుచ్చతనను
వారుధనువుల వీడు బడడంచుఖడ్గ 3210
ములనేయ వీరు దమ్ములవానినెల్ల
దలగింజలుగ గొట్టి తీవ్రకోపమున 3211
వీరభద్రాస్త్రమును వీరుండుపైవ
వారలందరునొక్క వడిజచ్చిపడిరి 3212
అమరులు సుమవృష్టి యతనిపైగురియ
ధిమిధిమిమొరసె నా దివ్యవాద్యములు 3213
హరిముఖుండదియెల్ల నరయుచుగాంచి
కరముదుఃఖంబుచే గలుకోపమున 3214
వీరబాహునిజూచి వీకనిట్లనియె
ధీరనీవెవ్వరో దెలుపుముందనిన 3215
వీరబాహువునేను వీరశరజన్ము
చారుడను తమ్ముడను చరణసేవకుడ 3216
ఆనాడు దూతవై యరుదెంచిమిమ్ము
పూని కలవడజేసి పోయినవాడ 3217
తలచి వచ్చితి శక్తిధరునాజ్ఞ నేడు
కలగుండు వడజేయ గలన మిమ్మెల్ల 3218
అనగ మండుచువాని హరివక్త్రుడేయ
దునిమి నవ్వుచు వేయుదూపులదరించ 3219
దనుజుడాతని చేతి ధనువు వోనేయ
గని వీరు డొందంద గ్రవ్యాదుడేయ 3220
నరగ వీరుడు దైత్యు సారథిని గూల్చ
హరిముఖుండంత కాలాగ్ని చందమున 3221
ఖల్లంబు వేసె నంబరమెల్లనిండ
తల్లడిల్లిరి భూత తతులెల్ల వీరు 3222

డతని నాటగసేయ నసురుండు క్రోధ
మతియొంచు గర్జిల్లి మండితాస్త్రముల 3223
వీచుసేయనతండు విలయాగ్నిరీతి
ఆరాక్షసుని సేయ అతడును వేయ 3224
సరగదైత్యుడు వీచు చాపంబు దున్మి
మరియు నొండొందుచు మధ్యకాలమున 3225
రక్తస్రవంతుగా రహిసల్పె నతడు
సక్తిచే రధ్యముల జావేసి హెచ్చ 3226
సింహవక్త్రుండు యోచించి శాంబరిని
అంహస్సుపూరితంబైన పాశమున 3227
కట్టిపూర్వాద్రిలోగల గహ్వరమున
నట్టిపైవగ జాచులప్పుడే బోయి 3228
బాహులేయునకు దెల్పగ గోపమంది
ఆహవోక్త్రంబుగా నమరించి రథము 3229
తెప్పించి దానిపై దివిరి శస్త్రాస్త్ర
లొప్పగా గుహుడేగి యుద్ధంబొనర్చ 3230
భూతదైతేయులప్పట్ల శస్త్రాస్త్ర
ఘాతలం బాషాణ ఖడ్గఖేటముల 3231
ఘోరంబుగా బోర గుహుడు రౌద్రమున
పారగొట్టెను దైత్య బలములనెల్ల 3232
హరి ముఖుండును నేయ నతని భూతములు
తరుగిరిబాషాణ తతుల నేయంగ 3233
కనియుగ్రుడై మ్రింగ కర్ణనాసారి
ఘన రంధ్రముల వచ్చి కాల్నిలుపలేక 3234
పారువారును జిక్కుపడువారు గాగ
తారకాంతకు డేయ దైత్యుడును నేయ 3235
పంచాననాస్యుండు పరగి కోపమున
క్రౌంచఘ్ను ఘోరాంబకముల నేయంగ 3236

శరజన్ముపై దైత్య తండముల్ గవియ
మరివారలను గూల్చి మంత్రించినట్లు 3237

ఆరాక్షసుని ఫాలమందేసి యతని
ఘోరంబుగా మూర్ఛ గూర్చి బాశముల 3238

అదరిపాటుడిపి వీరాదులన్వీతువ
పదముల వ్రాలగా బాహులేయుండు 3239

కరుణించి రౌద్రమున గతినాస్త్రతతుల
నెంపి సేనలనెల్ల నేలపాల్జేసి 3240

రథము చూర్ణమొనర్చి రాక్షసునినేయ
అధిగతంబుగ నాత డంది శూలంబు 3241

నేయగా నది దున్మి హెచ్చి సేనాని
ఆ యసురుని నేయ హస్తముల్ దునిమి 3242

మరల బుట్టగ వాని మర్మంబులేసి
శిరములం గుట్టగా జేకూరె మరల 3243

ఇది వీరయాగ సాహిత్యమౌనంచు
కదిసి యాదైత్యునొక కరవాలమునవె 3244

అష్టోత్తర సహస్రాంశ వారముల
స్పష్టంబుగా గొట్టబడె కొండలట్లు 3 45

అంత వరబలమెల్ల నడగ దైత్యుండు
పంతగించుచు నొక్క పర్వతంబేయ 3246

ఇకనిట్టి శుంఠతో నెంత సేపనుచు
ప్రకటితంబుగ వాని బలిసేయనెంచి 3247

బ్రహ్మాండ భాండంబు బ్రద్దలుగనార్చి
బ్రహ్మణ్యమూర్తి సుబ్రహ్మణ్యుడతని 3248

శక్తినంపగ సర్వసైన్య సందోహ
యుక్తంబుగా దైత్యు నుర్వి పాల్జేసి 3249

ఉర్వి యుప్పర వీధులుబ్బూతలూగ
బర్వి యాసేనానిపట్ల లీనించె 3250

ఇది వినువారలు న్వినిపించువారు
అదిమి శత్రులనెల్ల నఖిలలోకముల 3251
తులతూగుటయెగాక తుదకు గోలోక
మలతిగా జేరి యందతిశయిల్లెదరు 3252
గరిమను దీని సంగతి నందిరామ
ధరణి నాఘుడుజంపె దశకంఠునాడు 3253
అనగ నామును లేమొ యడుగ బోవంగ
తన మదింగాంచి యాతంకిట్టులనియె 3254

## శూరపద్మాసురుడు తమ్ముని మరణవార్త విని దుఃఖించుట

కథవినందయ్యా ఆకరణి సింహాస్య
వధనల్పి యసన్వప్నవరు లెల్లమెచ్చ 3255
అరిగె సుబ్రహ్మణ్యుడటుపైని చారు
లరుదెంచి తెల్పగా నసురనాథుంతు 3256
ధరవ్రాలి పలుసార్లు తమ్ముడా నన్ను
దురవస్థలో నుంచి తొలగి పోయితివె 3257
మనమాటలకు లోగి మనపనుల్ సేయు
యని మిషామల కెంత హాస్యమయ్యెనుర 3258
అని యేడ్చి యేడ్చేడ్చి యతని దుఃఖంబు
పనివడి కోపమై భగ్గు మనంగ 3259
కొలువు కూటముజేరి కూర్చుండి యాత్మ
బలగంబులను బిల్చి పలికె రోసమున 3260
తమ్ములాత్మజులను తరుగ శూరుండు
ఎమ్మెయి నల్పువాడిక యుద్ధమనుచు 3261
నతిశయిల్లు నరాతి హతమార్తునింక
యితర బ్రహ్మండంబు లేర్పడ వెదలి 3262
నాయాజ్ఞగా దెల్పి నాకారితతుల
నా యోధన మొనర్ప నాహ్వానముగను 3263

రప్పించుడిక చార రాక్షసుల్ బోయి
తప్పెటాదులతోడ దగకేకలిడుచు 3264
అన వారులేగి యా యబ్జజాండముల
గని యందుగల దివౌకస వైరితతుల 3265
బిలువ వచ్చిరివారు భీషణాకృతుల
నిల పహాబిల జాల మెంతయును మ్రోయు 3266
అంత వారల గాంచి యాశూరపద్మ
డెంతయో యుప్పొంగి హెచ్చువేసమున 3267

## శూరపద్మడు యుద్ధమునకు వెడలుట

పరిమళ ద్రవ్య లేపన భూరి మాల్య
మరి రత్న భూషలంబర వేష మొప్ప 3268
పపసతాస్త్రం బాది బహు సాధనముల
అశని తుల్యాంచితంబైన టంకార 3269
యుక్తుడై తేజమై యొప్పు రథమందు
దిక్తటంబులు గూడ ధిమిధిమి మ్రోయ 3270
వీర నాగో ద్భూత విరచితం బౌచు
ఆరాధితంబైన యఖిల సామగ్రి 3271
హృద్యమై వేద్యమై యొప్పు వాద్యముల
చోద్యంబుగా దైత్య శూరుడుప్పొంగ 3272
గోపుర ప్రాకార కోటికలం దాటి
దాపు జేరగ భూత తండముల్ గాంచి 3273
పరుగులెత్తుచుబోయి బాహులేయునకు
యెరిగించ పృషదశ్వు నికదెమ్ము రథము 3274
అన నట్లొనర్చగా నఖిలాయుధముల
ఘన గదాశూల చక్రిముల దివ్యాస్త్ర 3275
శక్తి తోమర ప్రాసజాలముసలాది
యుక్తుడై వాద్యాదు లొప్ప నాయకులు 3276

కొలుప సైన్యములతో గూడ దావెకలి
తిలకించె దనుజేంద్రు ధీరవాహినుల 3277
ఘోరాతి ఘోరమౌ ఘోషలొప్పారు
వారి యురవడి సర్వవ్రాతులం గలిపె 3278
ఒక్కొక్క డొప్పుగా యొక్కొక్క లోక
మొక్కొక్క గడియలో నుక్కడచునట్టి 3279
అయుత శీర్షులు రెట్టిహస్త పాదులును
నియత వేగులు రక్త నిబిడకేశులును 3280
అనల నేత్రులు మహాహంకార యుతులు
ఘనసింహ వక్త్రాదిఘనులపై ఘనులు 3281
ధృవ లోకమును మించు దీర్ఘ కాయులును
భువనముల్ నిండారి పొల్పుటగాంచ 3.82
కొండలై వారొప్ప గొట్టె పిల్లలుగ
నుండిరట భూతాదు లోపగా లేక 3283
వీరబాహుం డాది వీరులా ఘోర
తీరునకు భీతిల్లి తిలకించు చుండ 3284
ఆ నిశాచరు లెల్లరా గుహుంబట్టి
బూన క్రుద్ధుండౌచు పొంగిసేనాని 3285

## గుహుడు రాక్షస కోట్ల నురుమాడుట

తనమూలశక్తి తత్వము ననుష్ఠించి
గుణనాద మొనరించ ఘూర్ణిల్లె జగము 3286
అంత వజ్రపు రవ్వలన బాణ ధాటి
యంతకంతకు హెచ్చగా గుహుండేయ 3287
కరశిరః ప్రముఖాంగకములు రాలంగ
కరితురగోష్ట్ర సంఘాతములు గూల 8288
ఛత్రకేతన చిత్ర చామరాదులను
ధాత్రి గొట్టుచు బర్వి దశదిశల్ వెలిగి 3 89

భువిని నాకసమును బొంది యా పద్మ
భవుని లోకంబుగా బ్రహ్మాండ మెల్ల 3290
అంది పోవుచు నచ్చటచ్చటం గల్గు
నెందరో రాక్షసుల నేర్చి హతమార్చి 3291
శరజుని బాణముల్ సర్వమున నొప్పి
తరిగె నారాక్షసుల తలలెల్ల నరసి 3292
హరి యజాదులు గూడ హడలి చూడంగ
మరియన్య లోకాళి మనుజాళనులును 3293
మందమై దొమ్మిగా మరి గుహుం జుట్టి
నందివ్వకయె యేయ సర్వాయుధముల 3294
చియునవ్వు నవ్వి గార్చిచ్చునగ లేచి
మరి సమీరుని గాంచి మనరథంబింక 3295
బరుపు చిత్రి విచిత్రి పక్కితోననిన
బరుప భూమ్యాకాశ బ్రహ్మాండ గతుల 3296
పటుతరంబుగ నస్త్ర పటలమున్గప్పి
కుటిలరాక్షస మహా కోటులను గూల్చ 3297
శవముల వఱుగా జగమెల్లనిండ
అవిరళ సారమేయాళి శివాళి 3298
తినుచుండ శరజన్ము సర్వాయుధములు
ఘన మార్గమున బర్వె కర్చురుల్ బెదర 3299
శరజన్ము రథమొప్పె చదల మార్గమున
సురలు మెచ్చగ వాయుచోదకత్వమున 3300
గాంగేయు డట్లు రాక్షస కోట్లదాక
పొంగి రక్తపుజేర్లు భూమి యందుంచి 3301
పాతాళమున కంటె బహు కబంధాది
జాతులెల్లను మెచ్చ జాలగా ద్రావి 3302
దనుజ నాశసమాచు తావాదలినప్డు
గని యన్యజగములం గలుగు దైత్యులును 3303

పిచ్చటిల్లుచు వచ్చి భీషణార్భటుల
హెచ్చి తాకుచు నుండ నీప పుత్రుండు 3304
విసువ కుండగనేసి వివిధాయుధముల
అసురులన్ బోకార్చ నతి రయం బొప్ప 3305
మరియు దోచుచునుండ మార్గణంబులను
నరికట్టి సర్వ లోకాళి మార్గముల 3306
పూని యేయుచు నుండ భూతేశు తనయు
బాణ ఘాతములచే బహు రాక్షసాళి 3307
యంగంబు లగములై యంతయు నింత
పొంగ రక్తము సర్వభూములను బర్వ 3308

## శూర పద్మాసురుని యుద్ధము

శూరుండు వెలుగిటి శూరత్వ మొప్ప
తేప బోవగ నిచ్చి ధీరతఁ బల్కె 3309
నాకు మరణ లేదు నాకులను గూడి
యాకరణి ననుదాక నెంచి రాక్షసుల 3310
నిర్జించినట్టి యీ నిన్ను నిర్జించి
నిర్జరాదుల గూల్తు నిముసమందనగ 3311
గాంగేయుడనె శూరుగాంచి యోదుష్ట
పొంగ బోకుము నిన్ను బోకార్తు నింక 3312
అనగ శూరుం డప్పుడధిక కోపమున
దన వింటి నెక్కించి దానవారులను 3313
భూత గణముల నేయ బొంగి వారెల్ల
శాత శిలీముఖాస్త్రంబుల గురియ 3314
అసురుండు వెసదున్మి యంత నేయంగ
వెసనిల్వగా లేక విరిగి పారంగ 3315
వీరబాహు ప్రముఖ వీరాదులెల్ల
శూరునేయ నతండు చొక్కించివారి 3316

వీరబాహుని నెత్తి వీచి యాశరజు
జేర జిమ్మగ చంద్రశేఖరుని పట్టి 3317

గర్జిల్లను దాక గర్బురాధిపతి
నిర్జరాధ్యక్షుని నియుతాంబకముల 3318

నేయ లోకమునెల్ల నెంతయు నిండి
పాయక లయకాలు పాశంబు లనగ 3319

బరగ నిర్జరులెల్ల బరగుట గాంచి
హరుని పట్టియు వాని నవని పాల్సేయ 3320

వందలు వేలు నూపై లక్షలిల్లై
సందడింపుచు నేయ చదల నిండంగ 3321

మఱియేయ మఱియేయ మంటలొప్పారె
శరకీర్ణమైయొప్పె సర్వలోకములు 3322

శూరుమావుల శంఖు నూనుదేయంగ
శూరుదేసె సమీరు జొక్కగా నపుడు 3323

అపుడు విష్ణ్వాజ్ఞచే నగ్నిదేవుండు
నపచితంబుగ గుక్కుటాకారమౌచు 3324

ధ్వజముగా నొప్పారె బాహులేయనకు
నజయుడౌనట్లుగా నద్భుతరీతి 3325

కడమేఘమట్లుగా గర్జిల్లి యపుడు
కడుకొని శూరు డాక్రందించి యేయ 3326

ఆదితేయులు భయంబందగా గుహుడు
ఆదిత్య మార్గంబు నందియేయంగ 3327

అంబరంబున వారి యరదముల్ తరణి
బింబద్వయంబుగా బేర్చ నార్చుచును 3328

చక్రంబులో నాగ చాలగిరగిరగ
విక్రమించుచు వాయువేగములతోడ 3329

పాతాళమాది సప్తస్థావరముల
అతీరు సత్యాదులౌ నూర్ధ్వగతుల 3330

బ్రహ్మాండముల నెల్ల బరగి గర్జిలుచు
బ్రహ్మాండముగ బోర పౌరుషము లొప్ప 3331
సర్వ జగములు గూడ సంక్షోభమందె
నుర్వియుప్పర వీధు లుఖ్ఖాత లాగె 3332
ఈతీరు నేట్లాడ హెచ్చి శరజుండు
పాతకా నిల్వరా పారిపోకనుచు 3333
అరదంబు తుత్తుమురు నప్పుడొనరించ
ధరణిపై నొప్పుచాతండేసె గుహుని 3334
బాహుంలేయుడు ద్రుంచి బహు మార్గణముల
బాహుయుగ్మంబుపై పఱుపగా నవి యు 3335
అతని కర్కశదేహమంటి పొడిపోచు
క్షితిరాల దనుజుండు చెలరేగి యేయ 3336
అవి వాని నంటకయె యణగి పోవంగ
నవగణింపక మాయ నంది యసురుండు 3337
ఎగిరిపోవగ గుహుండేగె వెన్నంటి
యగణితంబుగ దైత్యుడతలాది నిఖిల 3338
జగములన్నిటి దాటి చక్రవాళాది
యగము లన్నిట దోచ నంటి యాగుహుడు 3339
సాయకంబుల నేయ శర్వరీచరుడు
ఆయోధన మొనర్చె బ్రహ్మాండమంది 3340
అటకేగి శరజాతా యసురుని దాకి
చటులాస్త్రముల వాని సాధకమునేయ 3341
అతడు నాకంబంటి యధిరధ స్మరణ
గతి జేసికొని మున్ను గ్రమ్మగా బడిన 3342
జగముల బలములం జరచరజించ
నగణితంబుగ దోచు నసుర సంఘములు 3343
బాణవర్షంబులక బరగించ గుహుని
గానబడయక పర్వి గణములేశ్వంగ 3?44

ఈసుపట్టియు నప్పు డీక్షణాగ్నులనె
నాశమున్గావించి నాకుబుబ్బంగ 3345
తనచక్రి ఖడ్గాయుధంబులఁ బనుప
అనిధాత్రి నొప్పారు యఖిల రాక్షసుల 3346
నాశనం బొనరింప నాకారి విసిగి
పాశమొక్కటి మాయ బరగించియేయ 3347
విజ్ఞానమున దాని విధము దూలించి
ప్రజ్ఞచే ధాత్రిపై బడ దైత్యునేయ 3348
అంత శూరుడు బార నతని వెన్నంటి
వింతగానేయు చవ్విధి బోవ బోవ 3349
పరగ శూరుడు వేయుపై నెన్మిదైన
అరవింద జాండముల కరుగగా గుహుండు 3350
మరి వెంట నంటగా మనుజాశి కలగి
పరుగెత్తి తన వీర భవ్య మహేంద్ర 3351
పురమున కేగగా బోయె వెనువెంట
మరి శూరుడెదనెంచి మంతనోక్తముగ 3352
అతని మాతను దల్చ ఆపెయు రాగ
అతడేడ్చి తనుగెల్చు నట్లొనర్చుమన 3353
వీర శూరా యిట్టు లెంత జేసితివి
తారక జిత్తునుందలచి యల్పునిగ 3354
వదలడురా కృత్తివాసు తనయుండు
అదను దప్పెర వినుమైన నొక త్రోవ 3355
మందరాద్రిని నొక్క మహనీయపాత్ర
యందుండు సుధదేగ నద్దాని పటిమ 3356
నీవారు జీవించ నేర్తురుర యింక
నీవారి గూడి నీనేర్పు జూపించు 3357
మనిచెప్పి యేగ నాయంబ వాక్యమున
దన గెల్పు నిజమంచు దనమది నెంచి 335[illegible]

అతడింద్రలోకపు నరదముద్దలచి
క్షితిధరంబును గూర్చి జెప్పి తెమ్మనగ 3359
క్షణము లోపల దేగ గలి మాత్రమునె
అసుర పుత్రాదులొ నందరు లేచి 3360
గదుర ఘోరి కతండు గని పొంగి యొక్క
పదపు సింగము నెక్కి మారొక్కనియె పుత్ర 3361
పౌత్రానుజుల సర్వబలములం గూడి
శాత్రవులగాంచి నిర్జర భూతతతులు 3362
పజులై హడరెత్తి పాఱుచుండంగ
ఆక్షణంబుననెంచి యసుర సేనాని 3363
పశుపతాస్త్రంబేయ బహుఃప్రముఖులు
దిశవెల్ల దీపించి దివ్యాస్త్ర తతుల 3364
ఫాలాగ్నులనుగూడ భస్మంబొనర్చ
ఆలోనె మాయమై రందరు గూడ 3365
తూరుడొంటిగ నిల్చి సుత్రామలోక
పౌరథంబును బిల్చి యంబికాతనయు 3366
వీరగణముల నెల్ల విపరి బ్రహ్మాండ
పారణ్యముల మధ్యమందు జేయుమన 3367
శరజుండు దివ్యాస్త్ర సమితిచే నిల్పి
యయదైన నాయింద్ర యరదమున్ బిల్చి 3369
ఇక నీకు పేహార వింద్రారి పనులు
ప్రకటితంబుగనంచు బనిపియావలకు 3370
అతని నేయగ నప్పు డసురుడేయంగ
నలి ఘోరమైన నాయసుపుంతు వీక 3371
వాహనంబును డిగ్గి వడి శూలమెత్తి
బాహులేయుని పైవ పడగొట్టెయతడు 3372
మించిలక్షలు కోట్లు మేటి బాణముల
నించి పంచాస్యమును నేలపాల్జేయ 3373

కాక ఘూక మయూర కంకాళ హంస
కాకోదరాది సంజ్ఞలహెచ్చి రిపుల 3374

చీకాకొనర్చి మూర్ఛల జేసి మరియు
పీక రెక్కల గొట్టి విరిచి కొందరిని 3375

తుండాగ్రమున జీల్చి తునిమి కొందరిని
ఖండించి నఖపాళి గదిసి కొందరిని 3376

చరణ ఘాతములచే జదిపి కొందరిని
నురుమాడి నురుమాడి నూర్చివిడి యొనర్ప 3377

శిఖిరూపమున నొప్పి జిష్ణుడే తెంచ
శిఖివాహనుండెక్కి జృంభించి దనుజు 3378

కరవాలమున నేయ కప్పుచుందదరి
ధరరూపమును వేగ దాల్చియేతేర 3379

అబ్ధిరూపంబొంచు నద్దాని మ్రింగ
స్తబ్ధుడై దనుజుండు సాగరంబైన 3380

బడబాగ్ని రూపమై భక్షించె గుహుడు
కడువడి విలయాగ్నిగా నతడురాగ 3381

జలధారయై దాని జల్లార్చె గుహుడు
విలయ మారుతముగా వెడలె శూరుండు 3382

కలచె శేషుండౌచు గొకీసుతుండు
బలముచే శూరుండు బహు మాయలిట్లు 3383

భూత ప్రేత పిశాచ భూరి శార్దూల
మాతంగ భల్లూక మహిష రూపముల 3384

దాల్చ తత్ప్రతియౌచు తారకాంతకుడు
గూల్చుచుండగ నిట్లు గూలుచుండంగ 3385

ఈ రీతిగా వార లేడహోరాత్రు
లారటింపుచు బోరి రమిత దర్పముల 3386

## గుహుని విశ్వరూప సందర్శనము

అంతపై శాంతుడై యసురు డొప్పార
వింతగా గుహుడొప్పె విశ్వరూపమున 3387
పాద మూలంబులఁ బరగె శైలములు
పాదాగ్రముల నపాం పతులు నఖాళి 3388
ఉడు గణంబులు గుల్ఫ మొప్ప దిక్పతులు
తడయక జంఘాళి తనరగా మునులు 3389
జానువుల్ కల్పాగ్ర సంస్థలై తోప
బూది యూరువులయ్యె బోసగ దిక్పతుల 3390
జఘన సంధుల యందు చాలె రుద్రాళి
జఘన భాగంబందు సప్తముని వసులు 3391
పక్ష పార్శ్వములందు బరగె మూర్తులును
వక్షస్థలంబున స్వరలె శాస్త్రములు 3392
దిక్కులల్ మేఘాళిమై దివి గుహ్యముగను
అక్కజంబున నాభియయ్యె నాకంబు 3393
విజ్ఞాన మొప్పె నా విమల రూపమున
యజ్ఞోపవీతమై యలరె గుణాళి 3394
రోమంబులం దొప్పె రూఢిగా సృష్టి
ఆ మహాస్థలములె హస్తంబులయ్యె 3395
భుజములందున నాత్మ భూవిష్ణులొప్ప
నిజముగా గళమందు నిల్చె కాలంబు 3396
వదనమందున వేద వరము లుపొంగ
నుదయించె నోంకార మొప్పి మూలమున 3397
తరణి చంద్రాగ్నులత్తటి నేత్రములుగ
అరయ మంత్రములెల్ల నాతని కళగ 3398
శ్రవణముల్ దిక్కులై చాలగా సృష్టి
తివుర సంకల్పమై దివ్యతేజమున 3399

కోటిప్రభాకరుల కోటిశశిధరుల
గోటి సంతాపుల గోటితో మీటి 3400

పరమచిచ్ఛక్తి సుబ్రహ్మణ్యుడైన
సురలెల్ల నుతియించుచుండ శూరుండు 3401

కాంచి నిర్విణ్ణుడై జ్ఞాన మార్జించి
యెంచె దనమనమునం దిట్లుదైవాజ్ఞ 3402

తనతేజమున నాదు దైత్యమాయలను
పనిగొన్న యప్పుడైన బడయగానైతి 3403

హరిముఖాదులదెల్పి నపుడైన వీని
నెరుగ లేకుంటినే నెంత లుబ్ధుండ 3404

ఇతడు డింభకుడంచు నెంచితినిగాని
గతిలోకములకంచు కానలేనైతి 3405

మూడుమూర్తుల కాదిమూర్తి యితడన్న
జాడయే నెంచక జడబుద్ధినైతి 3406

ఐశ్వర్య మదమున న్నలరు నాకెట్లు
దృశ్యమౌ నా మహా దివ్యమహిమంబు 3407

నా మేలుబడి యిట్లు నటియించి నన్ను
ఈ యవస్థకు దెచ్చె యింతయేమిటికి 3408

వేయుపై నెన్మిది వెలయు లోకములు
ఆయత్తమయ్యె నీయయ్యాయందిపుడు 3409

ఈ మహామహనద్దై యెసగు తేజంబు
నా మనంబున నేడు నాటె నిజముగను 3410

నా తపానికి మెచ్చి నను రక్షసేయ
ఈ తీరుగా నీత డెసగెను గాన 3411

ఇతనికి నతిసేయ నెంచె నామనము
గతి ఈతడే యంచు గలిగెను నాకు 3412

ఐన నీ ఫలమెల్ల నమర నాయకుల
పూని శిక్షార్హుల న్యూన చేయుటయె 3413

నీ మహాదర్శనం బెసగగా నింక
నా మహాదోసముల్ నశియించె నేను 3414
అని యిట్లు తలపోయు నట్టి కాలమున
తన రూపమును మార్చి తనపూర్వరూప 3415
మున నిల్వ శూరుండు మొదటి యట్లొచ్చు
అని యొనర్తు నటంచు హంకారమంది 3416
తనమాయచేనట మహాంధకారమును
గన జేసి ఘోరమహా కాయమేపార 3417
అదితేయుల హతంపార్చ బైకొనగ
నాదిక్కుగాంచి తన యందైన శక్తి 3418
ఆవాహనముజేసి యసురుని జంపు
మీవంచు బంపనది యినకోట్లతేజ 3419
మనలాప్పుతంబుగా నంధకారమును
దునియించి రాక్షసుని దునుమరా గాంచి 3420
వనధియందున జేరి ఫలపుష్పయుక్త
ఘనవృక్షమయ్యె లోకమున కన్మొరగి 3421
అది మహాద్భుతముగా నఖిల లోకముల
బొంది జృంభించగా ఘూరిగుహశక్తి 3423
మూలముల్ దెగనేయు మొదటిరూపమున
శూల మొక్కటి దాల్చి శూరుదేతేర 3423
చిటపట ధ్వనితోడ చెలగియాశక్తి
పటపటాంచితముగా బ్రహ్మాండమదుర 3424
అదితులెల్లరు మెచ్చ నసురుని యురము
గదిసి ఫట్టున జించి కాశ్యపివైచి 3425
ఈ వియద్గంగలో నవగాహనంబు
గావించి గుహునిలో గలసె నాక్షణమె 3426
అంత శూరునిశవం బందుండి కేకి
వింత కుక్కుటములై వెడలి యా గుహుని 3327

పాదంబులనుబ్రాల బాహులేయుండు
ఆదరింపుచు వాటి నగ్ని వాసవుల 3428
కవగతం బొనరించి యఖిల లోకముల
కవగతంబుగ నప్పుడాకుక్కుటమును 3429
ధ్వజముగా సల్పి యావల మయూరమును
నిజవాహనము సల్పె నిర్జరుల్ వొగడ 3430
వీరబాహుంతాది వివిధసేవకులు
తారకజిత్తు నత్తరి వేడ్కగొల్వ 3431
ధాత విష్ణ్వాదు లందరు గాంచి మ్రొక్క
ఆతండు దయతోడ నందరిని గాంచె 3432
బాగులేప్పుచు బోయి షాణ్మాతులుండు
శూరుని జంపిన చొప్పెఱింగింప 3433
అతని పట్టపుదేవి యగు పద్మకోమ
లత ధాత్రిబడి సాధు లక్షింప నేగె 3434
అతని పుత్రుండు మున్నబ్ధిలో జొచ్చి
బ్రతికి మీనంబైన వరహిరణ్యుండు 3435
జనక ఘాతలనట్లు చనిపోవుటెరిగి
తనవారికై దుఃఖ తప్తుడై తుదకు 3436
ధ్వజవాహనములుగా తండ్రి జీవాత్మ
భజియించు టెటిగి యాపనికి మోదించి 3437
తనవారికెల్ల నూర్ధ్వ క్రియల్ సల్పి
చనికావ్య శిష్యుడై చాలవిజ్ఞాన 3438
మును బొంది తపియించి మోక్షమూర్జించె
తనునులోకంబెన్నదై వాజ్ఞ కతన 3439
వీరబాహుని బిల్చి విబుధ సేనాని
శూరనిర్బంధాన శోకింపుచున్న 3440
అట్టి జయంతాదులైన నిర్జరుల
కట్టులన్ విడువుమీ కాగనాయాజ్ఞ 3441
అన నాతడప్పుడే యట్లొనర్పంగ
ఘనమైన గుహునాజ్ఞగా వారలొప్ప 3442
అమృతము స్మరియించి యా జన్య ధాత్రి
గమనించి తనపక్ష ఘనుల నందరను 3443

జీవింపగా జేసి శివ శివాత్మజుడు
ఆపిర మాహేంద్రి మబ్ధిలో జేర్చి 3444
సురభూత జాలముల్ జుట్టి సేవించ
గరిమ జేరెను సంధి ఘన పత్తనమును 3445
ఆరాత్రి వసియుంచి యుదయోదయమున
గౌరవంబున సర్వ గణయుతుండౌచు 3446
తనమయూరము నెక్కి తగ సమ సంబు
లను గాంచుచును పోయి లక్షింపవేడ్క 3447
అపరశైలంబునం దతడుండ గోర
నపుడు దేవతలెల్లరా విశ్వకర్మ 3448
గన నాతడానగం బంను సుద్యాన
మణి విరాజిత దివ్య మహీసు కల్యాణ 3449
గోపుర ప్రాకార కుడ్యాంచితంబు
దీపిత ఫలపుష్ప దేశీయ వస్తు 3450
విరచితంబౌ పురము వేడ్క నిర్మింప
పరివార యుతుడుగా బాహులేయుంతు 3451
అందు దానివసించె హాయిగొల్పంగ
బృందారకులు గోర పురుహూతునపుడు 3452
భావమందున నెంచి వర నిజపుత్రి
దేవసేనను దెచ్చి దివ్యసేనాని 3453
కియ్యవేడగ నాత డెంతయు నొప్ప
అయ్యెడ సురశిల్పి యట దివ్యరత్న 3454
మణులచే కల్యాణ మండపం బొంటు
గనజేయగా దివ్యగణము మౌనులును 3455
మరిలోకముల నొప్పు మహనీయులెల్ల
హరి శతానందాదు లైన సురవరులు 3456
రాగ దివ్యాసనాల్ రహినిచ్చు నంత
వేగ వచ్చిరి యుమాభీము లాపట్ల 3457
తలిదండ్రులకు మ్రొక్కి తారకాంతకుడు
నలరించె తనతండ్రి నంబను గూడ 3458

## కుమార స్వామి వివాహము

దివ్య వాద్యములెల్ల ధిమిధిమి మ్రోగె
దేవదేవాదులర్ దీర్చి మోదించ 3459

సుర సురాదులగూడ చూచి సేవించ
సరసి సంయమిలోక మాశీర్వదించ
గంభీరముగ దేవ గానముల్ హెచ్చ
రంభోర్వసులు గూడి రక్తిగా నాడ
అరుణ చంద్రులు ఛత్రి మచట బట్టంగ
వరుణ దేవుడు పార్శ్వవర్తియై కొలువ
మాతరిశ్వుండు వింజామరం బేయ
పీతాంబరుడు హెచ్చుప్రేమ జూపింప
పరమేష్ఠి లోనైన బ్రహ్మ లెల్లరును
వరుసగా వేదాశి షనసల జెప్ప
తక్కిన దిక్పాల తతులు మోదమున
చక్కబెట్టగ పెండ్లి సామగ్రులెల్ల
వీర బాహువు భక్తి వెల్గ పూజించ
వారక నవలక్ష వరులు గీర్తించ
అల సురాంగన లెల్ల నారతుల్ బట్ట
సలుప నృత్యంబు లప్సర లెల్ల లక్ష్మి
వాణితోగూడి దివ్యముగ కల్యాణ
గానంబొనర్పగా గాంచి మఘవుండు
అంచితంబుగ లోక మంతయు మెచ్చ
క్రౌంచఘ్ను పాదముల్ గడిగి యాతీర్థ
మును తాను బొంది సమ్మోద మేపార
ఘనుల కెల్లరకిచ్చి కార్తికేయు నట
గంధపుష్పాక్షతా గరు ధూపదీప
సందీప్తగా జేసి సాగిలిమ్రొక్కి
మధుపర్క మిచ్చియా మహదేవు సుతుని
వధువుతో గూర్చగా వాణీశు నాజ్ఞ
గళమున దివ్యమాంగల్యమ్ము గట్టి
కలప పుష్పమాల కంఠమం దడగ
శతమన్యు పుత్రియా సభయందు దివ్య
పతిమ్రొక్కి వైచె నొకమాల గుహునకును 3474
అవిరళంబుగ నగ్ని కట ప్రిణా మించ
ధవు పత్నులకు నరుంధతిని జూపించె 3475

తలి దండ్రులకు మ్రొక్క తన్మయు రౌచు
నలరి వారల గుర్చిచ్చి యా శీస్సులిడిరి 3476
ఆశర్వ శర్వాణి లావారమేగ
ఈసు పట్టియు భక్తి యొసగగా సర్వ 3477
విధముల బూజించి పెద్దలనెల్ల
విధమెక్క వీసు సారథ్య మేపార 3478
తనయత్త మామల స్తనియించు వేడ్క
మనమున దలపోసి మఘవునితోడ 3479
అమరావతిని జేరి యచట సౌఖ్యమున
నమరాళి సేవించ యానంద మొప్ప 3480
సురగజయంతాది సంవృతుండౌచు
పరిహాసముల నొప్పు బావలతోడ 3481
గంధర్వ గానముల్ గాంచి మెచ్చుచును
బంధురంబగు నాట్యపక్కి గనొనుచు 3482
ఇంద్రోపచారంబు లెన్న మోగొనుచు
ఇందిరి బ్రహ్మానంద ఈశ్వరానంద 3883
ములహెచ్చి పత్నితో మోదమేపార
గలసి కొన్నాళ్ళుండి ఘనవాస మురుగ 3484
తలచ జిష్టుండను తన పత్నితోడ
పిలసిల్లి సారధిగ పిరవాపుబందు 3485
భక్తితో సేవించ బంధువుల తోడ
శక్తి ధరుడును వేడ్కనెన వాసమునకు 3486
ఇది కథా సారాంశ మెంతయు దీని
జదువు వారును భక్తి శాలురై వినెడి 3487
వారు వ్రాసెడి వారు వర్ధించు వారు
వారు వారల గొల్చువారు తద్బంధు 3488
వర్గంబులును గూడ వసుపగా వేడ్క
నిర్గమింతురు శక్తి నెలవున కొప్ప 3489
అంతియేగాక నీయవని యందొప్పు
అంతకాలముగూడ నైశ్వర్యసిరుల 3490
వరలు చుండగ వారి వంశంబు నందు
కరుణించి చిచ్ఛక్తి కలిగి యొప్పారు 3491
అయ్య మీకెల్లరకు నంజలి మొనర్చి
నెయ్యంబుగా దీని నిలుపుచున్నాడ 3492

## గుహుని విశ్వరూప సందర్శనము

అంతపై శాంతుడై యసుర డొప్పార
వింతగా గుహుడొప్పె విశ్వరూపమున 3387
పాద మూలంబులఁ బరగె శైలములు
పాదాగ్రముల నపాం పతులు నఖాళి 3388
ఉడు గణంబులు గుల్ఫ మొప్ప దిక్పతులు
తడయక జంఘాళి తనరగా మునులు 3389
జానువుల్ కల్పాగ్ర సంస్థులై తోప
బూది యూరువులయ్యె బొసగ దిక్పతులు 3390
జఘన సంధుల యందు ఛాలె రుద్రాళి
జఘన భాగంబందు సప్తముని వసులు 3391
పక్ష పార్శ్వములందు బరగె మూర్తులును
వక్షస్థలంబున స్వరలె శాస్త్రములు 3392
దిక్కుపల్ మేఢ్రమై దివి గుహ్యముగను
అక్కజంబున నాభియయ్యె నాకంబు 3393
విజ్ఞాన మొప్పె నా విమల రూపమున
యజ్ఞోపవీతమై యలరె గుణాళి 3394
రోమంబులం దొప్పె రూఢిగా సృష్టి
ఆమహస్థలములె హస్తంబులయ్యె 3395
భుజములందున నాత్మ భూవిష్ణులొప్ప
నిజముగా గళమందు నిల్చె కాలంబు 3396
వదనమందున వేద వరము లుప్పొంగ
నుదయించె నోంకార మొప్పి మూలమున 3397

కోటిప్రభాకరుల కోటిశశిధరుల
గోటి సంతాపుల గోటితో మీటి 3400
పరమచిచ్ఛక్తి సుబ్రహ్మణ్యుడైన
సురలెల్ల నుతియించుచుండ జూపండు 3401
కాంచి నిర్విణ్ణుడై జ్ఞాన మార్గించి
యెంచె దనమనమునం దిట్లుదేవాజ్ఞ 3402
తనతేజమున నాదు దైత్యమాయలను
పనిగొన్న యప్పుడైన బడయగానైతి 3403
హరిముఖాదులదెల్పి నపుడైన వీని
నెఱుగ లేకుంటినే నెంత లుబ్ధుండ 3404
ఇతడు డింభకుడంచు నెంచితినిగాని
గతిలోకములకంచు కానలేనైతి 3405
మూడుమూర్తుల కాదిమూర్తి యితడన్న
జాడయే నెంచక జడబుద్ధినైతి 3406
ఐశ్వర్య మదమున న్నలయు నాకెట్లు
దృశ్యమౌ నా మహా దివ్యమహిమంబు 3407
నా యేలుబడి యిట్లు నటియించి నన్ను
ఈ యవస్థకు దెచ్చె నింతయేమిటికి 3408
వేయుపై నెన్మిది వెలయు లోకములు
ఆయత్తమయ్యె నీయయ్యయందిపుడు 3409
ఈ మహామహానదై యెసగు తేజంబు
నా మనంబున నేడు నాకె నిజముగను 3410
నా తపానికి మెచ్చి నను రక్షసేయ